# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 10 సంచిక : 3 హైదరాబాద్ 128 మార్చ్ 2012 పేజీలు : 68 రు. 15

- రాష్ట్ర బడ్జెట్ 2012-13
- పాలతో కడిగితే అవమానం పోతుందా?
- అవినీతి - ఐఎఎస్‌లు, మంత్రులు
- యానాం ఘటనల పూర్వాపరాలు
- యాన్ మిర్డాల్ - 'భారత్‌పై అరుణతార'
- మానవ రహిత విమానాల కథ
- ఇరాన్‌పై యుద్ధ మేఘాలు

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు


కొత్తచూపు
పేజీ 295, రు.120


అభివృద్ధిని ఇలా చూద్దాం
పేజీ 205, రు.80


మీరు-నేను- ఆర్థికం
పేజీ 215, రు.60


ఒక దళారీ పశ్చాత్తాపం
పేజీ 172, రు.50


కుట్రాజకీయం
పేజీ 114, రు.40


ఇన్ సర్చ్ ఆఫ్ మెథడ్
పేజీ 367, రు.200


ఇండివిడ్యుల్ సబ్-గ్రూప్స్ గ్రూప్స్ అండ్ ఫ్రీడం
పేజీ 59, రు.75


క్రైసిస్ అండ్ డెవలప్‌మెంట్ ఇన్ మార్క్సియన్ ఫ్రేంవర్క్
పేజీ 105, రు.80


ఆన్ ఎడ్యుకేషన్
పేజీ 142, రు.100


మెథడాలజీ ఆఫ్ సోషల్ ఎంక్వైరీ
పేజీ 201, రు.150


ఫిఫ్టీ ఇయర్స్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్
1956 – 2006
పేజీ 568, రు.300


రాబందు వాలిన నేల
పేజీ 408, రు.180


వ్యవసాయం – ప్రపంచీకరణ
పేజీ 224, రు.100


కళ్లముందరి చరిత్ర
పేజీ 309, రు.80


పరిచయాలు
పేజీ 194, రు.50


గంగానమ్మ
పేజీ 61, రు.15


జాత్యహంకారి హిట్లర్
పేజీ 171, రు.80


రాబందు నీడ
పేజీ 111, రు.25


విశ్వాంతరాళం
పేజీ 189, రు.90


మానవ పరిణామం
పేజీ 211, రు.90


జీవకణాలూ – నాడీకణాలూ
పేజీ 184, రు.80


ప్రకృతి – పర్యావరణం
పేజీ 230, రు.90


లేచినిలిచిన తెలంగాణ
పేజీ 303, రు.120

128

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

మార్చ్ 2012
సంపుటి : 10
సంచిక : 3



## లోపలి పేజీల్లో...





ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ /**
**చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

## మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ కృతజ్ఞతలు

**వీక్షణం ఆర్థిక స్థితి గురించి విజ్ఞప్తికి ప్రతిస్పందనగా ఫిబ్రవరి 2012లో అందిన విరాళాలు, సహాయాలు**

ఎస్. కిషోర్ కుమార్ లైబ్రరీలకు సంవత్సర చందాగా రు. 5,000; ఎ. నర్సింహారెడ్డి, టి. రమేష్, వడ్డేపల్లి మల్లేశం, ముత్తన్నగారి రాజేందర్‌రెడ్డి పత్రికకు విరివిగా చందాదారులను చేర్పిస్తూ సహకరిస్తున్నారు. – సం.

వీక్షణం ఫిబ్రవరి 2012లో ఎం. సూర్యనారాయణరెడ్డి తన ఉత్తరంలో అణు విద్యుత్ వాడకం తప్పనిసరి అని రాసారు. అణు విద్యుత్తుతో ఉన్న ప్రమాదాలు, ఖర్చులు గనిలో తవ్వకం నుండి మొదలై ఉత్పత్తి జరిగిన వేల సంవత్సరాల వరకు కొనసాగుతాయి. యురేనియం గనుల్లో టైలింగ్ నీరు నుండి, రియాక్టర్లలో వాడిన ఇంధనం భద్రపరిచే దాక అణుధార్మిక వ్యర్థాలు కొన్ని వేల సంవత్సరాలు ప్రజావాసాలకు, పంట భూములకు, ఉపరితల, భూగర్భ జలాలకు, కొన్ని సందర్భాలలో గాలికి కూడా అందకుండా భద్రపరచాలి. అవినీతి, నిర్లక్ష్యం, అసమర్థత, ప్రజాపీడన ప్రధానమంత్రుల నుండి పోలీసు కానిస్టేబుల్ దాకా విస్తరించిన దేశంలో అణువిద్యుత్ అంటే కొరివితో తలగోకడమే. పెట్టుబడిదారీ విధానం శ్రామికులను, సమాజాన్ని మాత్రమే కాదు తరతరాలకు చెందవలసిన పర్యావరణ వనురలను అక్షయపాత్ర తోడినట్లు తోడుతున్నది. ఇదేదో సుదూరంలో ఉన్న అమూర్త (అబ్‌స్ట్రాక్ట్) సమస్య కాదు. ప్రత్యేక ఆర్థిక మండలాలు, అడ్డు ఆపు లేకుండా వస్తున్న రహదారులు, తాగడానికి పనికిరాకుండా పోతున్న భూగర్భ, చెరువుల జలాలు, సారం కోల్పోతున్న భూములు, అదే సమయంలో పెరుగుతున్న వినియోగదారీ చెత్త, దానిని కొనిపించడానికి చిన్న పిల్లలను, యువతను గురిచేసుకొని వేల కోట్ల ఖర్చుతో పబ్లిసిటీ, మార్కెటింగ్, వ్యాపార ప్రకటనలు. లాభాలను తిరిగి పెట్టుబడిగా మార్చి తిరిగి మరింత చెత్త ఉత్పత్తి – మనుషులకు అవసరమైన దేనినైనా, భూమి, నీరుతో సహా, వ్యాపార సరుకుగా మార్చే ఆర్థిక విధానం, దానికి అనుకూలమైన ఆర్థిక, సాంస్కృతిక భావజాలం – ఇదీ మన పరిస్థితి. దీనికి ప్రత్యామ్నాయం కనుక్కోకపోతే, సంక్షేమం కేంద్రంగా ఉండే రాజకీయార్థికం కోసం అన్వేషణ చేయకుంటే, ఎన్ని పరిశ్రమలు వచ్చినా ప్రయోజనం కొద్ది మందికి. నష్టం తరతరాలకు.

**– కె. నరేంద్రమోహన్**
మెల్బోర్న్, ఆస్ట్రేలియా

వీక్షణం ఫిబ్రవరి 2012 సంచికలో ఒక ఉత్తరం నేరుగా అణు విద్యుత్తును సమర్థించగా, వి. హనుమంతరావు, కొడవటిగంటి రోహిణీప్రసాద్ వ్యాసాలలో అణు విద్యుత్తుకు అనుకూల ప్రస్తావనలు కనబడ్డాయి. అణు విద్యుత్తు ప్రమాదకరమని ఇటీవల జపాన్ ప్రమాదం తరువాత ఎంతోమంది రాస్తున్నారు. అంతకు ముందు నుంచే ఆ అభిప్రాయాలు ఉన్నాయి. మరి ఈ ఇద్దరు ప్రగతిశీల రచయితలు ఆ ప్రస్తావనే లేకుండా అణు విద్యుత్తుకు అనుకూలంగా రాయడం ఆశ్చర్యంగా ఉంది. ఇంతకూ అణు విద్యుత్తు అవసరమా? లేదా? మంచిదా? కాదా?

**– టి. రాములు**
నల్లగొండ

వీక్షణం ఫిబ్రవరి 2012లో చిమ్మె జాన్‌బర్నబాస్ రాసిన 'కల్తీసారా మరణాలకు బాధ్యులెవరు' వ్యాసం చాలా ఆలోచనాత్మకంగా ఉంది. కృష్ణా జిల్లా మైలవరం నియోజకవర్గంలో కొల్లిమెర తండాలో జరిగిన కల్తీసారా మరణాలను గురించి, వాటికి బాధ్యులెవరు అనే విషయాన్ని గురించి వివరణాత్మకంగా తెలియజేశారు. ఒక మంత్రి కుమారుడు రోడ్డు ప్రమాదంలో మరణిస్తే, అసలు ఒక విద్యార్థికి ఇరవై లక్షల రూపాయల ఖరీదైన కారు ఎందుకు ఇచ్చారు అని ఎవ్వరూ ఆలోచించలేదు. కానీ, అది భగవంతుని చిత్తం అని, వారి కుటుంబాన్ని పరామర్శించడానికి వెళ్లిన మంత్రులు, ఎం.ఎల్.ఎ.లు, ప్రభుత్వ అధికారులకు కల్తీసారా తాగి మరణించిన ఇరవై మంది వ్యక్తులు కనిపించలేదా? కొందరు స్వార్థంతో కేవలం ధనార్జనే ధ్యేయంగా, రాజకీయ నాయకులు, ప్రభుత్వ అధికారుల అండదండలతో కల్తీసారా తయారు చేస్తే, అది తాగి మరణించిన వారిని ఓదార్చే బదులు, ఆ అక్రమ వ్యాపారులకు అండగా ఉండడం దుర్మార్గమైన విషయం. ఎక్సైజ్ శాఖలో పనిచేస్తున్న ఒక పెద్ద స్థాయి ఉద్యోగి సైతం ఆ వ్యాపారులకు వంత పాడడం ప్రజల పట్ల ఎంత బాధ్యత ఉందో తెలియజేస్తోంది. కేవలం మద్యం సిండికేటు వ్యాపారులు ఇచ్చే కమిషన్లు మాత్రమే కనిపించే నేతలకు వారి మరణాలు ఎలా కనిపిస్తాయి? ఎక్సైజ్ శాఖ మంత్రి తన పక్క జిల్లాలోనే కల్తీసారాను నిర్మూలించలేకపోయారంటే, పరిపాలన ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు. ఇరవై మంది గిరిజనులు, దళితులు ఒక గ్రామంలో మరణిస్తే, వారి కుటుంబాల పరిస్థితి ఏమిటి? కేవలం ఎక్స్‌గ్రేషియా కింద కొంత మొత్తాన్ని, (చెల్లించి, ఉంటుందో లేదో కూడా తెలియదు) రాజీవ్ యువకిరణాల కింద ఉద్యోగం ఇస్తే సరిపోతుందా? నష్టం కలిగిన తరువాత ఎలా జరిగింది? ఏం జరిగింది? దీనికి బాధ్యులెవరు? అని నామమాత్రపు ఎంక్వైరీలు జరిపే ప్రభుత్వానికి వాస్తవాలు తెలియనివి కావు. ఇటువంటి కల్తీసారా మరణాలు ఒక్క కృష్ణా జిల్లాలోనే కాదు, రాష్ట్రం నలువైపులా కొన్ని వందల సంఖ్యలో వెలుగుచూశాయి. ఇటువంటి సంఘటనలు తిరిగి పునరావృతం కాకుండా ఉండాలంటే విద్యార్థులు, విద్యావంతులు, గృహిణులు, ఉద్యోగులు అందరూ సమిష్టిగా పోరాటం జరిపినప్పుడే ఈ వ్యవస్థ మారుతుందని తెలియజేస్తూ, అందరిని ఆలోచింపజేసేలా వ్యాసాన్ని రాసిన చిమ్మె జాన్‌బర్నబాస్‌కి కృతజ్ఞతలు.

**– పులుగుజ్జు గురువర్మ**
చిన్న ఓబినేనిపల్లి, ప్రకాశం

మాంద్యం వైపు యూరోప్ ఆర్థిక వ్యవస్థ వ్యాసం పేరుకు యూరప్‌ను గురించి తెలియజేసేదైనప్పటికీ భారతదేశానికి గూడా వర్తిస్తుంది. ఉదార ఆర్థిక విధానాల పుణ్యమా అని ప్రజల పొదుపునే గాదు భవిష్యత్ ఆదాయాల్ని కూడా ఖర్చు పెట్టించేశాయి అనేది మన దేశానికి కూడా బాగానే వర్తిస్తుంది. అభివృద్ధి పేరుతో ప్రభుత్వాలే అప్పులపాలై దివాలా తీస్తున్నప్పుడు ప్రజలకెట్లా మిగులుతుంది. ధనిక దేశాల మధ్యనే కాక దేశాలలోనే గుత్తాధిపత్యాల మధ్య ఏ విధంగా వైరుధ్యాలు పెరిగి శత్రుపూరితమైన మార్పులు సంభవిస్తున్నాయో ఈ వ్యాసం వలన బాగా తెలుసుకోవచ్చు. వ్యాసంలోని కొన్ని సాంకేతిక పదాలు అందరికి అర్థంకావు గదా. వాటి అర్థాల్ని బ్రాకెట్లలో రాసినట్లైతే పాఠకులకు సుబోధకమవు తుంది. 'పని,

*(మిగతా 61వ పేజీలో..)*

## క్షమించండి!

వీక్షణంలో ఇటీవల చాల ఎక్కువగా తప్పులు వస్తున్నాయి. విరివిగా అచ్చుతప్పులు వస్తున్నాయి. సమాచారం తప్పులు, అర్థరహితమైన, అపార్థానికి దారితీసే వాక్యనిర్మాణాలు, వ్యక్తీకరణలు ఉంటున్నాయి. పునరుక్తులలో, వాదనాధార తెగిపోవడంలో, అసందర్భమైన వ్యక్తీకరణలు ఉండడంలో ఎడిటింగ్ లోపాలు కనబడుతున్నాయి.

ప్రత్యేకించి వీక్షణం ఫిబ్రవరి 2012 సంచికలో శాసనసభ స్పీకర్ నాదెండ్ల మనోహర్ బదులు భాస్కరరావు (పే.17) అనీ, కంఠీరవ నరసరాజు బదులు కాంతిరవనరసరాజు (పే.57) అనీ, ఐదు రాష్ట్రాల ఎన్నికలు ముగిసే తేది మార్చ్ 3 బదులు ఫిబ్రవరి 3 అనీ పొరపాట్లు జరిగాయి.

ఆ తప్పులు ఎలా ఏ స్థాయిలో జరిగినా – రచనలోనే ఉన్నా, ఎడిటింగ్‌లో వాటిని తొలగించలేకపోయినా, అచ్చు తప్పుల రూపంలో వచ్చినా – సంపూర్ణ బాధ్యత సంపాదకవర్గానిదే. మా పనిని సమర్థంగా నిర్వహించలేకపోతున్నందుకు క్షమించవలసిందిగా పాఠకులకు విజ్ఞప్తి చేస్తున్నాం. ఇకముందు ఈ తప్పులను సవరించుకొని వీక్షణంను లోపరహితంగా తీసుకురావడానికి అన్ని ప్రయత్నాలు చేస్తామని హామీ ఇస్తున్నాం. – సం.

# మౌలిక లక్ష్యాలు వదిలి అంకెల గారడీ

**రా**నున్న సంవత్సరంలో ప్రభుత్వ ఖజానాకు ఏయే రూపాలలో ఎంత ఆదాయం రాబోతుందో, దాన్ని ఏయే పద్దుల కింద ఎంతెంత ఖర్చు పెట్టదలచుకున్నదో ప్రభుత్వం ప్రజలకు వివరించి చెప్పే పత్రం బడ్జెట్. సమాజంలో ఆర్థిక అంతరాలు ఉన్నప్పుడు అధికాదాయ వర్గాల మీద పన్నులు విధించి, ఆ నిధులతో అల్పాదాయ వర్గాల సంక్షేమానికి ఎలా ఖర్చు పెట్ట బోతున్నారో చెప్పే పత్రం బడ్జెట్. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ప్రభుత్వం అనబడేది ప్రజల ప్రతినిధిగా, ప్రజల నిధులతో, ప్రజల కొరకు, ప్రజల ఆదేశం మేరకే పని చేయాలి గనుక ప్రభుత్వం తన ప్రాధాన్యతలను ప్రజల ముందు చర్చకు పెట్టే పత్రం బడ్జెట్. అంటే ప్రణాళికాబద్ధ దూరదృష్టి, సంక్షేమ రాజ్య భావన, ప్రజానుకూల పారదర్శకత అనే మూడు లక్షణాలు బడ్జెట్‌కు పునాది. అలాగే బడ్జెట్‌ను పరమ పవిత్రంగా ఎంచి, చివరి నిమిషం వరకూ రహస్యంగా ఉంచి, రానున్న ఏడాదికి సంబంధించిన విధాన నిర్ణయాలన్నీ దాని ద్వారా మాత్రమే ప్రకటించే పద్ధతి ఇరవై ఏళ్ల కింది దాకా ఉండేది. అంటే ఒక విధానాన్ని ప్రకటించేటప్పుడు దాని వల్ల ఎంత ఆదాయం వస్తుందో, ఎంత ఖర్చు అవుతుందో చెప్పి, ఆ ఆదాయానికో ఖర్చుకో ప్రజాప్రతినిధుల అంగీకారం పొంది, జవాబుదారీతనంతో వ్యవహరించడం ప్రభుత్వ బాధ్యత అని చెప్పడం కూడ బడ్జెట్‌కు మరొక లక్షణం. కాని గత రెండు దశాబ్దాలుగా దేశంలోనూ, రాష్ట్రంలోనూ బడ్జెట్ పట్ల ప్రభుత్వ వైఖరిలో క్రమక్రమంగా వస్తున్న మార్పులు చూస్తుంటే అసలు బడ్జెట్ మౌలిక లక్షణాల గురించి మన పాలకులకు తెలుసునా అనే సందేహం కలుగుతున్నది. ఆదాయానికీ వ్యయానికీ కూడ దొంగలెక్కలు చెప్పడం, ఆదాయ వనరుల స్పష్టత లేకుండానే ఆయా వర్గాల సంతృప్తి కోసం వ్యయ అంచనాలు ప్రకటించడం, ప్రకటించేటప్పుడే ఆ ప్రకటనకు కట్టుబడి ఉండకపోయినా ఫరవాలేదనే తెంపరితనం, తమ ఆశ్రితులను పన్నుల నుంచి మినహాయించి నిజమైన ఆదాయ మార్గాలకు గండి కొట్టడం, నోరులేని ప్రజల మీద ఇబ్బడి ముబ్బడిగా పన్నులు విధించడం, బడ్జెట్‌లోటు తగ్గించడమనే పేరు మీద సంక్షేమ వ్యయం మీద కోత విధించడం, ప్రజా ప్రతినిధులనబడేవారికి తమ ముడుపుల గురించీ, సౌకర్యాల గురించీ తప్ప ప్రజా ప్రయోజనాల గురించీ, బడ్జెట్ గురించీ పట్టకపోవడం, బడ్జెట్ ప్రవేశ పెట్టడానికి ముందు రోజూ, ఆ తర్వాత రోజూ, ప్రతిరోజూ లాభార్జనాపరుల కోసమో, ముడుపుల కోసమో ప్రత్యేక విధానాలు, పథకాలు సిద్ధమవుతూ బడ్జెట్ ప్రతిష్టను తగ్గించడం వంటి అనేక పరిణామాల వల్ల బడ్జెట్లు తమ ప్రాముఖ్యతను కోల్పోయాయి. ప్రపంచీకరణ విధానాల తర్వాత ఈ బడ్జెట్ల దిగజారుడు మరింత వేగవంతమయింది. ఈ స్థితిలో సగటు మనిషికి బడ్జెట్‌ను స్థూల రాజకీయార్థిక విధానాల కొరకు కాక, కేవలం పన్నులు ఎలా పెరుగుతున్నాయి, దానివల్ల ధరలు ఎలా పెరుగుతాయి, ఏ రాయితీలు వస్తాయి అనే ఆసక్తితో మాత్రమే చూడడం అలవాటయింది. ఇప్పుడిక బడ్జెట్ ప్రచార సాధనాలకూ, ఆ రంగం మీద కేంద్రీకరించే పాత్రికేయులకూ తప్ప మిగిలిన వారికి అవసరం లేని మొక్కుబడి తతంగంగా మారిపోయింది. ఇన్ని వక్రీకరణలతో సాగుతున్న బడ్జెట్‌లో కేటాయింపులు ఎక్కువ ఉన్నాయనో, తక్కువ ఉన్నాయనో, గతంలో కన్న పది శాతం పెరగవలసి ఉండగా ఐదు శాతమే పెరిగాయనో వాదించడం పెద్దగా ఉపయోగకరం కాదు. నిజానికి అసలు చర్చను పక్కదారి పట్టించడానికే ప్రభుత్వాలు ఈ అంకెల గారడీలు, సర్కస్‌లు, జిమ్మిక్కులు సాగిస్తున్నాయి. బడ్జెట్ లక్ష కోట్ల రూపాయలు దాటిపోయేలా చేశామనేది ఈ గారడీల్లో ఒకటి. దూరదృష్టి, సంక్షేమం, పారదర్శకత లేనప్పుడు పదివేల కోట్లయినా, లక్ష కోట్లయినా, పదిలక్షల కోట్లయినా తేడా ఏమీ ఉండదు. ప్రస్తుతానికి వస్తే, 2012-13 రాష్ట్ర బడ్జెట్ రు. 1,45,854 లక్షల కోట్ల రూపాయలది. అయితే ఏం? సామాన్యులకు, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు ఒరిగేదేమిటి? ఈ భారీ అంకె రాష్ట్రంలోని అసమానతలను ఎంత తగ్గించబోతున్నది? ఎందరు నిరుద్యోగులకు ఉద్యోగం కల్పించబోతున్నది? ఎందరు నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా మార్చబోతున్నది? అటువంటి మౌలిక ప్రశ్నలు వేటికీ ఈ అంకెలు జవాబు చెప్పవు. పాత రోజుల్లో అయితే బడ్జెట్‌లో ప్రణాళికా వ్యయానికీ, ప్రణాళికేతర వ్యయానికీ స్పష్టమైన విభజన రేఖ ఉండేది. ప్రణాళికా వ్యయం అంటే భవిష్యత్తులో మరింత ఆదాయం ఇవ్వగల దీర్ఘకాలిక వ్యవస్థల ఏర్పాటు వ్యయమని, ప్రణాళికేతర వ్యయమంటే ఈ సంవత్సరంతో సరిపోయే స్వల్పకాలిక వ్యయమని నిర్వచనాలు ఉండేవి. ఇప్పుడు అవన్నీ మారిపోయాయి. ప్రభుత్వాలు ఇష్టారాజ్యంగా అటు పద్దును ఇటూ, ఇటు పద్దును అటూ మార్చేస్తున్నాయి. కనుక ప్రణాళికేతర వ్యయం రు. 91,824 కోట్లు అనీ, ప్రణాళికా వ్యయం రు. 54,030 కోట్లు అనీ చెప్పుకుంటే అంకెలు డబడబలాడతాయి గాని వాస్తవంలో మిగిలేదేమీ ఉండదు. ఈ పద్దుల కింద కనబడుతున్న నిధులు ఏ పథకాల కోసం, ఏ వర్గాలకు అందబోతున్నాయి, ఆ నిధుల వల్ల ఆయా వర్గాల జీవితంలో, జీవనోపాధిలో ఏ మేలు జరుగుతుంది, ఏ అసమానతలు తగ్గబోతున్నాయి అనే ప్రశ్నలకు ఈ అంకెలు జవాబు చెప్పవు. అలాగే కొన్ని పథకాలు ప్రకటించి వాటిని అంకెలతో జోడించకపోతే అవి ఆచరణలోకి రాని పథకాలని తేలిపోతుంది. ఉదాహరణకు రాజీవ్ విద్యా మిషన్ కింద 15 లక్షల ఉద్యోగాలు కల్పిస్తామని, 10 లక్షల స్వయం సహాయక బృందాలకు వ్యవసాయ పరపతి సౌకర్యాలు కల్పిస్తామని, రచ్చబండ కింద 50 లక్షల మందికి లబ్ధి చేకూరుస్తామని రాష్ట్ర బడ్జెట్ ప్రకటించింది. 15 లక్షల కొత్త ఉద్యోగాలు వస్తే, నెలకు కనీసం తక్కువలో తక్కువ మనిషికి వెయ్యి రూపాయల జీతం ఇచ్చినా వార్షిక బడ్జెట్ రు. 1800 కోట్లు అవుతుంది, 10 లక్షల బృందాలకు ఒక్కొక్క బృందానికి వెయ్యి రూపాయల పరపతి ఇచ్చినా రు. 1200 కోట్లు అవుతుంది. మరి ఆ కేటాయింపులు ఎక్కడా లేవు. అంటే అవి వాగ్దానాలే తప్ప ఆచరణలోకి రావన్నమాట. ఇలా లెక్కలు తీస్తూ పోతే, ఎంతో వాగాడంబరమూ, ఎన్నో శుష్క వాగ్దానాలూ కనబడతాయి గాని చిత్తశుద్ధి కనబడదు. గారడీలు, అబద్ధాలు, అర్ధ సత్యాలు కలిపి వండిన ఈ బడ్జెట్‌లోని అంకెల గురించి చర్చించడం కన్న ఈ బడ్జెట్ తయారు చేస్తున్న వర్గాల ప్రయోజనాలు, మాయలు, అక్రమాలు చర్చిస్తే ఎక్కువ ఉపయోగకరం. ప్రజలను భ్రమల్లో ముంచడానికి మాత్రమే ఉపయోగపడే అంకెల మాయలో పడకుండా, మౌలిక విషయాలు చర్చించడం అవసరం. వీ

## పోలీసు మంత్రి కత్తికి రెండంచులు అవినీతి, హింస

పాలకవర్గాల ఆర్థిక ప్రయోజనాల కోసమే హింస జరుగుతుందని, హింస ద్వారానే పాలకవర్గాలు ఆర్థిక ప్రయోజనాలు నెరవేర్చుకుంటాయని, ఆర్థిక ప్రయోజనాలు, అవినీతి, హింస కలగలిసే ఉంటాయని చూపడానికి ఆధునిక భారత చరిత్రలో చిదంబరం కన్న పెద్ద నిదర్శనం ఉండబోదు. ఇవాళ కేంద్రంలో పోలీసు మంత్రిగా పనిచేస్తున్న పళనియప్పన్ చిదంబరం, ఇటు భారత ప్రజా ప్రయోజనాలను ధ్వంసం చేయడం, అటు సామ్రాజ్యవాదానికి సేవ చేయడం, ఇటు సాంప్రదాయిక ఆహార్యంతో చెట్టినాడు రాజరిక కుటుంబ వారసత్వాన్ని కాపాడడం, అటు హార్వర్డ్ బిజినెస్ స్కూల్ విద్యావంతుడిగా ఇంగ్లిష్ వాగాడంబరం – ఒక్క మాటలో చెప్పాలంటే అర్ధ భూస్వామ్య, అర్ధ వలస భారత పాలకవర్గాలకు అచ్చమైన ప్రతినిధి. ఆయన మొన్న దివాళాకోరు ఎన్రాన్‌కు న్యాయవాది. నిన్న బందిపోటు వేదాంతకు న్యాయవాదీ, యాజమాన్య సభ్యుడూ. ప్రపంచీకరణ నాటినుంచి వాణిజ్య, ఆర్థిక, పోలీసు శాఖలు నిర్వహించిన వ్యక్తి. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌తో ప్రజా ఉద్యమాలను అణచివేసి, ఆదివాసులను వెళ్లగొట్టి ఖనిజ నిలువలను బహుళజాతి సంస్థలకు అప్పగిస్తానని వాగ్దానం చేసిన దళారీ. దోపిడీకీ అవినీతికీ హింసకూ మూర్తీభవ రూపంగా నిలిచి తమ ప్రయోజనాలు ఇంతగా కాపాడుతున్న వ్యక్తి మీద సామ్రాజ్యవాదం, రాజ్యం ఈగ వాలనిస్తాయా? భారీ అక్రమాల పుట్ట టెలికాం కుంభకోణంలో, ఒకానొక పడగ 2జికి సంబంధించి ఆర్థిక మంత్రి చిదంబరం పాత్ర ఉందని స్పష్టంగా రుజువయ్యాక కూడ అత్యున్నత కోర్టు ఫిబ్రవరి 2న విచిత్రమైన తీర్పు ఇచ్చింది. “అక్రమం నిజమే, అందువల్ల ఆ లైసెన్సులన్నీ రద్దు చేయవలసిందే” అంటూనే, ఆ అక్రమానికి దారి తీసిన ఆమోదపత్రం మీద సంతకం చేసిన అప్పటి ఆర్థిక మంత్రికి ఆ అక్రమంతో సంబంధం ఉందో లేదో చెప్పే బాధ్యతను మాత్రం వదిలేసింది. ఆ అక్రమంలో టెలికాం, ఆర్థిక మంత్రిత్వ శాఖలకు రెండిటికీ సంబంధం ఉన్నప్పుడు ఆర్థిక మంత్రిని ఎందుకు విచారించడం లేదని జనతా పార్టీ నాయకుడు సుబ్రహ్మణ్యం స్వామి వేసిన వ్యాజ్యం మీద ఆ ప్రశ్నకు మాత్రం జవాబు చెప్పకుండా దాటవేసింది. టెలికాం కంపెనీల లైసెన్సులు రద్దు చేయడం ప్రపంచ వ్యాప్తంగా భారత ప్రతిష్టను దిగజార్చిందని, ఇక దేశంలోకి పెట్టుబడులు రావని ఇంగ్లిషు పత్రికలు, వాణిజ్య పత్రికలు గగ్గోలు పెట్టాయి. బహుళ జాతి సంస్థలు బెదిరింపులు మొదలుపెట్టాయి. ఈ స్థితిలో తమ దళారీ నేరస్తుడని నిర్ధారణ అయితే, కనీసం విచారణ కోసం బోనెక్కితే తమ ప్రయోజనాలకు నష్టదాయకమని ఆదుర్దా మొదలయింది. 2జి కుంభకోణాన్ని విచారిస్తున్న కోర్టు రెండే రెండు రోజుల్లో చిదంబరంను విచారించనక్కరలేదని తీర్పు చెప్పింది. కాగితాల మీద సంతకాలతో దొరికిపోయిన నేరస్తులు విచారణను కూడ ఎదుర్కోనవసరం లేదని న్యాయస్థానాలు బహిరంగంగా ప్రకటిస్తున్నాయంటే ఆ నేరస్తులు రాజ్యానికి ఎంత అవసరమో, ఈ పాలన ఎంత కుళ్లిపోయిందో స్పష్టమవుతున్నది. అటువంటి నేరస్తులైన రాజకీయ నాయకులు ప్రజా ప్రతినిధులనీ, ఇది స్వతంత్ర, ప్రజాస్వామిక ప్రభుత్వమనీ భ్రమ పడుతున్న ఈ దేశ ప్రజలు, ముఖ్యంగా మధ్యతరగతి ఇప్పటికైనా కళ్లు తెరుస్తుందా? వీ

## సామ్రాజ్యవాద అహంకారానికి ఇరాన్ సవాల్

“ఎద్దులాగ ఇతర దేశాలను కుమ్మగలిగే రోజులు గతించాయి. అణు సాంకేతిక పరిజ్ఞానం మీద అహంకార పూరిత దేశాల గుత్తాధిపత్యం ఇక చెల్లదు” అని ఇరాన్ అధ్యక్షుడు మహ్మూద్ అహ్మదినెజాద్ అమెరికాను ఉద్దేశించి ఫిబ్రవరి 15న అన్న మాటలు, తన మీద ఆంక్షలు విధిస్తామని బెదిరించిన దేశాలకు గుణపాఠం నేర్పడానికి బ్రిటన్, ఫ్రాన్స్, గ్రీస్‌లకు చమురు ఎగుమతులు ఆపివేయడం సామ్రాజ్యవాద వ్యతిరేక చర్యల చరిత్రలో చెప్పుకోదగిన సంఘటనలు. ఇస్లామిక్ రిపబ్లిక్ ఆఫ్ ఇరాన్ ప్రజాస్వామిక దేశం అవునా కాదా, అహ్మదినెజాద్ నిరంకుశుడా కాదా, ఇరాన్‌లో మానవ హక్కులు ఉన్నాయా లేవా అనేవి ముఖ్యమైన ప్రశ్నలే గాని, ఇవాళ్టి అంతర్జాతీయ సమాజానికి అంతకన్న ఎక్కువగానో, సమానంగానో మరికొన్ని ప్రశ్నలున్నాయి. మరొక వెతుకులాట ఉంది. సామ్రాజ్యవాద అహంకారాన్ని ఎదిరించే వారెవరా అనే వెతుకులాట అది. మూర్ఖత్వంతోనైనా సరే అమెరికన్ దాష్టీకాన్నీ, మొత్తంగా సామ్రాజ్యవాద అహంకారాన్నీ ఎదిరిస్తున్న మూడో ప్రపంచ దేశ నాయకుడిగా అహ్మదినెజాద్‌కు అందువల్లనే ప్రాముఖ్యత ఉంటుంది. దేశం లోపల ప్రజావ్యతిరేక విధానాలు అవలంబిస్తున్నట్టయితే, వాటిని ప్రతిఘటించవలసిందీ, అవసరమైతే పదవీచ్యుతుణ్ని చేయవలసిందీ ఇరాన్ ప్రజానీకమే తప్ప, ఆ పని వారికోసం మరొకరు చేసిపెట్టడం కుదరదు. చరిత్రలోకెల్లా అతి భయంకరమైన హంతక సామ్రాజ్యాన్ని నడుపుతున్న అమెరికన్ ప్రభుత్వానికి ఆ అర్హతే లేదు. వేలాది అణ్వాయుధాలను తయారు చేసి పెట్టుకున్న అమెరికా, ఒకప్పుడు, తన తొత్తు షా పాలన రోజులలో తానే ఇరాన్‌కు సరఫరా చేసిన అణు సాంకేతిక పరిజ్ఞానం మీద గుత్తాధిపత్యంతో, ఇప్పుడు మాత్రం ఇరాన్ అణు కార్యక్రమాన్ని అడ్డుకోవడానికీ, అక్కడ మానవ హక్కులను కాపాడడానికీ జోక్యం చేసుకుంటానని అనడం అర్థరహితం. అందుకే అణు సాంకేతిక పరిజ్ఞానంలో ఒక గొప్ప ముందడుగు సాధించామని ప్రకటిస్తూ అహ్మదినెజాద్ అన్న మాటలు ఆమోదయోగ్యం కానివారికైనా ఆలోచన ప్రేరేపిస్తాయి. అసలు అణు సాంకేతిక పరిజ్ఞానాన్ని శాంతియుత ప్రయోజనాల పేరుతోనైనా వాడడం మంచిదా కాదా వేరే చర్చ. అణ్వాయుధాలను వ్యతిరేకించేవారయినా సరే, వాటి మీద సామ్రాజ్యవాదుల గుత్తాధిపత్యాన్ని ఎదిరించడానికి అవి అన్ని దేశాలకూ అందుబాటులోకి రావడం న్యాయమని అంగీకరించాలి. ఇంతకూ ఇరాన్ మీద అమెరికా గాని, యూరపియన్ యూనియన్ గాని విరుచుకుపడుతున్నది అహ్మదినెజాద్ విధానాల కోసం కాదు, ఇరాన్ ప్రజల మీద ప్రేమతో కాదు. చమురు సహజవాయు వనరులున్న దేశాలన్నిటినీ తమ గుప్పిట్లో పెట్టుకోవాలనీ, ఆ ప్రాంతంలో తమకు ఎదురు చెప్పే వారెవరూ ఉండగూడదని, వారందరూ తమకో, తమ తైనాతీ ఇజ్రాయిల్‌కో దాసానదాసులుగా ఉండాలనీ మాత్రమే. అందుకే ఇరాక్ మీద, లిబియా మీద దాడికి ముందు దుష్ప్రచారాలు చేసి, దుర్మార్గమైన దాడికి రంగం సిద్ధం చేసుకున్నట్టుగానే ప్రస్తుతం ఇరాన్ మీద దాడికి రంగం సిద్ధం చేస్తున్నారు. ప్రపంచంలోని వనరులన్నీ తన ఖజానాలో డాలర్లయి పండాలని కోరుకుంటున్న అమెరికా కలలను బద్దలు చేయడానికి ఎవరు ప్రయత్నించినా, ఎందుకు ప్రయత్నించినా సమర్థించడమే ఇవాళ ప్రపంచ ప్రజల కర్తవ్యం. వీ












- **మనసులోని చలి** – ముక్తవరం పార్థసారథి – వికాసం బుక్స్, 96 పేజీలు, 1/8 డెమీ, రు : 60,
- **కించిద్విషాదం** – ముక్తవరం పార్థసారథి – వికాసం బుక్స్, 99 పేజీలు, 1/8 డెమీ, రు : 60,

పై రెండు ప్రతులకు : ఎం. పార్థసారథి, 411, ప్రభాత్కర్ అపార్ట్‌మెంట్స్, విజయనగర్ కాలనీ, హైదరాబాద్ – 500 057. సెల్ : 040–23345091 అన్ని పుస్తక షాపుల్లో

- **డానీ వ్యంగ్య రచనలు – రాజు గారి కొమ్ము** – ఉషా ఎస్. డానీ – అజిత పబ్లికేషన్స్, 175 పేజీలు, 1/8 డెమీ, రు : 100, ప్రతులకు : అజిత పబ్లికేషన్స్, ఫ్లాట్ నెం. 404, స్కిల్ ప్రెసిడెన్సీ, సందర్శిని హోటల్ దగ్గర, రోడ్ నెం. 1, బంజారా హిల్స్, మాసాబ్‌టాంక్, హైదరాబాద్ – 500 028; సెల్ : 9010234336, 9948092615, 9866541148
- **జాజిమల్లి** – బ్లాగ్ కథలు – మల్లీశ్వరి – పర్‌స్పెక్టివ్స్ పబ్లికేషన్స్, 132 పేజీలు, 1/8 డెమీ, రు : 80, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన్ భవన్ – బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ – 500 001; ఫోన్ : 040 – 24744580
- **పసిడి నానీలు** – మండలోజు భీష్మాచారి – 55 పేజీలు, 1/8 డెమీ, రు : 50, ప్రతులకు : ఎం. భీష్మాచారి, ఇ.నెం. 17–1–382/ఎచ్/1/1, న్యూ బాలాజీనగర్, పోస్ట్: వైశాలినగర్, చంపాపేట్, హైదరాబాద్ – 500 079
- **జిగిరి** – నవల – పెద్దింటి అశోక్ కుమార్ – నయనం ప్రచురణలు, 136 పేజీలు, 1/10 డెమీ, రు : 75, ప్రతులకు : పెద్దింటి అశోక్ కుమార్, మల్లారెడ్డిపేట పోస్ట్, గంభీర్రావుపేట మండల్, కరీంనగర్ – 505 304
- **శతాబ్దాల సూఫీ కవిత్వం** – ముకుంద రామారావు, పాలపిట్ట బుక్స్ – 111 పేజీలు, 1/8 డెమీ, రు : 60

పై రెండు ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16–11–20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ – 500 036. ఫోన్ : 040 – 27678430, 9848787284, palapittabooks@gmail.com

- **ఆధునిక కథా సరిత్సాగరం – కరీంనగర్ జిల్లా కథలు** – మూడవ సంపుటి – సంపాదకులు : బి.ఎస్. రాములు, వనమాల చంద్రశేఖర్ – విశాల సాహిత్య అకాడమి, 144 పేజీలు, 1/8 డెమీ, రు : 90, ప్రతులకు : విశాల సాహిత్య అకాడమి, 2–2–186/53/5, రామకృష్ణానగర్, బాగ్ అంబర్‌పేట్, హైదరాబాద్ – 500 013. సెల్ : 09391036987
- **ఓ గెలుపు కోసం** – షహబాజ్ అహ్మద్ ఖాన్ – అడుగు జాడలు పబ్లికేషన్స్, 68 పేజీలు, 1/8 డెమీ, రు : 40
- **వేకువ పిలుపులు** – చుక్కా రామయ్య – స్పృహ సాహితీ సంస్థ, 120 పేజీలు, 1/8 డెమీ, రు : 65

పై రెండు ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, ఇ.నెం. 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో











## అంబేద్కర్ విగ్రహాల విధ్వంసం

తూర్పు గోదావరి జిల్లా అమలాపురం పరిసర గ్రామాలలో నాలుగు అంబేద్కర్ విగ్రహాలను జనవరి 23 తెల్లవారుజామున కూల్చివేశారు. ఈ సంఘటనతో అమలాపురం పట్టణంలో తీవ్ర ఉద్రిక్తతలకు దారితీసింది. అలాగే ఇంకా రాష్ట్రంలో పలుచోట్ల ఈ విగ్రహ విధ్వంస చర్యలు చోటు చేసుకొన్నాయి. ఈ క్రమంలో పలు పార్టీలు, దళిత సంఘాలు జనవరి 29న నిర్వహించ తలపెట్టిన 'చలో అమలాపురం' కార్యక్రమాన్ని పోలీసులు భగ్నం చేశారు. ఈ విధ్వంసాన్ని నిరసిస్తూ పలు విద్యార్థి, ప్రజా సంఘాలు జనవరి 30న రాష్ట్రబంద్‌కు పిలుపు నిచ్చాయి. విగ్రహాల విధ్వంసం కేసులో పోలీసులు ఏడుగురిని అరెస్ట్ చేశారు.

## మూతపడ్డ వస్త్ర దుకాణాలు

రాష్ట్ర ప్రభుత్వం వస్త్ర వ్యాపారంపై విధించిన వ్యాట్‌కు వ్యతిరేకంగా జనవరి 23న బంద్ సంపూర్ణంగా జరిగింది. రాష్ట్రవ్యాప్తంగా వస్త్ర దుకాణాలు మూతపడ్డాయి. భారీ సంఖ్యలో వ్యాపారులు ఆందోళనలో పాల్గొన్నారు. జనవరి 31వరకు హైదరాబాద్‌లోని ఇందిరాపార్క్ వద్ద దీక్షలు నిర్వహించారు. వస్త్రాల పై 5 శాతం వ్యాట్‌వల్ల ప్రజలపై రు.1400 కోట్ల భారం పడనుందని అంచనా.

## రాజలింగం మృతి

స్వాతంత్ర్య సమరయోధుడు, మాజీ మంత్రి ఎం.ఎస్. రాజలింగం (93) జనవరి 23న అనారోగ్యంతో మరణించారు. ఆయన క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలుకెళ్లారు. స్వాతంత్ర్యానంతరం హైదరాబాద్ రాష్ట్రంలో శాసనసభకు 1952లో జరిగిన ఎన్నికల్లో వరంగల్ తొలి ఎం.ఎల్.ఎ.గా ఎన్నికయ్యారు. పలు ఇంగ్లిష్, తెలుగు పత్రికలకు కరస్పాండెంట్‌గా ఉన్నారు.

## స్త్రీ సాహిత్యంపై జాతీయ సదస్సు

కాకతీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం, ప్రజాస్వామిక రచయిత్రుల వేదికల సంయుక్త ఆధ్వర్యంలో జనవరి 27-29 తేదీల్లో తెలుగు స్త్రీ సాహిత్యంపై జాతీయ సదస్సు జరిగింది. దక్షిణ ప్రాంతీయ భాషా కేంద్రం, మానవ వనరుల అభివృద్ధి శాఖ (మైసూర్) సహకారంతో జరిగిన మూడు రోజుల సదస్సులో రెండు దశాబ్దాల (1990-2010) తెలుగు రచయిత్రుల సాహిత్య గమనం - గమ్యం అనే అంశంపై సదస్సు జరిగింది.

## 'నాటక' సావిత్రి ఇక లేరు

ప్రముఖ కళాకారిణి గూడూరు సావిత్రి (66) గుండెపోటుతో నెల్లూరులో మరణించారు. స్త్రీలు బయటికి రావడమే తప్పుగా భావించే కాలంలో సావిత్రి ధైర్యంగా పద్య నాటక రంగంలోకి అడుగుపెట్టారు. సురభి కళాకారిణిగా మొదలై డి.వి. సుబ్బారావు, పొన్నాల రామసుబ్బారెడ్డి వంటి సుప్రసిద్ధ రంగస్థల నటులతో నటించి మెప్పించారు. పద్య ఉచ్చారణ, పాత్ర పోషణ, సంగీతానికి తగిన స్వర గమనంతో మూడు దశాబ్దాల పాటు తెలుగు పద్య నాటకానికి వన్నెతెచ్చారు.

## 'రెడ్‌స్టార్ ఓవర్ ఇండియా' పుస్తకావిష్కరణ

స్వీడన్ దేశానికి చెందిన జర్నలిస్ట్ యాన్ మిర్దాల్ రచించిన 'రెడ్‌స్టార్ ఓవర్ ఇండియా' పుస్తకాన్ని వరవరరావు ఫిబ్రవరి 1న హైదరాబాద్ బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో ఆవిష్కరించారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక కమిటీ ఆధ్వర్యంలో జరిగిన ఈ సభలో పుస్తక రచయిత యాన్ మిర్దాల్ మాట్లాడుతూ భారత దేశంలో అభివృద్ధి పేరిట సామ్రాజ్యవాద విధ్వంసం జరుగుతోందనీ, అమెరికాలో రెడ్ ఇండియన్‌లను అణచివేసిన విధంగానే భారత్‌లో గ్రీన్‌హంట్ పేరుతో పాలకులు ప్రశ్నించే గొంతులను నులుముతున్నారని విమర్శించారు. ఈ సభకు రాధ (చైతన్య మహిళా సంఘం) అధ్యక్షత వహించగా, ప్రొ. ఎస్. శేషయ్య (ఎపిసిఎల్‌సి), దుడ్డు ప్రభాకర్ (కెవిపిఎస్), ప్రదీప్ (ఐఎఫ్‌టియు)లు ప్రసంగించారు.

## ఐదోసారి కార్యదర్శిగా బి.వి. రాఘవులు

ఫిబ్రవరి 2 నుంచి 4 మధ్య సిపిఐ (ఎం) రాష్ట్ర మహాసభలు జరిగాయి. సిపిఐ (ఎం) రాష్ట్ర కార్యవర్గంలోకి 80 మందిని తీసుకోగా, అందులో 14 మంది కార్యదర్శివర్గ సభ్యులుగా ఉన్నారు. సిపిఐ(ఎం) రాష్ట్ర కార్యదర్శిగా బి.వి. రాఘవులు ఐదోసారి బాధ్యతలు చేపట్టారు.

## 'అరసం' కార్యవర్గం ఎన్నిక

ఫిబ్రవరి 5న నల్లగొండ జిల్లా సూర్యాపేటలో అభ్యుదయ రచయితల సంఘం (అరసం) రాష్ట్ర మహాసభలు జరిగాయి. అరసం రాష్ట్ర అధ్యక్షుడిగా పెనుగొండ లక్ష్మీనారాయణ (గుంటూరు), ప్రధాన కార్యదర్శిగా వేల్పుల నారాయణ (గోదావరిఖని, కరీంనగర్) ఈ సభలలో ఎన్నికయ్యారు. కార్యదర్శులుగా పది మందిని, కన్వీనర్‌లుగా ఆరుగురిని, కార్యవర్గ సభ్యులుగా 26 మందిని ఎన్నుకున్నారు.

## సుసర్ల మృతి

ప్రముఖ సంగీత దర్శకులు సుసర్ల దక్షిణామూర్తి (90) ఫిబ్రవరి 9న చెన్నైలో కన్నుమూశారు. సుదీర్ఘకాలంగా ఆయన వృద్ధాప్య ఆరోగ్య సమస్యలతో బాధపడుతున్నారు. ఆయన 11 నవంబర్ 1921న కృష్ణా జిల్లాలో పెద్ద కళ్లేపల్లిలో కృష్ణబ్రహ్మ శాస్త్రి, అన్నపూర్ణ దంపతులకు పుట్టారు. ఆయన తండ్రివద్ద గాత్ర సంగీతం, వయోలిన్‌లు అభ్యసించారు. ఆయన తెలుగు, తమిళం, మలయాళం తదితర భాషల్లో దాదాపు 85 సినిమాలకు సంగీత దర్శకత్వం వహించారు.

## మేడారం జాతర

మేడారం జాతర ఫిబ్రవరి 8న మొదలై మూడు రోజుల పాటు జరిగింది. నాలుగో రోజు ఫిబ్రవరి 11న సమ్మక్క, సారలమ్మల వన ప్రవేశంతో ఈ జాతర ముగిసింది. జాతరకు ఎనభై లక్షల మంది భక్తులు వచ్చారు.

## ఆర్.ఎస్.రావు సిద్ధాంత కృషిపై ..

భారత సమాజ స్వభాన్ని అర్ధభూస్వామ్య, అర్ధవలసగా అర్థం చేసుకొని విశ్లేషించిన ప్రముఖ మార్క్సిస్ట్ మేధావి ఆర్.ఎస్.రావు సిద్ధాంత కృషిపై సదస్సు జరిగింది. ఫిబ్రవరి 12న హైదరాబాద్‌లోని పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం లో విప్లవ రచయితల సంఘం ఆధ్వర్యంలో జరిగిన ఈ సదస్సులో డి. నరసింహ రెడ్డి, డా. ముదునూరి భారతి, ప్రొ. గోలక్ బిహారీనాథ్, పంకజ్‌దత్, ఎ. వెంకటరామయ్య, మనోరంజన్ మోహంతి, అజయ్ (విస్థాపన్ విరోధీ కమిటీ), రాజ్‌కిషోర్ (రెవల్యూషనరీ డెమొక్రటిక్ ఫ్రంట్), జి. హరగోపాల్, ప్రొ.ఎస్. శేషయ్య, గంటి ప్రసాదం, వరవరరావులు ప్రసంగించారు. సదస్సును జి. కళ్యాణరావు, రాంకిలు నిర్వహించారు.

## సి.ఐ.టి.యు. నేత శ్రీహరి కన్నుమూత

సి.పి.ఐ. (ఎం) సీనియర్ నేత, సి.ఐ.టి.యు. మాజీ రాష్ట్ర కార్యదర్శి శ్రీహరి (78) అనారోగ్యంతో బాధపడుతూ ఫిబ్రవరి 15న మరణించారు. ఆయన టెక్స్‌టైల్, షుగర్, ట్రాన్స్‌పోర్ట్ కార్మికోద్యమ నిర్మాణంలో కీలక పాత్ర పోషించారు. 1989లో యునైటెడ్ ఎలక్ట్రిసిటీ ఎంప్లాయిస్ యూనియన్ ఏర్పడిన తరువాత ఒక దశాబ్ద కాలంపాటు ప్రధాన కార్యదర్శిగా పనిచేసి కార్మికుల సమస్యల పరిష్కారం కోసం ఉద్యమించారు. వీక్షణంతో సహా అనేక పత్రికలలో రచనలు చేశారు. వీ

## రీజెన్సీ కార్మికుల తిరుగుబాటు

**యా**నాంలోని రీజెన్సీ టైల్స్ ఫ్యాక్టరీకి 28 ఏళ్ల చరిత్ర ఉంది. రీజెన్సీ టైల్స్ ఫ్యాక్టరీ ఒక యూనిట్ యానాంలో ఉండగా, మరొకటి తమిళనాడుకు దగ్గరలోని కరైకల్‌లో ఉంది. రోజుకు నాలుగు వేల చదరపు మీటర్ల టైల్స్ ఉత్పత్తి స్థాయి నుంచి ఈ రోజు లక్షా ఇరవై వేల చదరపు మీటర్ల ఉత్పత్తి (రెండు యూనిట్లలో కలిపి) స్థాయికి ఎదిగింది. అయినా ఈ 28 ఏళ్లలో ఇంత పెద్ద ఫ్యాక్టరీలో కార్మికులకు సంఘం పెట్టుకొనే స్వేచ్ఛ కూడా లేదు. పనిగంటల నియమంగానీ, బోనస్ చెల్లింపులుగానీ, పారిశ్రామిక వివాదాల చట్టంగానీ, ఇంక్రిమెంట్లుగానీ, రోజువారీ కార్మికులను రెగ్యులరైజ్ చేయడం వంటి హక్కులుగానీ, మహిళా కార్మికులకు కనీస సదుపాయాలు గానీ ఆ కర్మాగారంలో కానరావు. ఇరవై ఏళ్లకు పైగా పనిచేస్తున్న కార్మికులకూ జీతాలు సరిగాలేవు. ఎట్టకేలకు సాహసించి 2011 జనవరిలో అక్కడ కార్మికులు ఒక సంఘం పెట్టుకొన్నారు. సంఘం ఏర్పాటుతో కార్మికులకూ, యాజమాన్యానికీ మధ్య ఘర్షణ మొదలైంది. యాజమాన్యం కొందరు కార్మికులను తమిళనాడులోని కరైకల్‌కు బదిలీ చేసింది. బదిలీ అయిన స్థానానికి వెళ్లని కార్మికులను యాజమాన్యం సస్పెండ్ చేసింది. సస్పెండ్ చేసిన కార్మికులను విధుల్లోకి తీసుకోవాలని నవంబర్ 25 నుంచి డిసెంబర్ 4 వరకు కార్మికులు సమ్మె చేశారు. అప్పుడు యాజమాన్యం కంపెనీ ఆవరణలో ఆందోళనలు, ధర్నాలు చేపట్టడానికి వీల్లేదని హైకోర్టు ఆదేశాలు తెచ్చుకొంది. 'యాజమాన్యం చెప్పినట్టే మసులుకుంటామ'ని హామీ పత్రాలపై సంతకాలు చేసిన వారినే పనుల్లోకి తీసుకొంది. ఈ క్రమంలో జరిగిన పెనుగులాటే జనవరి 27 పరిణామాలకు దారితీసింది. కార్మిక నాయకుడు మచ్చ సోమేశ్వర మురళీమోహన్ (36) పోలీసు దెబ్బలకు ఠాణాలోనే చనిపోయాడు. దీంతో కార్మికులు, స్థానిక ప్రజలు ఆగ్రహం చెంది పోలీసు స్టేషన్‌పై దాడిచేశారు. అనేక వాహనాలను, ఫ్యాక్టరీలోని టైల్స్‌ను తగుల బెట్టారు. కంపెనీ వైస్‌చైర్మన్ కె.సి. చంద్రశేఖర్‌పై దాడికి పాల్పడగా, ఆయన చికిత్స పొందుతూ మరణించాడు. లాఠీచార్జీలో పదుల సంఖ్యలో కార్మికులు గాయపడ్డారు. పోలీసుకాల్పుల్లో తొమ్మిది మంది కార్మికులు గాయపడ్డారు. కంపెనీ లాకౌట్ ప్రకటించింది. ఇప్పటికైనా యాజమాన్యం కార్మికులపై తన కక్షపూరిత వైఖరిని విడనాడి లాకౌట్ ఎత్తివేసి, పరిస్థితులు చక్కదిద్దాలి. ప్రభుత్వం వారికి కావాల్సిన సహకారం అందించాలి. కంపెనీ ఎదుగుదల వెనుక మూడు దశాబ్దాల కార్మికుల శ్రమ, చెమట, నెత్తురులు ఉన్నాయని యాజమాన్యం గుర్తుంచుకోవాలి. కార్మికులవైపు నుంచి సమస్యను అర్థం చేసుకొని తక్షణమే పరిష్కరించాలి.

## శాస్త్రాల బడి - యాగాల గుడి!

**వ**రంగల్‌లోని జాతీయ సాంకేతిక విశ్వవిద్యాలయం (నిట్)ను దుష్టగ్రహాల పీడ నుంచి విముక్తి చేయడం కోసమంటూ జనవరి 28న విశ్వ విద్యాలయ డైరెక్టర్ ప్రొ. శ్రీనివాసరావు సతీ సమేతంగా తన బంగ్లాలో చండీయాగం చేశారు. ఇటీవల క్యాంపస్‌లో వరసగా జరిగిన విద్యార్థుల ఆత్మహత్యలు, ప్రమాదాలలో చావులు, తరగతిగదిలో గంజాయితో విద్యార్థి పట్టుబడిన ఘటనలు నిట్ 'ప్రతిష్ట'కు ఇబ్బంది కరంగా పరిణమించాయనీ, అందువల్ల దుష్టగ్రహాల పీడ నుంచి విశ్వవిద్యాలయాన్ని రక్షించే సంకల్పంతో డైరెక్టర్ శ్రీనివాసరావు ఈ యాగం చేశారు. చండీయాగం ముగిసిన అనంతరం హోమ గుండం వద్ద పూజలు చేసిన పసుపు అన్నం, కొబ్బరికాయలు, బూడిద గుమ్మడి కాయలు, కుంకుమ క్యాంపస్‌లో అష్టదిక్కులా జల్లి బలిహరణ చేశారు. అధ్యాపకులు, సిబ్బంది, విద్యార్థులు యాగానికి హాజరయ్యారు. ఈ యాగ నిర్వహణకు ఐదు లక్షల రూపాయలు ఖర్చు అయినట్లుగా తెలుస్తోంది. ఇదంతా చదివితే మనం ఏ ఆటవిక యుగంలోనో ఉన్నట్లు అనిపించడం లేదూ! వ్యక్తిగత స్థాయిలో ఎవరికి ఏ విశ్వాసాలైనా ఉండవచ్చు. ఆచరించవచ్చు. దానికి ఎవరికీ అభ్యంతరం ఉండనక్కర లేదు. కానీ, కార్యకారణ సంబంధాలను వెలికితీసే, శాస్త్ర సాంకేతిక రంగాలలో పరిశోధనలు చేసే విశ్వవిద్యాలయ డైరెక్టర్ ఈ పని చేయడమే ప్రశ్నార్థకం. లౌకిక రాజ్య భావనకు తూట్లు పొడిచే విధంగా విశ్వ విద్యాలయం క్యాంపస్‌లో ఈ తంతు అంతా జరగడం ప్రశ్నార్థకం. ఇలాంటి వాటికి అనుమతించడం, మౌనం వహించడం ప్రశ్నార్థకం. ఏదైనా సరే, పోరాడి సాధించవచ్చునని, కలబడి, తెగబడి నిలిచిన గొప్ప విద్యార్థి పోరాట సంప్రదాయాలు ఉన్న నిట్ క్యాంపస్‌లో జరగడమే ఈ ప్రశ్నకు కారణం. ప్రతీది ప్రశ్నించు, ప్రతీది శోధించు అనే తత్వాన్ని, పరిశోధనా దృష్టిని ఇవ్వవలసిన విశ్వవిద్యాలయాల దుస్థితి ఇలా ఉంటే ఈ దేశం బాగు పడడం ఇప్పట్లో సాధ్యమేనా? ఇక చదువులోకి వచ్చేసిన కార్పొరేట్ పోటీతో దారుణమైన ఒత్తిడికి లోనై విద్యార్థులు ఆత్మహత్యలు పాలవడం మనం చూస్తూనే ఉన్నాం. జీవితాన్ని, చుట్టూ ఉన్న సమాజాన్ని, సమాజ చలనాన్ని అర్థం చేసుకోవడానికి చదువుతున్న చదువు ఉపయోగపడక విద్యార్థులు తీవ్ర మానసిక సంక్షోభాన్ని ఎదుర్కొంటున్నారు. జీవితంలో ఇక సాధించాల్సింది ఏమీ లేదనే అపోహతో అలవాట్లు, జల్సాలకు లోనవుతున్నారు. వస్తువులూ, వాహనాలూ, అలంకరణలూ ఇలా అన్నిటా వికృత పోటీతో, అనవసర వేగంతో అర్థాంతరంగా చనిపోతున్నారు. సమస్యల పట్ల శాస్త్రీయ దృష్టి కొరవడి ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. సమస్యలకు గల శాస్త్రీయ కారణాలను శోధించకుండా చండీయాగాలలోను, ఇంకా అలాంటి మధ్య యుగాల నాటి విశ్వాసాలలోను పరిష్కారాలు చూపడం ప్రశ్నించ దగ్గవి.

## మద్యం సిండికేట్లు - మంత్రులు

**ఇ**టీవల మద్యం సిండికేట్లు ఇచ్చిన లంచాలు అందుకున్న వారిలో మంత్రులూ, ప్రజా ప్రతినిధుల నుంచి మొదలుపెట్టి పాత్రికేయుల దాకా ఉన్నట్లు అవినీతి నిరోధక శాఖ (ఎసిబి) ముఖ్యమంత్రికి ఇచ్చిన పన్నెండు వందల పేజీల రిపోర్టు రాష్ట్రంలో పెను సంచలనం సృష్టించింది. దానికి మరో కోణం రాజకీయ ప్రత్యర్థులు ఎవరైనా గట్టిగా మాట్లాడితే రాష్ట్రంలో ఎసిబి ఈ మధ్య మరింత 'గట్టిగా' పనిచేస్తోంది. 'వాస్తవాలు' వెలికితీస్తోంది. ఇలా బయటి ప్రత్యర్థులనూ, తన వర్గంలోని ప్రత్యర్థులనూ నోరు మూయించి, పాలన చేసే కొత్త టెక్నిక్ ఒకటి పాలకులు కనిపెట్టారు. ప్రత్యర్థుల నోరు మూయించాక ఆ నివేదికలను బుట్టదాఖలు చేస్తున్నారు ప్రభువులు. ఇందులో ఇరవై మంది మంత్రులకూ, 140 మంది ప్రజా ప్రతినిధులకూ (ఈ మంత్రుల, ప్రజాప్రతినిధుల మొత్తం సంఖ్యే అధికారంలో ఉండడానికి అవసరమయ్యే మెజారిటీ) 1500 ఎక్సైజ్ సిబ్బందికీ, రెండు వేల మంది పోలీసులకూ, తూనికలూ, కొలతలూ, మునిసిపల్, రెవెన్యూ సిబ్బందికీ, పాత్రికేయులకూ, ఇలా దాదాపు ఐదు వేల మందికి మద్యం సిండికేట్ల నుంచి ముడుపులు అందాయని తెలుస్తోంది. ఐదు వేల కోట్ల రూపాయల వరకు ముడుపులు అందినట్లు తెలుస్తోంది. మొత్తంగా మద్యంలో అక్రమాలు యాభై ఐదు వేల కోట్లుగా రాష్ట్రం వర్ధిల్లుతోంది. మద్యమూ, మతోన్మాదమూ ఇంకా అలాంటి ఏవో ఉన్మాదాల ఆసరా చేసుకుంటేనే గాని పాలకులు పాలన కొనసాగించలేని పరిస్థితి. పాలకుల అక్రమాలు, దుర్మార్గాలు, అన్యాయాలు, అశాస్త్రీయ విధానాలు ప్రశ్నించకుండా ఉండాలంటే ప్రజలను ఏదో ఒక మత్తులో ఉంచాలి. సమస్యలకు పరిష్కారాలను జూదం, లాటరీ, మట్కా, మద్యం, స్కీంలు, తాయెత్తులు, బాబాలు, గారడీలలో చూపించాలి. ప్రజలు మంచినీళ్లు, విద్య, వైద్యం, పండించిన పంటకు గిట్టుబాటు ధరలు అడుగుతుంటే మద్యంపై లాభాలు చేసుకునే పెద్ద కార్యక్రమంతో పాలకులు ఉన్నారు. 'ఉష్! తాగిన పెద్ద మనిషిని లేపకండి... ఆర్థిక వ్యవస్థ కుప్పకూలిపోతుంది'.

**వార్త - వ్యాఖ్య : డి.వి. రామకృష్ణారావు**

ప్రాచీన కాలానికీ, మధ్య యుగాలకూ, ఆ తరువాత కాలానికీ చెందిన అవశేషాలు ఈనాటికీ మన మధ్య కొనసాగుతూనే ఉన్నాయి. పాత నియమాలూ, విలువలూ, సామాజిక ఆచార వ్యవహారాలూ ప్రజల మనస్సుల్లో పాతుకు పోయాయి. వాటిని సులభంగా వదిలించుకోవడం సాధ్యం కాదు. దురదృష్టవశాత్తు ఈ అవశేషాలు వ్యక్తి అభివృద్ధికీ, దేశాభివృద్ధికీ ప్రతిబంధకంగా తయారయ్యాయి. వలస విధానం మన దేశంలో అమలులో ఉన్న కాలంలో వీటిని అదేపనిగా ప్రోత్సహించారు. ఈ అవశేషాలను మన సమాజంలో నుంచి తొలగిస్తే తప్ప భారతదేశం త్వరత్వరగా అభివృద్ధి చెందలేదు. మన దేశం ప్రజాస్వామ్య పద్ధతిలో అభివృద్ధి చెందడానికీ, ఐకమత్యాన్ని సాధించడానికీ కులాల వ్యవస్థా, శాఖల వ్యవస్థా అడ్డంగా నిలబడుతున్నాయి. కులాల అడ్డుగోడలూ, దురభిప్రాయాలూ విద్యావంతుల మనస్సుల్ని కూడా కలుషితం చేసి శారీరక శ్రమలోని ఔన్నత్యాన్ని గుర్తించనీయకుండా చేస్తున్నాయి. స్త్రీలకు ఓటు హక్కు ఇచ్చినా – వారి తరతరాల సామాజిక బానిసత్వం సామాజికాభివృద్ధిలో వారు భాగస్వాములు కావడానికి అడ్డం వస్తోంది. ప్రాచీన భారతదేశ చరిత్రను అధ్యయనం చేయడం ఈ దురభిప్రాయాలను లోతుగా అర్థం చేసుకోవడానికి ఉపయోగపడుతుంది., కులవ్యవస్థకు బలాన్నిస్తున్న, స్త్రీల దైన్యానికి దోహదం చేస్తున్న, సంకుచిత మత శాఖలను కొనసాగిస్తున్న కారణాలేమిటో అర్థం చేసుకోవచ్చు. గతాన్ని మళ్లీ బతికించాలని కోరుకునేవారికి మాత్రమే కాకుండా, గతం అసలు స్వభావాన్ని అర్థం చేసుకొని, మన దేశ అభివృద్ధికి ఎదురౌతున్న ఆటంకాల అసలు రూపాన్ని గురించి తెలుసుకోవాలని ఆశించేవారికి కూడా ప్రాచీన చరిత్రను అధ్యయనం చేయడం వల్ల ప్రయోజనం ఉంది.

**రామ్‌శరణ్ శర్మ – ప్రాచీన భారతదేశ చరిత్ర**

తెలుగుసేత – వల్లంపాటి వెంకటసుబ్బయ్య,

మన సాంఘిక చరిత్రకు పనికివచ్చు తెనుగు ప్రబంధాలలో ముఖ్యమైనవి– పాల్కురికి సోమనాథుని – బసవపురాణము, పండితారాధ్య చరిత్రము; శ్రీనాథుని (వల్లభరాయని) – క్రీడాభిరామము; శ్రీనాథుడో (కాడో!) – పల్నాటి వీర చరిత్రము; కొరవి గోపిరాజు – ద్వాత్రింశత్సా లభంజికలు; కృష్ణదేవరాయల – ఆముక్తమాల్యద; తాళ్లపాక తిరువెంగనాథుని – ద్విపద పరమయోగి విలాసము; సారంగు తమ్మయ్య – వైజయంతీ విలాసము; గౌరన–హరిశ్చంద్ర ద్విపద; కదిరీపతి – శుకసప్తతి; వెంకటనాథకవి – పంచతంత్రము; శతకములలో – వేమన, చంద్రశేఖర, కుక్కుటేశ్వర, రామలింగ, శరభాంక, వేణుగోపాల, వృషాధిప, సింహాద్రి నారసింహ, వెంకటేశ, గువ్వల చెన్న శతకాలు; భాషీయ దండకము; ఏనుగుల వీరాస్వామి –కాశీయాత్ర; పాండురంగ విజయము, శ్రీ కాళహస్తి మాహాత్మ్యము, శ్రీనాథుని చాటువులు, పీఠికలు కూడా కొంతవరకు సహాయపడును.

**సురవరం ప్రతాపరెడ్డి – ఆంధ్రుల సాంఘిక చరిత్ర**

ఎడిటర్ అనేవాడి గురించి నాకు కొన్ని కచ్చితమైన అభిప్రాయాలు ఉండేవి. రచయితలు పంపే వ్యాసాలూ ఇతర రచనలూ చూసి వాటిలో నుంచి కొన్ని ఏరి ప్రచురించినంత మాత్రాన ఎడిటరైపోడు. పాల సీసా నోటికందించిన మనిషల్లా తల్లి అవుతుందా?

నిజమైన ఎడిటరు పత్రికకు ఒక వ్యక్తిత్వాన్నిస్తాడు. ప్రాణం పోస్తాడు. పత్రిక యొక్క ఘనత పరోక్షంగా ఎడిటరు ఘనతే.

ఎడిటరుగా చలామణీ అయ్యేవాడికి పత్రిక పట్టినా, పట్టక పోయినా ఎడిటింగ్ పనిచేసేవాడికి ఆ పత్రిక గురించి ఉత్సాహమూ, బెంగా, శ్రద్ధా, తాపత్రయమూ, ఆనందమూ మొదలైన వ్యాధులన్నీ ఉండాలి.

ఈ రచయిత మనకు కావాలి. వీణ్ణి వదిలి పెట్టరాదు అన్న సరియైన నిర్ణయానికి వచ్చాక ఎడిటరు ఆ రచయితను బుజ్జగించో, కవ్వించో, పొగిడో, మస్కావేసో ఆకట్టుకోవాలి. అది చేతకానివాడు ఎడిటరే కాడు.

కొందరు ఎడిటర్లు తాము పాఠకులే కాకుండాపోతారు. మిఠాయి అమ్మేవాడికి జిహ్వాచాపల్యం లేకుండా పోయినట్టు. తెలుగు స్వతంత్రను కొన్ని సంవత్సరాలు ఎడిట్ చేసి కూడా గోరాశాస్త్రిలో పాఠకుడు చావలేదు.

తనకు నచ్చినది రెండు పంక్తులు కనిపించినా, ఆ ఆనందాన్ని ఇతరులతో పంచుకునేదాకా నిద్రపట్టని గుణం గోరాశాస్త్రిలో ఉండేది.... ఎడిటర్ కావడానికి అంతకన్న పెద్ద అర్హత ఏంకావాలి

**కొడవటిగంటి కుటుంబరావు – సంస్కృతి వ్యాసాలు**

నూతన విషయాలకు సంబంధించిన గ్రంథాల్ని అర్థం చేసుకోవడం లో కొంత కష్టం తట్టినా కూడా ఆ కష్టంలో ఏదో ఆనందం తడుతూంటుంది. ఒక నూతన విషయాన్ని అర్థం చేసుకోవడం వేరు. అర్థం చేసుకొన్న దాన్ని తనదిగా చేసుకోవడం వేరు. అర్థం అయినంత మాత్రాన తనదిగా మారదు. తనదిగా మారడం అంటే వేదిక మీద ఆ విషయాన్ని గురించి అనర్గళంగా ఉపన్యసించడానికి వీలు పడి ఉండాలి. ఏ గ్రంథాన్నీ వెదకకుండా ఆ విషయం మీద విస్పష్టంగా వ్యాసం రాయగలిగి ఉండాలి. అర్థం చేసుకొన్న తరువాత విషయాన్ని అప్పుడప్పుడు జ్ఞాపకం చేసుకుంటూ మనసులో దాని గురించి తర్కించుకుంటూ ఉంటే ఆ కొత్త విషయం తనకు పాత విషయంగా మారి తన సొంత విషయం అవుతుంది. అంతటితో దానిపై కొంత ఆధిపత్యం దొరుకుతుంది. ఏ విషయం మీదయినా ఎవరికయినా సంపూర్ణాధిపత్యం లభించదు. ప్రతి వారికీ కొంత మాత్రమే లభిస్తుంది. అయితే ఒకరి కొంత అనేది మరొకరి కొంత కంటే కొంత ఎక్కువ ఉండవచ్చు. అంతే.'

**సంజీవ్‌దేవ్ స్వీయ చరిత్ర – తుమ్మపూడి**

జాతి (ఇంగ్లిష్ స్పీషీస్ అనే మాటకు ఇది అనువాదం) అంటే ఏమిటి? మన ఇళ్లలో తిరిగే పిల్లులు ఒక జాతివి. వాటికి వాటిని పోలిన పిల్లులే జన్మిస్తాయిగాని కుక్క పిల్లలు కావు. మన వీధులలో తిరిగే కుక్కలు ఒక జాతివి. వాటికి తిరిగి కుక్కలే జన్మిస్తాయి గాని పిల్లులు కావు.

మన దేశంలోని ఏనుగులన్నీ ఒక జాతివి. అయితే, ప్రపంచంలోని ఏనుగులన్నీ – వాటికి ఎన్ని సమాన లక్షణాలు కనిపించినా – ఒక జాతివి కావు. ఆఫ్రికాలోని ఏనుగు జాతి వేరు. మన ఏనుగు జాతి వేరు. ఈ రెండు జాతుల ఏనుగులను సంయోగం చేస్తే సంతానోత్పత్తి కాదు.

స్థూలంగా నిర్వచించవలసివస్తే – ఏ రెండు స్త్రీ, పురుష జంతువుల సంయోగం వల్ల సంతానోత్పత్తి జరుగుతుందో ఆ రెండు స్త్రీ, పురుష జంతువులు ఒక జాతికి చెందినవని అర్థం చేసుకోవాలి. వృక్షాలలో కూడా అంతే. (ఇందుకు కొన్ని మినహాయింపులున్నాయి గాని, అవి ఇక్కడ అప్రస్తుతం.) ఏక జాతి జీవుల సంయోగంలోనే సంతానోత్పత్తి జరుగుతుందన్న విషయాన్ని జాతికి స్థూలమైన నిర్వచనంగా పరిగణించవచ్చు.

ఈ దృష్టితో చూస్తే మానవులందరు ఒకే జాతివారు. నీగ్రోలు కావచ్చు, యూరోపియన్‌లు కావచ్చు, మంగోలియన్‌లు కావచ్చు. స్థూల దృష్టికి వారిలో ఎన్ని తేడాలు కనిపించినా, పైన చెప్పిన నిర్వచనాన్ని బట్టి వారు ఒకే జాతికి – మానవ జాతికి చెందినవారు.

**నండూరి రామమోహనరావు – నరావతారం**

*ప్రజలపై యుద్ధంలో భాగంగా మానవ రహిత విమానాలను కూడా వినియోగించి ఆదివాసులనూ, వారి ఆరాట పోరాటాలనూ నిర్మూలించాలని చూస్తున్న ప్రభుత్వ దుర్మార్గానికి వ్యతిరేకంగా ఉద్యమించాలని అంటున్నారు* **ఎడ్ల పోచయ్య**

# మానవ రహిత విమానాల కథ

ఢిల్లీలో 2006 ఏప్రిల్ 13న జరిగిన నక్సలైట్ ప్రభావిత రాష్ట్రాల ముఖ్యమంత్రుల స్టాండింగ్ కమిటీ రెండో సమావేశంలో మాట్లాడుతూ ప్రధాని మన్మోహన్ సింగ్ మొదటిసారిగా 'భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) నాయకత్వాన నడుస్తున్న ఉద్యమమే దేశానికి అతి పెద్ద ఆంతరంగిక భద్రతా సమస్య' అని ప్రకటించారు. అప్పటినుంచి ఆయనా, ఇతర పాలకవర్గ ప్రతినిధులూ, అధికారులూ, పాత్రికేయులూ కూడ ఆ మాటను పదేపదే వాడుతున్నారు. ఒక రకంగా ప్రభుత్వం ఆ మాటతో మావోయిస్టు ఉద్యమాన్ని బూచిగా చూపదలచుకున్నదని, తద్వారా తన అణచివేత విధానాన్ని మరింత తీవ్రతరం చేయదలచుకున్నదని స్పష్టమవుతున్నది.

ఆ సమావేశంలోనూ, ఆ తర్వాత జరిగిన అనేక సమావేశాల లోనూ మావోయిస్టు ఉద్యమాన్ని అణచివేయడానికి కొత్త కొత్త చర్యలను ప్రతిపాదిస్తున్నారు, చర్చిస్తున్నారు, అమలులోకి తీసుకు వస్తున్నారు. మావోయిస్టు నాయకత్వ శ్రేణులలోకి చొరబడడం, మావోయిస్టు ప్రాంతాలలో హెలికాప్టర్లను వాడి దాడులు చేయడం, సైనిక, అర్ధసైనిక బలగాలకు ప్రత్యేకంగా అటవీ యుద్ధంలో శిక్షణ ఇవ్వడం, అదనపు బలగాలను సమకూర్చడం, అప్పటివరకూ వివిధ రాష్ట్రాలలో విడివిడిగా సాగుతున్న అణచివేత చర్యలన్నిటినీ దేశవ్యాప్తంగా సమన్వయం చేయడానికి వ్యవస్థలను ఏర్పాటు చేయడం, వివిధ రాష్ట్రాల మావోయిస్టుల మధ్య సమన్వయాన్ని ధ్వంసం చేయడం, మావోయిస్టు ఉద్యమకారుల సమాచారాన్ని సేకరించడానికి మానవ రహిత విమానాలను ఉపయోగించడం వంటి అనేక చర్యలను పాలకవర్గాలు బహిరంగంగానే చర్చిస్తున్నాయి. మొదలు పెడుతున్నాయి, తీవ్రతరం చేస్తున్నాయి. ఒక్క మాటలో చెప్పాలంటే మావోయిస్టుల మీద యుద్ధమే ప్రారంభమయింది.

సహజంగానే ఈ యుద్ధం మొత్తంగా ప్రజల మీద, ముఖ్యంగా దండకారణ్య ఆదివాసుల మీద యుద్ధంగా పరిణమిస్తున్నది. ఈ యుద్ధాన్ని దండకారణ్య ఆదివాసుల మీద ఎక్కుపెట్టడానికి భారత పాలకవర్గాలకు, సామ్రాజ్యవాదులకు రెండు కారణాలున్నాయి. ఆ దండకారణ్యంలోనే సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకు కావలసిన ఇనుము, మాంగనీస్, బాక్సైట్, బొగ్గు వంటి ఎన్నో ఖనిజ నిలువలు, అపారమైన జల, అటవీ వనరులు ఉన్నాయి. ఆదివాసులను అక్కడినుంచి వెళ్లగొట్టి ఆ ప్రాంతాన్నంతా ఆక్రమించి, తమ పరిశ్రమలకు ముడి సరుకుల నిరంతర సరఫరాకు మార్గం సుగమం చేసుకోవాలనేది బహుళజాతి సంస్థల, వాళ్ల భారత దళారీల వ్యూహం. ఆ వ్యూహాన్ని ప్రతిఘటిస్తున్నందువల్లనే ఆదివాసులను భారత ప్రభుత్వం శత్రువులుగా చూస్తున్నది. పైగా ఆ ఆదివాసులు భారత పాలక వర్గాలకు మరింతగా శత్రువులైన మావోయిస్టులతో జత కట్టినందుకు మరింత కోపం తెచ్చుకుంటున్నది. ప్రపంచంలో ఇక తనకు ఎదురులేదని విర్రవీగుతున్న సామ్రాజ్యవాదానికి మావోయిస్టులే ఇవాళ శక్తిమంతమైన ప్రత్యర్థులుగా ఉన్నారు. వారికి సహకరిస్తున్నందుకు, వారు ప్రతిపాదించే అభివృద్ధి నమూనా అమలులో, ప్రజా రాజ్యాధికార రూపమైన జనతన సర్కార్‌లో భాగం పంచుకుంటున్నందుకు, సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనాను ఎదిరిస్తున్నందుకు, బహుళజాతి సంస్థలకు ఖనిజ వనరుల సరఫరాను అడ్డుకుంటున్నందుకు మధ్యభారతంలోని ఆదివాసుల మీద ఈ యుద్ధం జరుగుతున్నది. మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, ఛత్తీస్‌గఢ్, ఒడిశా, జార్ఖండ్, పశ్చిమ బెంగాల్, బీహార్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ అటవీ ప్రాంతాలలో ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతోనూ, ఇతర ప్రాంతాలలో ఆ పేరు లేకుండానూ ఈ యుద్ధం సాగుతున్నది. అసలు ఆపరేషన్ గ్రీన్‌హంట్ అనేదేమీ లేదని, ఇది కేవలం బస్తర్‌లోని ఒక పోలీసు అధికారి యథాలాపంగా వాడిన మాట అని, ఆ మాటను పట్టుకుని విప్లవోద్యమ సానుభూతిపరులు, ప్రచార యంత్రాంగం యాగీ చేస్తున్నారని ఇటీవల కేంద్ర హోం మంత్రిత్వ శాఖ తయారు చేసిన పత్రం అంటున్నది. కాని వాస్తవంగా జరుగుతున్న చర్యలు చూస్తే ఇది భారత పాలకవర్గాలు భారత ప్రజల మీద సాగిస్తున్న అమానుష, అప్రజాస్వామిక, అనైతిక యుద్ధం అని తేటతెల్లమవుతుంది.

ఈ యుద్ధ క్రమంలో కేంద్ర రిజర్వ్ పోలీసు బలగాల (సిఆర్‌పిఎఫ్) లో ప్రత్యేకంగా కోబ్రా (కంబాట్ బెటాలియన్ ఫర్ రిజల్యూట్ యాక్షన్) విభాగాన్ని ఏర్పాటు చేశారు. దేశవ్యాప్తంగా 70,000 మంది కేంద్ర రిజర్వ్ పోలీస్ బలగాలను నక్సలైట్ వ్యతిరేక చర్యలకు వాడుతుండగా, ఛత్తీస్‌గఢ్‌లోని దక్షిణ బస్తర్ నుంచి మహారాష్ట్రలోని గడ్చిరోలి వరకు గల ప్రాంతంలో అతి ఎక్కువగా సిఆర్‌పిఎఫ్, కోబ్రా బలగాలను మోహరించారు. ఛత్తీస్‌గఢ్‌లో కాంకేర్, అంబికాపూర్‌లలో, జార్ఖండ్‌లో లతేహార్‌లో అరణ్య యుద్ధ కళాశాలలు నెలకొల్పారు. సైనిక శిక్షణ కేంద్రం పేరుతో అబూజ్‌మాడ్‌లో సైనిక స్థావరం నెలకొల్పారు. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను నడుపుతున్న పోలీసు, అర్ధ సైనిక, సైనిక అధికారులతో అమెరికా, ఇజ్రాయిల్‌లకు చెందిన సైనికాధికారులు, వ్యూహకర్తలు సమావేశమవుతున్నారు, చర్చలు జరుపుతున్నారు.

దండకారణ్యం చుట్టూరా రహదారి నిర్మించి, భవిష్యత్ చక్రబంధానికి సిద్ధం చేయడానికి సరిహద్దు రహదారుల సంస్థ (బిఆర్ఒ) ద్వారా ప్రయత్నిస్తున్నారు. భారత వైమానిక దళాన్ని కూడ ఈ యుద్ధ ప్రయత్నాలలో భాగం చేస్తున్నారు. ఆకాశం నుంచి సర్వేక్షణ, నిఘా

సాగిస్తూ, దాడి జరపడానికి హెలికాప్టర్లను, మానవ రహిత విమానాలను ఉపయోగిస్తున్నారు. సల్వాజుడుం, శాంతిసేన, సేంద్ర, గ్రామ రక్షాదళ్, నాగరిక్ సురక్షా సమితి, గణ ప్రతిరోధ్ కమిటీ, హర్మద్ వాహిని, భైరవ్ వాహిని తదితర పేర్లతో ప్రైవేటు హంతక సైన్యాలను ప్రయోగిస్తున్నారు. కోయ కమాండోల పేరుతో, సల్వాజుడుం పేరుతో సాగుతున్న ప్రైవేటు హంతక ముఠాలను రద్దు చేయమని సుప్రీంకోర్టు ఆదేశించిన తర్వాత సల్వాజుడుం కిరాయి సైనికులందరినీ చత్తీస్‌గఢ్ ఆగ్జిలరీ ఆర్మ్‌డ్ పోలీస్ ఫోర్సెస్ ఆర్డినెన్స్ 2011 ద్వారా పోలీసులుగా మార్చేశారు.

జాతీయ సాంకేతిక పరిశోధనా సంస్థ (నేషనల్ టెక్నికల్ రిసర్చ్ ఆర్గనైజేషన్ – ఎన్‌టిఆర్ఒ) కేంద్ర కార్యాలయం, ఎంఐ–17 హెలికాప్టర్ల స్థావరం మొదట చత్తీస్‌గఢ్ రాజధాని రాయపూర్‌లో నెలకొల్పి, ఇప్పుడు పోరాట ప్రాంతాలకు మరింత దగ్గరగా ఉండేలా, చత్తీస్‌గఢ్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, ఒడిశా రాష్ట్రాలకు సమానదూరంలో జగదల్‌పూర్‌కు మారుస్తున్నారు. ఈ ఎన్‌టిఆర్ఒ ఇజ్రాయిల్ తయారు చేసిన మానవ రహిత విమానాలను, ఇతర ఆకాశ నిఘా వ్యవస్థలను వాడుతున్నది. చత్తీస్‌గఢ్‌లోనూ, ఆంధ్రప్రదేశ్ – ఒడిశా సరిహద్దులలోను మానవ రహిత విమానాలను వాడుతున్నారని కూడ వార్తలు వస్తున్నాయి. సిఆర్‌పిఎఫ్ కోసం హర్యానాలోని కదార్‌పూర్‌లో 2012 ఫిబ్రవరి 8న ఇంటెలిజెన్స్ ట్రెయినింగ్ స్కూల్ ప్రారంభించారు. జాతీయ స్థాయిలో నేషనల్ కౌంటర్ టెర్రరిజం సెంటర్ (ఎన్‌సిటిసి) అనే కొత్త సంస్థను మార్చ్ 1 నుంచి ప్రారంభిద్దామని కలలు కంటుండగా, పాలకవర్గాల ముఠా తగాదాలలో భాగంగా కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు దానికి అడ్డం పడుతున్నాయి. అయితే ఈ తూతూమంత్రపు నిరసనలు ముగిసి, మావోయిస్టుల మీద దాడికి ఆ కొత్త సంస్థ ఆలస్యంగానైనా ఏర్పడే అవకాశం ఉంది.

ఏడాదికి మూడువేల మంది పోలీసులకు శిక్షణ ఇచ్చే కాంకేర్ అరణ్య యుద్ధ కళాశాల కొండరాళ్ల మీద 'గెరిల్లాలతో గెరిల్లాలలాగ యుద్ధం చేయండి' అని నినాదం రాసి పెట్టుకున్నారు. ప్రస్తుత సిఆర్‌పిఎఫ్ బలగాల డైరెక్టర్ జనరల్ విజయకుమార్ 2012 జనవరిలో జవాన్లను ఉద్దేశించి రాసిన లేఖలో నక్సలైట్లను ఓడించడానికి జంగ్లీలుగా మారమని కోరాడు. 'మీ ప్రత్యర్థి అన్ని రకాలుగానూ మీకన్న చాల తక్కువ స్థాయిలో ఉన్నాడు. శిక్షణ తక్కువ, పరికరాలు తక్కువ. దేహ దారుఢ్యం తక్కువ. ఎత్తుగడలు తక్కువ. ఆయుధాలు తక్కువ. సంఖ్య తక్కువ. తీసుకునే ఆహారం తక్కువ. అతను మీకు ఎదురుగా నిలబడి పోరాడలేడు. అందుకే దాక్కొని ఉంటాడు. కొట్టి పారిపోతాడు. అదే అతని బలం. మనం కూడ మన ఎత్తుగడలు మార్చుకుందాం. మనమూ వేటగాళ్లలాగ మారుదాం. అతని ప్రాంతంలో మాటువేసి ఉందాం. బలమైన దెబ్బతీద్దాం. జంగ్లీలాగ ఉండడం నేర్చుకుందాం' అని రాశాడు.

ఈ మొత్తం అణచివేత చర్యల వ్యవహారాన్ని, సరళిని చూస్తే ఇవి ప్రభుత్వాలు చెపుతున్నట్టు 'కేవలం శాంతి భద్రతల పరిరక్షణా చర్యలు' కావనీ, 'మారుమూల ఆదివాసి ప్రాంతాలకు అభివృద్ధి ఫలాలు అందించే కృషి' కాదనీ, ఇవన్నీ విస్పష్టంగా యుద్ధ చర్యలేనని అర్థమవుతుంది. ఈ సైనిక యుద్ధానికి తోడుగా మానసిక యుద్ధం కూడ జరుపుతున్నారు. ప్రజలను మభ్యపెట్టే కొత్త 'అభివృద్ధి' మంత్ర జపం కూడ సాగిస్తున్నారు. మానసిక యుద్ధంలో భాగంగా విప్లవోద్యమం మీద దుష్ప్రచారం సాగిస్తున్నారు. అన్ని రకాల ప్రచార సాధనాలనూ వాడుకుని విప్లవోద్యమ నాయకత్వం మీద, విప్లవోద్యమ పద్ధతులమీద తప్పుడు భావాలు వ్యాపింపజేస్తున్నారు. విప్లవ నాయకత్వాన్ని పట్టుకుని మట్టుబెట్టడానికి కోవర్టులను ప్రవేశ పెడుతున్నారు. ఒకే నాయకుడి కోసం ఏళ్లతరబడి వందలాది బలగాలను మోహరించి పట్టుకొని చంపడానికి అన్ని రకాల ప్రయత్నాలు చేస్తున్నారు. నాయకులలో ఒక్కొక్కరి గురించి చిన్న చిన్న వివరాలు కూడ సేకరించి వాటిని దేశవ్యాప్త నిఘా విభాగాలకు అందజేస్తున్నారు. తాజా ఉదాహరణగా, ఇటీవలనే ప్రచురితమైన, ఉదయ్‌కుమార్ అనే పోలీసు అధికారి రాసిన నక్సలైట్ మూవ్‌మెంట్ – ఎ బిగ్గెస్ట్ చాలెంజ్ టు ది ఇంటర్నల్ సెక్యూరిటీ అనే పుస్తకం చూడవచ్చు. ఆ పుస్తకంలో రచయిత పోలీసుల దగ్గర, నిఘా విభాగాల దగ్గర ఉండే సమాచారాన్నంతా పూసగుచ్చాడు. ఒక అధ్యాయంలో విప్లవోద్యమ నాయకుల వివరాలు, ఫొటోలు ప్రచురించాడు. దాంట్లో ముప్పాళ లక్ష్మణరావు (గణపతి) గురించి 'మధ్యస్థమైన ఎత్తు, మధ్యస్థమైన రంగు, జుట్టుకు రంగు వేస్తాడు. చదివేటప్పుడు కళ్లద్దాలు వాడతాడు. చాలవరకు మీసాలు కురచగా కత్తిరిస్తాడు. వెంటుకలు నిటారుగా ఉంటాయి' అనీ, నంబళ్ల కేశవరావు (బసవరాజు) గురించి 'ఆరడుగుల ఎత్తు, మధ్యస్థమైన రంగు, ఎప్పుడూ జుట్టుకు రంగు వేసుకుని ఉంటాడు. ఎప్పుడూ మీసాలు, గడ్డం నున్నగా కొరిగి ఉంటాయి. గబగబా నడుస్తాడు. నడిచేటప్పుడు అటూ ఇటూ ఊగుతాడు' అనీ చిన్న చిన్న వివరాలతో సహా రాసిన వాక్యాలు పోలీసుల కొత్త సమాచార సేకరణ, విస్తరణ పద్ధతికి అద్దం పడతాయి.

ప్రజలందరికీ కూడు, గూడు, గుడ్డ, మంచి జీవనం, ఆత్మగౌరవం, సమానత్వం కావాలని, దేశ సార్వభౌమాధికారం ప్రజల చేతిలో ఉండాలని, దేశం సామ్రాజ్యవాద దేశాల కుక్కలు చింపిన విస్తరి కాగూడదని అంటున్నందుకు ప్రజల మీద, ప్రజా ఉద్యమకారుల మీద భారత ప్రభుత్వం విరుచుకుపడుతున్న తీరు ఇది. ఈ చర్యల పూర్తి వివరాలను తెలుసుకుని, తెలియజెప్పి, వాటిని ఎదిరించడం, అడ్డుకోవడం, ఈ చర్యలకు పాల్పడుతున్న పాలకవర్గాలను కూలదోయడం ఇవాళ భారత ప్రజలందరి కర్తవ్యం. ఈ చర్యల వివరాలన్నీ రాయాలంటే పుస్తకాలే అవసరమవుతాయి గాని ఇక్కడ అన్నిటికన్న ప్రమాదకరమైన, అభ్యంతరకరమైన మానవ రహిత విమానాల కథ మాత్రం చూద్దాం.

అఫ్ఘనిస్తాన్‌లో, ఇరాక్‌లో మానవ రహిత విమానాలను ప్రయోగించిన అమెరికా వాటిని తాను చెపుతున్న వార్ ఆన్ టెర్రర్‌లో అనివార్య భాగంగా చూస్తున్నది. ఈ మానవ రహిత విమానాల సాంకేతిక శక్తి సామర్థ్యాలు ఏమిటి, వీటి ప్రయోగం భారతదేశంలో ఎలా జరగబోతోంది, అది ప్రజా జీవితానికి, ప్రజా ఉద్యమాలకు ఎటువంటి నష్టం కలగజేస్తుంది, ప్రజా ఉద్యమాలు ఈ ప్రమాదం నుంచి ఎలా తప్పించుకోవచ్చు, మధ్యతరగతి బుద్ధిజీవులు, మొత్తంగా సమాజం ఈ ప్రమాదానికి వ్యతిరేకంగా ఎటువంటి ప్రచారం, ఉద్యమం సాగించవలసి ఉంది అని చర్చించడమే ఈ వ్యాస లక్ష్యం.

శత్రువుల ఆచూకీ కనిపెట్టడానికీ, సాంకేతిక పరిజ్ఞానం ద్వారా సమాచారం సేకరించడానికీ, ఆచూకీ దొరికినచోట ఆయుధాలు ప్రయోగించడానికీ, బాంబులు వేయడానికీ, శత్రువులు కూల్చివేసినా మానవహాని లేకుండా తప్పించుకోవడానికీ మానవ రహిత విమానాలను (అన్‌మాన్‌డ్ ఏరియల్ వెహికిల్ – యుఎవి అనీ డ్రోన్ అనీ అంటారు) ఉపయోగిస్తారు. ఇవి సుదూరం నుంచి నడపగలిగిన సామర్థ్యంతోనూ, ఒకసారి మార్గ నిర్దేశనం చేసి పంపించగలిగిన సామర్థ్యంతోనూ కూడ ఉంటాయి. ఒకసారి గగన తలంలోకి పంపిన తర్వాత ఇరవై గంటలకు పైగా చక్కర్లు కొడుతూ తిరగగలిగిన శక్తి ఉంటుంది. ఇవి వేరు వేరు పరిమాణాలలో కూడ తయారవుతున్నాయి. మానవ రహిత విమానాల

తయారీ మొదటి ప్రపంచ యుద్ధ కాలంలోనే మొదలయినప్పటికీ, 1930లలో, 40లలో, ప్రధానంగా రెండో ప్రపంచ యుద్ధ కాలంలో మనుషులు లేకుండా, రేడియో ఆదేశాల ద్వారా నడిపించగలిగిన మానవ రహిత విమానాలను బ్రిటన్ తయారు చేసింది, ప్రయోగించింది. వీటికి 1950లలో అమెరికా, ఇజ్రాయెల్‌లు మరింత శక్తి సమకూర్చి తయారు చేయడం మొదలు పెట్టాయి. శత్రు భూభాగాల మీద, యుద్ధరంగాలలో తమ విమానాలు కూల్చివేయబడినప్పుడు వైమానిక సిబ్బంది మరణిస్తున్నారని, అటువంటి సైనిక ప్రాణనష్టాలు లేకుండా ప్రత్యర్థి మీద దాడి చేయగలిగిన సామర్థ్యం కావాలని చేసిన ఆలోచనల ఫలితమే ఈ మానవ రహిత విమానాలు. వియత్నాం యుద్ధంలో అమెరికా 1964 నుంచీ ఈ మానవ రహిత విమానాలను వాడిన విషయం 1973లో బైటపడింది. ఆ తర్వాత పశ్చిమాసియా దేశాల మీద దాడులు చేయడానికి, దొంగతనంగా సమాచారం సేకరించడానికి, ఎలక్ట్రానిక్ యుద్ధం జరపడానికి ఇజ్రాయిల్ కూడ మానవ రహిత విమానాలను అభివృద్ధి చేసింది. క్రమంగా ఈ సాంకేతిక పరిజ్ఞానాన్ని అమెరికా, ఇజ్రాయిల్ లు ఇచ్చిపుచ్చుకుంటూ ఒకరు తయారు చేసిన మానవరహిత విమానాలను మరొకరు వాడుతూ అభివృద్ధి చేస్తూ వచ్చారు. ప్రస్తుతం కనీసం నలభై దేశాల ప్రభుత్వాల దగ్గర ఈ సాంకేతిక పరిజ్ఞానం ఉంది, లేదా ఆ ప్రభుత్వాలు వాటిని వాడుతున్నాయి. అమెరికాలో కనీసం 50 కంపెనీలు, విశ్వవిద్యాలయాలు, ప్రభుత్వ సంస్థలు మానవ రహిత విమానాల రూపకల్పనలో, తయారీలో ఉన్నాయి. సాలీనా 155 నమూనాలు తయారతున్నాయని ఒక అంచనా.

మొత్తం ప్రపంచ మానవ రహిత విమానాల మార్కెట్ విలువ 300 కోట్ల డాలర్లని, దానిలో 70 శాతం అమెరికా చేతుల్లో ఉందని, రానున్న పది సంవత్సరాలలో ఈ మార్కెట్ రెట్టింపు కన్న ఎక్కువ అయి 700 కోట్ల డాలర్లు చేరుతుందని అంచనా. 2018 నాటికి ప్రపంచవ్యాప్తంగా 30,000 మానవ రహిత విమానాలు ఉంటాయని ఊహిస్తున్నారు. అమెరికా వీటిని 1995లో బోస్నియా లోనూ, 2001లో అఫ్ఘనిస్తాన్ యుద్ధంలోనూ పెద్ద ఎత్తున వాడింది. ఆ తర్వాత అఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, ఇరాక్, యెమెన్, సోమాలియా, లిబియా, ఉత్తర ఆఫ్రికా దేశాలలో సిఐఎ, అమెరికన్ సైనిక బలగాలు వేల సార్లు వాడి ఉంటాయి. పెంటగన్ (అమెరికా సైనిక కేంద్ర కార్యాలయం) దగ్గర పది సంవత్సరాల కింద 50 కన్న తక్కువ ఉండిన మానవ రహిత విమానాలు ప్రస్తుతం ఏడువేలు దాటాయని అంచనా.

మానవ రహిత విమానాల సహాయంతో పాకిస్తాన్‌లో, ప్రత్యేకంగా కొండ ప్రాంతాలలో, ఆదివాసి ప్రాంతాలలో అమెరికా చేసిన దాడులలో 2004 నుంచి 2011 ఆగస్ట్ వరకు 2,300 మంది చనిపోయారని బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేటివ్ జర్నలిజం చెపుతున్నది. ఇందులో 392 నుంచి 781 మంది సాధారణ ప్రజలు కావచ్చునని, 175 మంది పిల్లలు అని కూడ ఆ నివేదిక తెల్పింది. అంటే 'పాకిస్తాన్‌లో దాక్కొని ఉన్న తీవ్రవాదులను చంపడానికి' అనే కారణంతో ప్రయోగించిన మానవ రహిత విమానాల వల్ల దాదాపు సగం మంది ఇతరులే, సాధారణ ప్రజలే చనిపోయారు. ఇలా మానవ రహిత విమానాలు ప్రకటిత లక్ష్యాన్ని మాత్రమే గురిపెట్టడం సాధ్యం కాదని, అవి సాధారణంగా మామూలు మనుషులనే చంపుతాయని సామ్రాజ్యవాద సైనిక పాలకులకు తెలుసు. స్వయంగా బ్రిటన్ రక్షణ మంత్రిత్వ శాఖ తన మానవ రహిత విమానాల వల్ల పాకిస్తాన్‌లో, యెమెన్‌లో సాధారణ పౌరులు చనిపోయారని అంగీకరించింది. 'పాకిస్తాన్, యెమెన్‌లలో అప్రకటిత విమాన యుద్ధం సంపూర్ణంగా మానవ రహిత విమానాలు అందుబాటులో ఉండడం వల్లనే జరిగింది. ఈ సామర్థ్యం లేకపోతే ఈ స్థాయిలో బలప్రయోగం చేయగలిగి ఉండేవాళ్ళం కాము' అని ఆ రక్షణ శాఖ ఒప్పుకుంది.

మానవ రహిత విమానాల వల్ల జరగబోయే నష్టాల గురించి అమెరికా, యూరప్ లలో శాస్త్రవేత్తలు, పౌర, ప్రజాస్వామిక హక్కుల కార్యకర్తలు, పాత్రికేయులు చాల ఆందోళన చెందుతున్నారు. వీటిని వ్యతిరేకించే వారు ఇంటర్నేషనల్ కమిటీ ఫర్ రోబో ఆర్మ్స్ కంట్రోల్ (ఐసిఆర్ఏసి) (www.icrac.co.uk) అనే సంస్థను ఏర్పాటు చేసి మానవ రహిత విమానాలు సాగించే విధ్వంసం గురించి, వాటి అనైతికత గురించి ప్రచారం చేస్తున్నారు. ఈ కొత్త మారణాయుధాలను తీవ్రంగా విమర్శిస్తున్న బ్రిటిష్ జర్నలిస్టు జార్జ్ మాన్‌బయో పాకిస్తాన్‌లో జరిగిన ఒక దాడి గురించి జనవరి 31న గార్డియన్ లో రాశాడు: 'గత అక్టోబర్‌లో పాకిస్తాన్‌లోని ఉత్తర వజీరిస్తాన్‌లో పదహారేళ్ల కుర్రాడు తారిఖ్ అజీజ్, అతని సమీప బంధువు, పన్నెండేళ్ల వహీద్‌ఖాన్ కారులో వెళ్తుండగా అమెరికాకు చెందిన మానవ రహిత విమానం నుంచి క్షిపణి దాడి జరిగింది. ఇద్దరూ చనిపోయారు. ఎప్పుడూ జరిగినట్టుగానే వారి మరణమే వారిని నేరస్తులను చేసింది. మేం వాళ్లను చంపేశామంటే, వాళ్లు తీవ్రవాదులే అయి ఉంటారు అనేది అమెరికా వాదన. కాని వాళ్లు తీవ్రవాదులు కారు. తారిఖ్ రిప్రీవ్ అనే మానవ హక్కుల బృందంతో కలిసి పని చేస్తున్నాడు. మానవ రహిత విమానాల దాడుల తర్వాత పరిస్థితి ఎలా ఉంటుందో ఫొటోలు తీస్తున్నాడు. మరి అతని మీద దాడి పొరపాటు అయి ఉంటుందా? కావచ్చు. కాని అంతకన్న మానవ రహిత విమానాలు ఉద్దేశ పూర్వకంగానే అతణ్ని హత్య చేశాయనేది ఎక్కువ నమ్మశక్యంగా ఉంటుంది...'

అమెరికా వైమానిక దళంలో కర్నల్‌గా పనిచేసిన మాట్ మార్టిన్ మానవ రహిత విమానాల గురించి తన అనుభవాలను ప్రిడేటర్ అనే పుస్తకంలో వెల్లడించాడు. ఆయన అమెరికాలోని నెవాడాలో వైమానిక దళ కేంద్రంలో కూచుని ఎనిమిది వేల మైళ్ల అవతల అఫ్ఘనిస్తాన్‌లో ఒక కొండ లోయలో నడుస్తున్న 'అనుమానితులను' చూడగలిగానని రాశాడు. మానవ రహిత విమానానికి అమర్చిన శక్తిమంతమైన వీడియో కెమెరాల సాయంతో ఆ 'అనుమానితులు' సిగరెట్ ముట్టించుకోవడం, స్నానాల గదికి వెళ్లడం వంటి చర్యలను కూడ చూడగలిగానని రాశాడు.

మానవ రహిత విమానాల సామర్థ్యం ఇంకా ఇంకా పెంచడానికి అమెరికన్, ఇజ్రాయెలీ రక్షణ శాస్త్రవేత్తలు నిరంతరం పని చేస్తున్నారు. ఈ అన్వేషణల ఫలితంగా 'శత్రువును తనంతట తనే వేటాడి, గుర్తించి, కాల్పులు జరపగల మానవ రహిత విమానం తయారవుతున్నద'ని వాషింగ్టన్ పోస్ట్ పత్రిక రాసింది.

మానవ రహిత విమానాలు చాల శక్తిమంతమైన, నిరంతరాయమైన నిఘా కొనసాగించగలవు. విస్తృత స్థాయిలో, పరిమాణంలో సమాచారాన్ని సేకరించగలవు. వాటికి అమర్చిన వీడియో కెమెరాలు, ఇన్‌ఫ్రారెడ్ కెమెరాలు, హీట్ సెన్సర్లు, రాడార్ పరికరాలు నిర్దిష్ట లక్ష్యాలను నిరంతరం ఫొటో తీస్తూ ఉండగలవు. ఆ ఫొటోలను కేంద్ర స్థావరానికి పంపించగలవు. లేదా తామే విశ్లేషించగలవు. ఒక్కొక్కసారి లక్ష్యాల మీద దాడులు కూడ చేయగలవు. కొత్త మానవ రహిత విమానాలలో అత్యాధునిక జిగాపిక్సెల్ కెమెరాలు కూడ ఉంటున్నాయనీ, అవి ఇరవై వేల అడుగుల ఎత్తు నుంచి కూడ లక్ష్యాలను కచ్చితంగా, విస్పష్టంగా గురి చూడగలవనీ వార్తలు వస్తున్నాయి. మరికొన్ని మానవ రహిత విమానాలలో ఎలక్ట్రానిక్ సమాచార సంబంధాలను పసిగట్టగల, ఆ

సమాచార ప్రవంతి నుంచి సంభాషణలను, సందేశాలను గ్రహించగల పరికరాలు కూడ ఉంటున్నాయి. కొన్ని మానవ రహిత విమానాలలో శత్రువు మీద పేల్చడానికి తుపాకులు, మందుగుండు సామగ్రిని తీసుకుపోగల వాహకాలు కూడ ఉంటాయి. ఇవి మూడు వేల అడుగుల నుంచి ఇరవై వేల అడుగుల ఎత్తు వరకు ఎగరగలవు గనుక మామూలు కంటికి కనబడవు. ఇవి ఎలక్ట్రో మాగ్నెటిక్ (విద్యుదయస్కాంత) స్పెక్ట్రం సెన్సర్లు, గామా రే సెన్సర్లు, బయొలాజికల్ సెన్సర్లు, కెమికల్ సెన్సర్ల ద్వారా సమాచారాన్ని సేకరిస్తాయి.

సంక్లిష్టమైన శాస్త్రవిజ్ఞాన, సాంకేతిక వివరాలన్నీ అవసరం లేదు గాని ప్రధానంగా మానవ రహిత విమానాలు విద్యుదయస్కాంత క్షేత్రాన్ని, రేడియో తరంగాలను, ఉష్ణోగ్రతా తారతమ్యాలను సేకరించడం ద్వారా, ఇన్‌ఫ్రారెడ్ చిత్రీకరణ ద్వారా సమాచారాన్ని సేకరిస్తాయి. సులభంగా చెప్పాలంటే ప్రకృతిలో ప్రతి పదార్థానికీ, వస్తువుకూ ఎన్నో రకాల విద్యుదయస్కాంత తరంగాలు విడుదల చేసే శక్తి ఉంటుంది. ప్రతి వస్తువూ తనదైన ఉష్ణోగ్రతను కలిగి, దాన్ని బైటికి విడుదల చేస్తూ ఉంటుంది. ఇన్‌ఫ్రారెడ్, థర్మల్ ఇమేజింగ్ పద్ధతుల ద్వారా ఒక ప్రాంతాన్ని ఫొటో తీసినప్పుడు ఆ ఫొటోలో ఉన్న వేరువేరు రంగుల స్పెక్ట్రంను విశ్లేషించడం ద్వారా అక్కడ ఏయే ఉష్ణోగ్రతలు విడుదల అవుతున్నాయో, అంటే ఏయే రకాల వస్తువులు ఉన్నాయో తెలుస్తుంది. మానవ శరీరానికీ, లోహపు వస్తువులకూ పరిసరాలకన్న ఎక్కువ ఉష్ణోగ్రతను విడుదల చేసే స్వభావం ఉంది. అందువల్ల ఈ పద్ధతుల ద్వారా సుదూరం నుంచి తీసిన చిత్రాలలో ఎక్కడెక్కడ మనుషులు ఉన్నారో, వాహనాలు, లోహపు ఆయుధాలు ఉన్నాయో తెలుస్తుంది. ఈ సాంకేతిక పరిజ్ఞానం ఇప్పుడు చాల అభివృద్ధి అయి వెంటవెంటనే విశ్లేషించగల సౌకర్యం, స్పష్టమైన వీడియో చిత్రాలను గ్రహించగల సామర్థ్యం కూడ వచ్చాయి.

నల్లమల అడవిలో సాయుధ గెరిల్లాలు సంచరిస్తున్నారని అనుమానం వచ్చినచోట మానవ రహిత విమానాల ద్వారా, లేదా హెలికాప్టర్ల ద్వారా చిత్రాలు తీసినప్పుడు తుపాకుల లోహాల వల్ల వారు అక్కడ ఉన్నట్టు తెలిసిందని కొన్ని వార్తలు గతంలో వచ్చాయి. కాని అది పూర్తి నిజం కాదు. అప్పుడు పోలీసులు ఒక రకమైన మానసిక యుద్ధంలో భాగంగానే ఆ వార్తలు విడుదల చేశారు. అయితే, ఆధునిక శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానానికి ఆ సామర్థ్యం మాత్రం ఉందని, పెరుగుతున్నదని మాత్రం గుర్తించాలి.

ఆ సామర్థ్యాన్ని అడ్డుకోగల అవకాశాల గురించి కూడ అన్వేషణలు సాగుతూనే ఉన్నాయి. కేవలం ప్రభుత్వ వ్యతిరేక శక్తులు మాత్రమే కాక, తమ ఏకాంతాన్ని భంగపరచి, సాంకేతిక పరిజ్ఞానం ద్వారా తమ వ్యక్తిగత జీవితాలలోకి చొరబడే అధికారం రాజ్యాంగ యంత్రానికి లేదని వాదించే స్వతంత్ర శాస్త్రవేత్తలు, మానవ హక్కుల సమర్థకులు కూడ మానవ రహిత విమానాలకు అవరోధాలు కల్పించడం గురించి ఆలోచిస్తున్నారు. ఆ అవరోధాల గురించి, వాటి సామర్థ్యాన్ని పెంచడం గురించి అన్వేషిస్తున్నారు. ఎక్కడ పడితే అక్కడ దొరికే మామూలు వస్తువులతోనే ఆ సాంకేతిక సామర్థ్యాన్ని అడ్డుకునే పరికరాలు తయారుచేయడం గురించి ఆలోచిస్తున్నారు.

ఈ మొత్తం నిఘా, సమాచార సేకరణ ప్రక్రియ విద్యుదయస్కాంత క్షేత్రం ఆధారంగానూ, ఉష్ణోగ్రతల విడుదల ఆధారంగానూ జరుగుతుంది గనుక, విద్యుదయస్కాంత క్షేత్రాన్ని భంగపరచినా, ఉష్ణోగ్రతల విడుదలను అడ్డుకున్నా, ఉష్ణోగ్రతలను తగ్గించినా సుదూర చిత్రాల సామర్థ్యం తగ్గిపోతుంది. ఇది ప్రాథమిక సూత్రం. విద్యుదయస్కాంత క్షేత్రాలను దెబ్బతీయడానికి మామూలు పాటల, చిత్రాల కాసెట్లలో ఉండే మాగ్నెటిక్ టేప్ కూడ పనికి వస్తుంది. దాన్ని ముక్కలుగా కత్తిరించి, రంగులలో కలిపి వాహనాలకు, యంత్రాలకు, ఆయుధాలకు ఆ రంగులు పూస్తే విద్యుదయస్కాంత క్షేత్రం దెబ్బ తింటుందని ఒక ప్రతిపాదన ఉంది. అలాగే స్పాంజిని కార్బన్ డస్ట్ (పెన్సిల్ అరగదీస్తే వచ్చే పొడి) లో ముంచి, దాచి ఉంచదలచుకున్న వస్తువులకు అడ్డంగా ఆ స్పాంజిని పెడితే విడుదల చేసే ఉష్ణోగ్రత తగ్గిపోతుందని మరొక ప్రతిపాదన ఉంది. థర్మాకోల్ ముక్కలను వస్తువుల చుట్టూ పెడితే విడుదలయ్యే ఉష్ణోగ్రత తగ్గిపోతుంది. అలాగే అమెరికా తయారు చేసిన స్పేస్ బ్లాంకెట్ (ఒకవైపు పల్చని లోహపు పొర, మరొకవైపు ఊలు పొరతో ఎక్కువ బరువు లేకుండా ఉండే దుప్పటి) మనిషి మీద, ఆయుధం మీద పూర్తిగా కప్పుకుంటే ఉష్ణోగ్రత విడుదల కాదని మరొక ప్రతిపాదన ఉంది. ఇవి కాకుండా మార్కెట్లో థర్మో రెసిస్టెంట్ (ఉష్ణోగ్రతా నిరోధక) వస్తువులు ఎన్నో దొరుకుతున్నాయి. అవన్నీ కూడ ఉష్ణప్రసారాన్ని అడ్డుకుంటాయి, తగ్గిస్తాయి. అలాగే ఎలక్ట్రానిక్ సమాచార సంబంధాలను అడ్డుకోవడానికి అదే ఫ్రీక్వెన్సీలో ప్రసారాలు సాగించి జామ్ చేసే అవకాశం ఉంది.

ఇదంతా శాస్త్ర సాంకేతిక అవకాశాలకు, పరిమితులకు సంబంధించిన చర్చ. అంతకన్న ముఖ్యంగా ప్రజల మధ్య, ప్రజల కోసం పనిచేస్తున్న ఉద్యమానికి వ్యతిరేకంగా పాలకవర్గాలు నిఘా పరిజ్ఞానాన్ని వాడుతున్నప్పుడు ప్రజల రక్షణే పెట్టని కోటగా ఉంటుందని గుర్తించాలి. ప్రజలే ఆ ఆధునిక పరిజ్ఞానపు చొరబాటు శక్తిని అడ్డుకోగలరు. ప్రజల మధ్య నీటిలో చేపలా ఉద్యమకారులు తిరుగాడినప్పుడు ఎటువంటి శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం కూడ వారికి హాని చేయజాలదు. పైగా ఉద్యమకారులు ఒకే చోట స్థిరంగా ఉన్నప్పుడు నిఘానేత్రంతో వారిని గుర్తించడం, దాడి చేయడం సాధ్యమవుతుందేమో గాని వారు నిరంతరం నడుస్తూ, చలనంలో ఉన్నప్పుడు నిఘానేత్రం అందించే సమాచారం విశ్లేషణ అయ్యే లోపుగానే వారి స్థానం మారిపోతుంది.

ఈ కొత్త ప్రమాదాన్ని విప్లవోద్యమం ఎలా ఎదుర్కొంటుంది, ఎలా అధిగమిస్తుంది అనే ప్రశ్నలకు సమాధానాలను విప్లవోద్యమం కనిపెడుతుంది గాని బైటి సమాజంలోని బుద్ధిజీవులు, ఆలోచనాపరులు, మొత్తంగా సమాజం ఆలోచించవలసిన ప్రశ్నలు ఉన్నాయి. ఇటువంటి దుర్మార్గమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని ఒక ప్రభుత్వం తన ప్రజల మీద వాడవచ్చునా? ఈ సాంకేతిక పరిజ్ఞానం ద్వారా కచ్చితంగా లక్ష్యాన్ని కనిపెట్టలేకపోయినా, విచ్చలవిడిగా ఆ ప్రాంతం మొత్తం మీద బాంబు దాడులకు, తుపాకి కాల్పులకు అవకాశం ఉన్నప్పుడు ఇది ప్రజలమీద యుద్ధంగా మారిపోదా? ఇలా ప్రభుత్వానికి ప్రజల మీద యుద్ధం జరిపే హక్కు ఉందా? కొల్లాటరల్ డామేజ్ పేరుతో లక్ష్యం మీద మాత్రమే కాక, లక్ష్యానికి చుట్టుపట్ల ఉండే సాధారణ ప్రజానీకం మీద దాడి చేయవచ్చునని అమెరికా ప్రవచించిన అమానుష సిద్ధాంతాన్ని భారత ప్రభుత్వం కూడ తలకెత్తుకుంటున్నదా? వందల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని వ్యయం చేస్తూ ఇలా ప్రజల మీద యుద్ధానికి దిగుతున్న పాలకవర్గాలకు అధికారంలో ఉండే నైతిక హక్కు ఉందా? ఇటువంటి ఎన్నో ప్రశ్నలు ఇవాళ బైటి సమాజం తీవ్రంగా ఆలోచించవలసి ఉంది.

ప్రజల మీద ప్రభుత్వం ప్రారంభించిన ఈ అనైతిక, అమానుష, దుర్మార్గ యుద్ధాన్ని, ప్రత్యేకించి మానవ రహిత విమానాల వాడకం వంటి దుర్మార్గ పద్ధతులను ఖండించడం, ఆ పద్ధతులు ఎంత దుర్మార్గమైనవో ప్రచారం చేయడం, పాలకవర్గాలు ఆ పద్ధతులకు పాల్పడకుండా ప్రతిఘటించడం సమాజంలోని ప్రతి ఒక్కరి కర్తవ్యం.

*(రచయిత పాత్రికేయులు)* వీ

*ప్రజల నిజమైన అభివృద్ధికి తగిన ప్రణాళికలు గానీ, దీర్ఘకాలిక లక్ష్యాలుగానీ ఎప్పటి లానే ఈ బడ్జెట్‌లోనూ లేవని అంటున్నారు* **వి. హనుమంతరావు**

# బడ్జెట్ గలగల, సంక్షేమం విలవిల

**2012-13** సంవత్సరానికి ప్రవేశపెట్టిన బడ్జెట్ రాబోయే ఉప ఎన్నికలను దృష్టిలో ఉంచుకొని తయారు చేసినది. ఎన్నికల ప్రణాళిక, బడ్జెట్ ప్రసంగాన్ని దానికి తోడుగా శాసనసభ్యులకు అందచేసే సామాజిక - ఆర్థిక సర్వేను కలిపి చదివితే రాష్ట్రం అంతా పాలూ, తేనే ప్రవహిస్తున్నాయా అని అనిపిస్తోంది. ప్రతి బడ్జెట్ వెనుక కొన్ని ప్రభుత్వ విధానాలు, రాబోయే సంవత్సరంలో ఆ విధానాలను అమలు పరిచే తీరు కనిపిస్తాయి. ఏయే రంగాలకు ప్రాధాన్యత ఇవ్వదలచుకున్నారో తెలుసుకోవచ్చు. మరో విధంగా చెప్పాలంటే రాష్ట్ర బడ్జెట్ పాపులిస్ట్ విధానాల బడ్జెట్. ప్రతిపక్షాలు ఎత్తిచూపే లోటుపాట్లు మాట అటుంచి పాలక పార్టీ కాంగ్రెస్‌లోనే అధికారంలో ఉన్న ముఠా అధికారంలో లేని ముఠాపై పైచేయి సాధించాలనే కొట్లాటల నేపథ్యంలో ప్రవేశపెట్టిన బడ్జెట్ కావడంతో ఆ ఛాయలు కూడా బడ్జెట్‌లో చూడవచ్చు.

ఎప్పటిలాగే ఈ బడ్జెట్ ఉపన్యాసంలో అభివృద్ధి గురించి ప్రజలకు మిఠాయి లాంటి ప్రసాదం పంచిపెట్టారు. గత సంవత్సరం కన్నా రాబోయే సంవత్సరంలో కేటాయింపులు పెంచామన్నారు. అలా పెంచడమే అభివృద్ధా? అసలు అభివృద్ధి అంటే ఏమిటో, ప్రభుత్వ నిర్వచనం ఏమిటో కాస్త వివరిస్తారా? బ్రిటిష్ సామ్రాజ్యవాదులు కూడా ప్రాజెక్టులు నిర్మించారు, రహదారులేర్పాటు చేశారు. రైలు మార్గాలు వేశారు. ఇపుడు ప్రభుత్వం ప్రకటిస్తూ వచ్చిన అభివృద్ధి కార్యక్రమాలు బ్రిటిష్ పాలనలో కూడా జరిగాయి. అయినా గాంధీజీ వాళ్లు దేశాన్ని విడిచిపెట్టి వెళ్లేవరకు నిరంతర పోరాటం సాగించారు. ఆ లెక్కన ప్రస్తుత పాలకులను గద్దె దిగండి అని అనడం ఎలా తప్పవవుతుంది?

### అభివృద్ధి అంటే?

ఇటీవల తిరుపతిలో జరిగిన 30వ ఆంధ్రప్రదేశ్ ఆర్థిక సంఘం సమావేశం అధ్యక్షోపన్యాసంలో ప్రముఖ వ్యవసాయార్థిక శాస్త్రవేత్త కె.ఆర్. చౌదరి 'అభివృద్ధి' గురించి సుదీర్ఘంగా ప్రసంగించారు. అభివృద్ధి అనే కుచ్చు టోపి ప్రజల నెత్తినపెట్టి వారిని సంవత్సరాలుగా మాయలో ముంచేస్తున్నారు కాబట్టి, ఆయన చేసిన నిర్వచనాన్ని సుదీర్ఘంగానే మీ ముందుంచుతున్నా. పాలకుల కళ్లల్లో, ప్రజల దృష్టిలో అభివృద్ధి అంటే ఏమిటో తెలుసుకొని, ఇక నుంచి అధికారులు, పాలకవర్గ రాజకీయ నేతలు, పాలకవర్గ ఆర్థిక శాస్త్రవేత్తలు అభివృద్ధి గురించి మాట్లాడినపుడు అసలు విషయం తెలుసుకోవచ్చు.

### అభివృద్ధి అంటే

1) అత్యధిక ప్రజల జీవనం, జీవన విధానం మెరుగు పడాలి. 2) అందరికీ సమానవకాశాలు. 3) అందరికీ ఆదాయం, ఆస్తుల్లో సమానత్వం సాధించి, పౌరుల మధ్య పేద-ధనిక వర్గాల మధ్య అంతరాలను తొలగించడం. 4) ప్రజల ఆశలను, కోర్కెలను తీర్చగలగాలి. 5) ప్రజలు సుఖంగా, సంతోషంగా, ప్రశాంతంగా, గౌరవంతో బతకాలి. 6) మానవ హక్కులు పరిరక్షింపబడాలి, గౌరవించబడాలి, గౌరవించాలి. 7) వాతావరణం రక్షించబడాలి. 8) మానవతను, మానవీయ సంబంధాలను సమాజంలో పెంపొందించాలి. 9) అభివృద్ధి పేరుతో నిర్వాసితులను చేయడం, హక్కులు కాలరాయడం, విధ్వంసం, హత్యల సంస్కృతిని నిరోధించాలి. 10) దోపిడీ రహిత సమాజాన్ని సాధించాలి.

### పై లక్ష్యాలను ఎలా సాధించాలి?

ఎ) పేదలు, నిరుపేదలకు పోషకవిలువలు కలిగిన ఆహారం అందించాలి.
బి) తాగునీటి లభ్యత, పారిశుద్ధ్యం ఏర్పాటు చేయాలి
సి) నివాసయోగ్యమైన వసతి, శుభ్రమైన బట్టలు
డి) ఆరోగ్యం, అందుబాటులోనే వైద్య సౌకర్యం, రోగాల బారిన పడకుండా ఏర్పాటు
ఇ) అందుబాటులో విద్యా సౌకర్యం, డ్రాపవుట్లను అదుపు చేయడం.
ఎఫ్) ఉద్యోగవకాశాలు
జి) వివిధ తరగతుల మధ్య అంతరాల తొలగింపునకు ఆదాయాల పెంపుదల
ఎచ్) ప్రజావసరాల కనుగుణమైన పారిశ్రామిక రంగం, వాటి సరఫరా, ధరలు ప్రజలకందుబాటులో ఉండాలి
ఐ) ఆత్మహత్యలను ఆపాలి. ఆర్థిక సంక్షోభం నుంచి రక్షణ
జె) సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక సౌకర్యాల పెంపు
కె) పేదల ఉత్పత్తి సౌకర్యాల పెంపుదల

(రు. కోట్లలో)

| | 2007 -08 | 2008 -09 | 2009 -10 | 2010 -11 | 2011-12 (డిసెంబర్ ఆఖరు) |
|---|---|---|---|---|---|
| కేటాయింపు | 30,500 | 44,000 | 33,496.75 | 36,800 | 43,000 |
| ఖర్చు | 27,171 | 30,168 | 29,391 | 31,576 | 25124.15 |

## రాష్ట్ర బడ్జెట్

(రు. కోట్లు)

| | 2006-07 | | 2007-08 | | 2008-09 | | 2009-10 | |
|---|---|---|---|---|---|---|---|---|
| | కేటాయింపు | ఖర్చు | కేటాయింపు | ఖర్చు | కేటాయింపు | ఖర్చు | కేటాయింపు | ఖర్చు |
| నీటిపారుదల | 10000 | 9126 | 12973 | 12215 | 16471 | 9009 | 17171 | 14970 |
| పరిశ్రమలు | 358 | 204 | 473 | 436 | 571 | 262 | 774 | 240 |
| ఇంధన శాఖ | 108 | 58 | 259 | 46 | 391 | 18 | 202 | 31 |

| | 2007-08 | | 2008-09 | | 2009-10 | | 2010-11 | | 2011-12* | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | కేటాయింపు | ఖర్చు | కేటాయింపు | ఖర్చు | కేటాయింపు | ఖర్చు | కేటాయింపు | ఖర్చు | కేటాయింపు | ఖర్చు |
| సాధారణ విద్య | 732.11 | 631.16 | 1615.36 | 854.01 | 1168.23 | 678.09 | 1751.55 | 1586.42 | 2726.94 | 1949.12 |
| సాంకేతిక విద్య | 86.93 | 59.07 | 119.23 | 62.71 | 646.45 | 328.73 | 534.63 | 360.46 | 583.26 | 271.91 |
| వైద్యం, ఆరోగ్యం | 760.28 | 663.94 | 1317.09 | 1066.81 | 1412.00 | 1326.48 | 1550.42 | 1588.42 | 1712.89 | 1245.44 |
| మంచినీరు, పారిశుద్ధ్యం | 831.86 | 697.55 | 1434.98 | 792.94 | 780.69 | 961.53 | 761.86 | 1034.57 | 1093.36 | 415.21 |
| గృహనిర్మాణం | 4853.17 | 2780.52 | 5907.42 | 4096.66 | 1808.01 | 1413.54 | 1808.38 | 1643.01 | 2311.38 | 1251.62 |
| పట్టణాభివృద్ధి | 1464.58 | 1427.03 | 2768.21 | 2681.29 | 2152.91 | 2255.52 | 2748.04 | 2742.29 | 3180.65 | 1594.33 |
| ఎస్‌సి, ఎస్‌టి, బిసి, మైనారిటీ | 1465.17 | 1259.73 | 2232.73 | 1866.06 | 1856.57 | 1846.04 | 2529.55 | 2901.55 | 3182.45 | 2929.09 |
| కార్మికులు, ఉద్యోగులు | 15.76 | 25.49 | 170.96 | 73.83 | 43.75 | 32.04 | 68.60 | 31.48 | 73.75 | 22.01 |
| సామాజిక రక్షణ సంక్షేమం | 218.73 | 218.57 | 440.76 | 417.61 | 404.69 | 300.12 | 307.39 | 190.74 | 321.56 | 79.58 |
| పోషకాహారం | 250.00 | 233.68 | 240.18 | 205.67 | 280.42 | 200.70 | 465.32 | 222.74 | 531.27 | 332.31 |

మూలం : సోషియో ఎకనమిక్ సర్వే, 2011-12

ఎల్) ఆహార పంపిణీ వ్యవస్థ

ఇవన్నీ మనకు తెలియనివి కావు. వీటి కోసమే నిరంతరం ఆందోళనలు జరుగుతూనే ఉన్నాయి. అలా ఆందోళన చేస్తున్న ప్రజల కోర్కెలకు, ఆకాంక్షలకు, ఆశయాలకు చౌదరి అక్షర రూపాన్ని ఇవ్వడమే కాక మన బాధ్యతలను గుర్తు చేసారు. బడ్జెట్‌లో ఈ సమస్య ప్రస్తావన గానీ, పరిష్కారాలను గానీ కనిపించాయా?

**కేటాయింపు - ఖర్చు**

బడ్జెట్‌లో కేటాయింపులు ఘనం, ఖర్చు నీరసం - ఇది ప్రతి సంవత్సరం జరుగుతూ వస్తున్న తతంగమే. ఉదాహరణకు ప్రస్తుత పదకొండవ ప్రణాళిక లక్ష్యాలు, సాధనా వివరాలు చూడవచ్చు.

మొత్తం పదకొండవ ప్రణాళికకు గణాంకాలలో రాసుకంటే కేటాయింపు రు. 1,87,791.75 కోట్లు కాగా ఖర్చు చేసింది రు. 1,44,879.96 కోట్లు మాత్రమే. అంటే ప్రతీ నాలుగు రూపాయల కేటాయింపులో ఒక రూపాయి ఖర్చు కాలేదు. గత నాలుగైదు ప్రణాళికల నుంచి ఇదే వరుస.

సామాజిక సంక్షేమ పథకాలకు 2012-13లో భారీగా కేటాయింపులు జరిగాయని పత్రికలు పెద్ద శీర్షికలతో ప్రకటించాయి. కాని గత నాలుగు సంవత్సరాల కేటాయింపులు, ఖర్చులు చూస్తే అటువంటి ఆశకు తావులేదు. ఈ పద్దుకింద పథకాలన్నీ జనరల్‌గా సామాన్య ప్రజానీకం కోసమే కాబట్టి వివరాల్లోకి వెళదాం.

సామాజిక సంక్షేమ పథకాలు ప్రధానంగా సామాన్య ప్రజలకు మేలు చేసే పథకాలూ. ఈ పద్దులో ఖర్చు మీద ప్రభుత్వం శీతకన్ను వేయడం సర్వ సాధారణం. పోనీ, భారీ కేటాయింపులు చేసే పద్దుల విషయంలోనైనా కేటాయింపులు పూర్తిగా ఖర్చవుతున్నాయా అంటే అదీ లేదు. పట్టికలో చూడండి.

అలాగే ఎస్.సి., ఎస్.టి.ల కోసం 2008-09లో రు. 2273.73 లక్షలు కేటాయించగా ఖర్చయింది రు. 1866. 06 లక్షలు మాత్రమే. ఆ దశాబ్దంలో ఇరువర్గాలు కలిసి 173 లక్షల జనాభా కాగా, సగటున ఒక్కొక్కరికి ప్రభుత్వం చేసిన ఖర్చు పదిరూపాయలు. పేదోళ్లో నిరుపేదలైన వారినుద్ధరించడం కోసం చేసిన ఖర్చు ఇది. ఒక కప్పు మంచి కాఫీ కూడా రాదు. అది కూడా సంవత్సరానికి.

బడ్జెట్ గురించి దినపత్రికల్లో వివరాలు చదివే ఉంటారు. పాలక పార్టీలో జరుగుతున్న కోట్లాటల్లో బడ్జెట్ బలైపోయింది. ప్రతి సంవత్సరం ఓ బడ్జెట్ ప్రవేశపెట్టాలి కనుక ఆ తద్దినం పెట్టేశారు. అంతే.

*(రచయిత వ్యవస్థాపక సంపాదకులు)* వీ

***మార్క్సిజం ఎల్లవేళలా నూతన ఆవిష్కరణల కోసం ప్రయత్నించే విప్లవాత్మక ప్రాపంచిక దృక్పథం. అది ఎప్పుడో ఒకసారి సరైనవని తేలిన సిద్ధాంతాల సంకుచితత్వాన్ని సంపూర్ణంగా అసహ్యించుకుంటుంది. నిరంతర ఆత్మవిమర్శ మేధో సంఘర్షణలో, చరిత్ర కల్లోల సంరంభంలో మాత్రమే దాని జీవశక్తి సరిగా పరిరక్షించబడుతుంది.***

**రోజా లక్జెంబర్గ్ (1871-1919),** జర్మన్ మార్క్సిస్ట్ నాయకురాలు, సిద్ధాంతకర్త

రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన బడ్జెట్ రానున్న కాలంలో సామాన్యులకు పెనుభారం కానున్నదని అంటున్నారు
**చీకోటి శ్రీనివాస్, నేదునూరి కనకయ్య**

# 2012-13 రాష్ట్ర బడ్జెట్ - ప్రాధాన్యతా రంగాలు

రాష్ట్ర ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణ రెడ్డి 2012-13 వార్షిక బడ్జెట్‌ను శాసనసభలో రు.1,45,854 కోట్లతో, గత సంవత్సరం కన్నా 15 శాతం అధిక కేటాయింపులతో ఫిబ్రవరి 17న ప్రకటించారు. ఇందులో రు. 91,824 కోట్లు ప్రణాళికేతర వ్యయానికీ, రు. 50,030 కోట్లు ప్రణాళికా వ్యయానికీ కేటాయించారు. ఈ సంవత్సరానికి రు. 4,444 కోట్లు రెవెన్యూ మిగులు, రు. 20,008 కోట్ల ద్రవ్యలోటు ఉంటుందని అంచనా వేశారు. ఇది రాష్ట్ర స్థూల ఉత్పత్తి (జి.ఎస్.డి.)లో 2.58 శాతంగా పేర్కొన్నారు.

1,45,000 కోట్ల రూపాయల భారీ బడ్జెట్‌లో సామాజిక, ఆర్థికాభివృద్ధికి కీలక రంగాలైన వ్యవసాయం, వైద్యం, విద్య, విద్యుత్ రంగాలకు ప్రాధాన్యతల మేరకు కేటాయించకపోగా అమ్మకం పన్ను, స్టాంపు డ్యూటీల పెంచారు. బడుగు, బలహీనవర్గ ప్రజలపై పన్ను భారం పెరిగి కొనుగోలు శక్తి, జీవన ప్రమాణం తగ్గుతాయి. తలసరి ఆదాయాలు తగ్గి మానవ వనరుల అభివృద్ధికి ఆటంకం ఏర్పడే ప్రమాదం ఉంది.

**2012-13 బడ్జెట్ స్వరూపం (కోట్లలో)**

| | |
|---|---|
| ప్రణాళికా వ్యయం | 54,030 |
| ప్రణాళికేతర వ్యయం | 91,824 |
| **మొత్తం వ్యయం** | **1,45,854** |
| రెవెన్యూ వసూళ్లు | 1,16,787 |
| మూలధన వసూళ్లు | 29,478 |
| **మొత్తం ఆదాయం** | **1,46,265** |
| నికర మిగులు | 411 |
| రెవెన్యూ మిగులు | 4,444 |
| ద్రవ్యలోటు | 20,008 |

## వ్యవసాయ రంగం

వ్యవసాయం, సహకార రంగాలకు 2011-12 బడ్జెట్‌లో రు.2,418 కోట్లు కేటాయించగా ఈ మొత్తాన్ని రు. 2,819 కోట్లకు పెంచింది. రాష్ట్రంలో నెలకొన్న కరువు, ప్రకృతి విపత్తులు, పంట విరామం, పంట రుణాలపై వడ్డీ భారంతో కుదేలవుతున్న రైతాంగానికి కనీసం పదివేల కోట్ల రూపాయలతో 'ప్రత్యేక బడ్జెట్'ను ఆశిస్తే నిరాశే మిగిలింది. గత అక్టోబర్ నుండి వడ్డీ లేని రుణాల పథకం వర్తిస్తుందని ప్రభుత్వం ప్రస్తుత సంవత్సరానికి రు.10,500 కోట్లు, వచ్చే ఖరీఫ్, రబీ కాలానికి రు. 40,330 కోట్ల పంట రుణాలను లక్ష్యంగా పెట్టుకున్నట్లు ప్రకటించినా, దానిపై వడ్డీ భారం భరించాలంటే కనీసం 1600 కోట్ల రూపాయలు అవసరం. కాని ప్రభుత్వం ప్రకటించిన 375 కోట్ల రూపాయలు ఏ మూలకూ సరిపడవు. గత సీజన్‌లో 876 మండలాల్లో ఏర్పడ్డ కరువు వల్ల రైతులు స్వచ్ఛందంగా పంట విరామాన్ని ప్రకటించారు. పంటకు గిట్టుబాటు ధరలేక అప్పుల ఊబిలో చిక్కుకున్న రైతులకు ప్రభుత్వం ఇన్‌పుట్ సబ్సిడీకి నిధుల కేటాయింపులో మొండిచేయి చూపడం నిరాశకు గురిచేసింది. కనీస మద్దతు ధరలకు మార్కెట్ స్థిరీకరణ నిధి (ఎం.ఎ.ఎస్.) ప్రస్తావన లేదు. పాడి పరిశ్రమకు ఆశించిన మేరకు నిధులు కేటాయింపు లేదు. గిడ్డంగుల నిర్మాణం ప్రస్తావనే లేదు.

## విద్యారంగం

సామాజిక, ఆర్థికాభివృద్ధిలో కీలకపాత్ర పోషించే విద్యారంగం రాష్ట్ర ప్రభుత్వ నిర్లక్ష్య ధోరణితో విలవిలలాడుతున్నది. తాజా బడ్జెట్‌లో మొత్తం విద్యారంగానికి రు. 18,438 కోట్లు ప్రతిపాదించగా, పాఠశాల విద్యకు రు. 15,510 కోట్లు, సాంకేతిక విద్యకు రు. 1,087 కోట్లు, ఉన్నత విద్యకు రు. 1,841 కోట్లు కేటాయించింది. కాని ఇందులో అధిక భాగం ఉద్యోగుల జీత భత్యాలకే చెల్లించాల్సి ఉంటుంది. విద్యా హక్కు చట్టం కింద 39 వేల ఉపాధ్యాయుల భర్తీకి ప్రతిపాదనలు ఉన్నా బడ్జెట్‌లో కేటాయింపులు చేయకపోవడం విచారకరం. రాష్ట్రంలో కొత్తగా నెలకొల్పబడిన విశ్వవిద్యాలయాలు ఇప్పటికే మౌలిక సదుపాయాల కొరత, శాశ్వత బోధనా సిబ్బంది కొరత వంటి సమస్యలతో సతమతమవుతుండగా ఈ బడ్జెట్‌లో అరకొర నిధుల కేటాయింపుల వల్ల మానవ వనరుల అభివృద్ధికి విఘాతం కలిగే అవకాశం ఉంది. ప్రపంచీకరణ వల్ల ఏర్పడే సవాళ్లను ఎదుర్కోవ డానికి సరిపోయే విధంగా శాస్త్ర, సాంకేతిక, విజ్ఞాన, సమాచార రంగాల అవసరాల మేరకు కేటాయింపులు లేవు.

**ఫీజు రీయింబర్స్‌మెంట్**

| సంవత్సరం | కేటాయింపులు (కోట్లలో) |
|---|---|
| 2009-10 | 2,251 |
| 2010-11 | 2,270 |
| 2011-12 | 2,999 |
| 2012-13 | 3,621 |

ఉపకార వేతనాలు, బోధనా ఫీజులకు ప్రభుత్వంపై ఆధారపడ్డ దాదాపు 26 లక్షల బడుగు, బలహీనవర్గాల విద్యార్థులకు రాష్ట్ర బడ్జెట్ నిరాశను మిగిల్చింది. ఈ పథకం కింద గత బడ్జెట్‌లో కేటాయించిన రు.2,999 కోట్లలో 2010-11 విద్యా సంవత్సర బకాయిలకు రు.2,600 కోట్లు చెల్లించగా రు. 300 కోట్లు మాత్రమే మిగిలినవి. ప్రస్తుత, 2012-13 విద్యా సంవత్సరాల అవసరాల నిమిత్తం రు.3,900 కోట్లు అవసరం కాగా రు. 3,600 కోట్లు మాత్రమే కేటాయించడం వాస్తవ అవసరానికి తగినట్లుగా లేదు. అంచనాలకు, వాస్తవ కేటాయింపులకు, వినియోగానికి మధ్య అసమానతలు చోటు చేసుకొన్నాయి.

## వైద్య ఆరోగ్య రంగం

పెరుగుతున్న వైద్య అవసరాల దృష్ట్యా ఆరోగ్య రంగానికి రాష్ట్ర ఆదాయంలో కనీసం 6 శాతం నిధులు ఖర్చు చేయాల్సిన ఆవశ్యకత ఉంది. కాని ప్రస్తుత బడ్జెట్‌లో వైద్యరంగానికి రు. 5,899 కోట్లు కేటాయించి, అందులో ఆరోగ్యశ్రీ పథకానికి రు.1500 కోట్లు పోను మిగిలిన నిధులతో స్త్రీ, శిశు సంక్షేమం, 23 జనరల్ ఆసుపత్రులు, 1700 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను నడిపి ఎనిమిది కోట్ల ప్రజల ఆరోగ్య పరిరక్షణ చేపట్టడం అంత సులువుకాదు.

## విద్యుత్ రంగం

గత ఏడాది విద్యుత్ రంగానికి రు. 4,300 కోట్లు కేటాయించగా ఈ బడ్జెట్‌లో రు. 5,500 కోట్లు కేటాయించి అదనంగా రు. 1200 కోట్లు ఇచ్చినప్పటికీ, ఇప్పటికే పీకల్లోతు అప్పుల ఊబిలో కూరుకు పోయిన విద్యుత్ సంస్థల పరిరక్షణకు ఇవి ప్రయోజన కరంగా లేవు. దీనివల్ల ప్రస్తుత రుణభారం తగ్గకపోవడమే కాకుండా వాటిపై వడ్డీ భారం పెరిగి భవిష్యత్ అవసరాలకు అనుగుణంగా రానున్న కాలంలో విద్యుత్ కొనుగోలు ప్రశ్నార్థకమవుతుంది. ఇప్పటికే రు.12,000 కోట్ల లోటును ఎదుర్కొంటున్న విద్యుత్ రంగానికి ప్రభుత్వం, బ్యాంకులు కొత్త రుణాల మంజూరీలో విముఖత చూపడం, ఫలితంగా సింగరేణి సంస్థకు బొగ్గు సరఫరాకు చెల్లింపులలో జాప్యం ఏర్పడి విద్యుత్ ఉత్పత్తి, పంపిణీల మధ్య అసమానతలు పెరిగి, రాష్ట్రంలో అదనపు విద్యుత్ కోతలు తప్పవనే సంకేతాలు వెలువడుతున్నాయి. ఇది ఉత్పాదకత పెరుగుదలకు తగిన వాతావరణం ఉండని స్థితికి దారితీసే ప్రమాదం ఉంది.

**పెరుగుతున్న అప్పుల భారం**

| సంవత్సరం | అప్పుల భారం (కోట్లలో) |
|---|---|
| 2008-09 | 93,568 |
| 2009-10 | 1,09,342 |
| 2010-11 | 1,21,743 |
| 2011-12 | 1,39,667 |
| 2012-13 | 1,60,191 |

ఆర్థిక వనరులను ఉత్పత్తి, ఉత్పాదక రంగాలపై కాకుండా అనుత్పాదకత అంశాలపై అధికంగా ఖర్చు చేయడం వల్ల మన రాష్ట్రంలో తలసరి అప్పు భారం క్రమంగా పెరుగుతున్నట్లు గత ఐదు సంవత్సరాల గణాంకాలు తెలియజేస్తున్నవి. ప్రస్తుత మన రాష్ట్ర బడ్జెట్ రు.1,46,265 కోట్లు కాగా అప్పులు మాత్రం అక్షరాల రు.1,60,191 కోట్లు. అంటే మన వార్షిక బడ్జెట్ కంటే సుమారు 14 వేల కోట్ల రూపాయలు ఎక్కువ. అప్పులు ఉండడం వలన రాష్ట్ర ప్రజలపై తలసరి ఇరవై వేల రూపాయల అప్పు భారం పడింది.

**కేటాయింపు – వినియోగం మధ్య పెరుగుతున్న వ్యత్యాసం**

| సంవత్సరం | కేటాయింపులు (కోట్లలో) | వినియోగం (కోట్లలో) | మిగులు (కోట్లలో) |
|---|---|---|---|
| 2006-07 | 13,014 | 12,039 | 975 |
| 2007-08 | 16,511 | 10,002 | 6,509 |
| 2008-09 | 17,811 | 12.154 | 5,657 |
| 2009-10 | 11,000 | 9,627 | 1,373 |
| 2010-11 | 15,010 | 8,459 | 6,551 |

ప్రభుత్వం, పాలకుల మధ్య సమన్వయ లోపం, చిత్తశుద్ధి లోపించడం, నిధుల ఉపయోగానికి సరియైన కార్యాచరణ లేకపోవడం వంటి కారణాల వల్ల బడ్జెట్ కేటాయింపులు, వినియోగం / ఖర్చుల మధ్య వ్యత్యాసం క్రమంగా పెరుగుతున్నట్లు గడచిన ఐదు వార్షిక బడ్జెట్‌ల వివరాలు తెలియజేస్తున్నవి.

**పెరుగుతున్న పన్నుల భారం**

| పన్ను వివరాలు | 2011-12 (కోట్లలో) | 2012-13 (కోట్లలో) |
|---|---|---|
| రిజిస్ట్రేషన్ | 4,140 | 4,968 |
| మద్యం | 9.014 | 10,820 |
| అమ్మకం | 35,999 | 45,000 |
| విద్యుత్ | 277 | 304 |
| వాహన పన్ను | 2,800 | 3,640 |

స్టాంపు, రిజిస్ట్రేషన్‌పై 20 శాతం, మద్యంపై 20 శాతం, వాహనాలపై జీవితకాలపు పన్ను పెంపు వంటి మార్గాల ద్వారా 2012-13 ఆర్థిక సంవత్సరంలో పన్నుల ద్వారా రు. 13,000 కోట్ల రాబడిని సమకూర్చుకోవాలనే రాష్ట్ర ప్రభుత్వ ఆలోచన భవిష్యత్‌లో కూడా పన్ను భారాన్ని పెంచుతుందనే సంకేతాలను పంపించింది.

*(రచయితలు – అర్థశాస్త్ర అధ్యాపకుడు, తెలంగాణ విశ్వవిద్యాలయం, నిజామాబాద్; అధ్యక్షులు – జిల్లా ఎకనమిక్స్ ఫోరం , కరీంనగర్)* వీ

**రాబోయే సంచికలలో...**

- ❖ రష్యాలో అక్టోబర్ విప్లవం - ఎన్.వి.ఎస్. నాగభూషణాచార్యులు
- ❖ విధ్వంసకర పోలవరం అప్రజాస్వామికం - కూనూరు శివకుమార్
- ❖ మీడియా - ప్రస్తుత పరిణామాలు - సుకిరణ్ దావులూరి
- ❖ వరంగల్ డిక్లరేషన్ - కొన్ని పాడిగింపులు, కొన్ని చేర్పులు - ఎల్. అరణ్య

*ప్రభుత్వం ఒక వైపు పేద ప్రజల అభివృద్ధే మా ధ్యేయమని ప్రకటిస్తూనే, ఆ అభివృద్ధికి సరిపడ ఆదాయాన్ని మద్యం నుంచి సమకూర్చుకుంటాననడం ఎటువంటి అభివృద్ధి అని ప్రశ్నిస్తున్నారు* **డా. శ్రీధర్ కుమార్ లోథ్**

# అభివృద్ధి మార్గం మద్యాంధ్ర ప్రదేశేనా?

ప్రపంచ వ్యాప్తంగా రియల్ ఎస్టేట్, సాఫ్ట్‌వేర్, బ్యాంకింగ్ ఇలా అనేక రంగాలు ఆర్థిక సంక్షోభంతో దెబ్బతిన్నాయి. రాష్ట్రబడ్జెట్ తల్లకిందులైంది. భూముల అమ్మకాల ఆదాయం తగ్గిపోయింది. ఇంత దుర్భర స్థితిలో కూడా ఒకే రంగంలో రాష్ట్ర ప్రభుత్వానికి ఆదాయం ఇబ్బడి ముబ్బడిగా వచ్చింది. లక్ష్యాలను అధిగమించి పదండి ముందుకు అంటూ దూసుకుపోతోంది. అదే మద్యం అమ్మకాలు. చెప్పిన మాటల్ని, చేసిన వాగ్దానాల్ని తుంగలో తొక్కి మద్యం అమ్మకాల్ని ఎడాపెడా ప్రోత్సహించి, బెల్టుషాపుల్ని వాడవాడలా తెరిపించి సర్కారు సాగించిన మందు యజ్ఞ ఫలమిది. రాష్ట్రంలో మద్యం ఏరులైపారుతోంది. వీధికో బెల్టుషాపు అనేది నిన్నటి మాట. వీథంతా బెల్టు షాపులమయం అనేది నేటిమాట. సంక్షేమ పథకాల పేరిట నాయకులకు, కార్యకర్తలకు సంతర్పణ పథకాలను ప్రారంభించిన ప్రభుత్వం మద్యం అమ్మకాల ద్వారా విచ్చలవిడిగా నిధులను రాబడుతోంది. రాష్ట్ర ఖజానాకు రెండో అతిపెద్ద రాబడి. ప్రజలను మద్యం మత్తులో ముంచెత్తుతూ, రాబోయే ఎన్నికల్లో నిధులకు లోటు లేకుండా చూసుకొంటోంది. మద్యాన్ని నిషేధించలేం కాని సమర్థంగా నియంత్రిస్తామని ముఖ్యమంత్రి లౌక్యంగా మాట్లాడుతున్నారు. బాగా తాగించడాన్ని నియంత్రణగా భావిస్తే ఆ విషయంలో ప్రభుత్వం విజయం సాధించినట్లే! మద్యపానం కారణంగా ప్రజలు పలు ఆరోగ్య సమస్యలను ఎదుర్కొంటున్నారు. మహిళలు సాయంత్రం పూట బయట తిరగలేని పరిస్థితులు దాపురిస్తున్నాయి. ఎన్నికల్లో గెలుస్తామంటే రెండు రూపాయలకు లీటరు మద్యం పథకాన్ని ప్రవేశపెట్టడానికి సైతం వెనుకడ కూడదన్న ధోరణి ప్రభుత్వంలో వ్యక్తమవుతోంది. సర్కారుకు నిజంగా చిత్తశుద్ధి ఉంటే వెంటనే బెల్టు దుకాణాలను తొలగించి మహిళల ఇబ్బందులను, విషాదంలో ఉన్న ఎన్నో కుటుంబాలను ఆదుకోవలసిన అవసరం ఉంది.

అక్రమ మద్యం వ్యాపారం ఒకసారి పరిశీలిస్తే లిక్కర్ మాఫియా ఏ స్థాయిలో ఊడలు దిగి విస్తరించిందో బోధపడుతుంది. బలహీన మనస్కుల్ని వ్యసనపరులుగా, ఆపై జీవచ్ఛావాలుగా ప్రభుత్వ అబ్కారీ విధానాలే మార్చేస్తుంటే, మందుభాగ్యుల రక్తమాంసలు పిండి ఏటా వేలకోట్ల దండుకొనే సిండికేట్ల విశృంఖలత్వాన్ని ఎ.సి.బి నివేదికలే వెల్లడిస్తున్నాయి. 13 డిసెంబర్, 2011న కరీంనగర్‌లో ఎక్సైజ్ అధికారులు ప్రయాణిస్తున్న వాహనం తనిఖీద్వారా ఎ.సి.బి లాగినతీగ రాష్ట్రవ్యాప్తంగా మద్యం మాఫియా డొంకల్ని కదిలించింది. సాక్షాత్తూ ఎక్సైజ్‌శాఖ మంత్రి మోపిదేవి వెంకటరమణకు పదిలక్షల రూపాయల ముడుపులు ఇచ్చినట్లు సిండికేటు నాయకుడు బహిర్గతం చేశాడు.

వేలం ద్వారా లిక్కరు షాపులు దక్కించుకున్న వాళ్లు కూటమి కట్టి సిండికేట్లుగా ఎందుకు మారుతున్నట్లు? పోలీసులు మొదలు పాత్రికేయులు, ఎక్సైజ్ అధికారులు, చోటా మోటా నాయకులు దాకా మామూళ్ల పంపిణీ సంక్రమంగా సాగించేందుకు కార్యలయాలే ఎందుకు స్థాపించినట్లు? సగటు పౌరుల్ని తొలిచే ఈ ప్రశ్నలకు సమాధానం ఒక్కో షాపును కాసుల కల్పవృక్షంగా మార్చేసిన కాంగ్రెస్ దుర్మార్గపు అబ్కారీ విధానంలో ఉంది. ప్రతినెలా ప్రతి జిల్లా నుంచి అంతక్రితం సంవత్సరం వచ్చిన రాబడి కంటే 20 శాతం అదనంగా ఖజానాకు ఒనగూరుతుందా లేదా అన్నదే ప్రభుత్వానికి ముఖ్యం. అమెరికా అధ్యక్షుడు లింకన్ ప్రజాస్వామ్యం గురించి చెప్పిన మాటలను ఒక్కసారి దీనికి అనువదిస్తే మాఫియా వలన, మాఫియా చేత, మాఫియా కొరకు అన్న చందంగా రాష్ట్ర అబ్కారీరంగం భ్రష్టుపట్టి పోయింది. అందుకే మద్యం మాఫియా కోరలు పీకాలి.

రాష్ట్రంలో మారుమూల గ్రామాల్లో విచ్చలవిడిగా మద్యం విక్రయిస్తున్న బెల్ట్ దుకాణాలు మూడుపువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లుతూ ఏన్నో కుటుంబాల పతనానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా కారణం అవుతున్నాయి. రెండు సంవత్సరాల కాలపరిమితికి మద్యం దుకాణాల వేలం విక్రయాన్ని ఆధికారుల అండదండలతో టెండరుదార్లు అధిక రేట్లకు పాడుకొని, నష్టం రాకూడదని ప్రతి దుకాణానికి 20–30 గ్రామాల వరకు బెల్ట్ దుకాణాలను ఏర్పరచుకొని మంచి ధనార్జన చేస్తూ, ప్రజల ప్రాణాలతో చెటగాటం ఆడుకొంటున్నారు. గత లాభాలను దృష్టిలో పెట్టుకొని వ్యాపారులు మండల కేంద్రాల్లోఉన్న దుకాణాలకు సైతం పోటీపడి కోట్ల రూపాయాలు చెల్లించి కైవసం చేసుకున్నారు. ఈ నేపథ్యంలో 2008 జూలై ఒకటి నుంచి కొత్త లైసెన్స్‌లు కార్యరూపం దాల్చాయి. అనుకున్నట్లుగానే మద్యం విక్రయాలు ఊపందుకొన్నాయి. మద్యపానం వల్ల ఎన్నో కుటుంబాలు పతనం అవుతున్నాయి. పేద, బడుగు వర్గాలు కూలీనాలి చేసుకుని సంపాదించిన సొమ్మంతా మద్యం బెల్ట్‌షాపులకు సమర్పిస్తున్నారు. ఖాళీ జేబులతో ఇల్లకు చేరుకుంటున్నారని కుటుంబాలు గడవడం కష్టం అవుతోందని పేద మహిళలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.

బెల్ట్ షాపులను తొలగించాలని ప్రభుత్వం కృతనిశ్చయంతో ఉన్నా ఎక్సైజ్‌శాఖ ప్రోత్సాహంతోనే ఈ బెల్ట్ దుకాణాల వ్యాపార పరంపర కొనసాగుతున్నది. తెలుగుదేశం హయాంలో 40 నుంచి 60 వేల వరకు

ఉన్న ఈ బెల్ట్‌షాపులులు కాంగ్రెస్ అధికారంలోకి వచ్చిన ఎనిమిదేళ్లలో అంచెలంచెలుగా పెరిగి ప్రతీ గ్రామంలో ప్రతీ రాజకీయ పార్టీకి చెందిన చోటా నాయకుడికి ఒక బెల్ట్ దుకాణం ఉన్నట్లుగా జనమెరిగిన సత్యం. ఈ రకంగా మూడు నుంచి ఐదు దుకాణాలు తెలంగాణలో ఉండగా ఆంధ్ర ప్రాంతంలో చిన్న గ్రామంలోనే ఆరు దుకాణాల్లో మద్యం విక్రయాలు జరుపుతున్నారు. ఈ ప్రకారం ఇరవై ఏడు వేల గ్రామాల్లో మొత్తంగా లక్షా 50వేల బెల్ట్ దుకాణాలు మద్యం విక్రయంలో పాలుపంచు కుంటున్నాయి.

బెల్ట్‌షాపుల మూల ఆవిర్భావం గూర్చి చర్చిస్తే 1984లో అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు 'వారుణివాహిని' పథకంతో ప్రభుత్వ సారాయిని గ్రామ గ్రామానా, వాడవాడలా విక్రయించేందుకు అనుమతినిచ్చారు. అందుకోసం ఎక్సైజ్‌శాఖలో ప్రతీ తాలూకాలో మారక్ డిపో మేనేజర్ పోస్టును కల్పించి, సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌ను ఆ పదవిలో ఉంచేవారు. ప్రభుత్వ సారా డ్రమ్ములు సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఆధీనంలో ఉండేవి. వారి నుంచి సారా ప్యాకెట్ల కాంట్రాక్టర్ నిత్యం తమ ప్రాంతానికి కావల్సిన మొత్తం ఈ డిపో నుండి తీసుకెళ్లి విక్రయించేవారు. తాలూకాలోని కొన్ని గ్రామాలకు ఒక కాంట్రాక్టర్‌కు పది దుకాణాల వరకు ప్రభుత్వం సారా అమ్మకాలకు అనుమతినిచ్చేది. అప్పుడు ప్రభుత్వ సారాయి దుకాణాలను 'ప్రసాదుల'ని పిలిచేవారు. ఈ ప్రసాదులకు అనుబంధంగా 'బెల్ట్ మాదిరి' మరికొన్ని దుకాణాలను కాంట్రాక్టర్‌లు నిర్వహిస్తూ అధిక అమ్మకాలు జరిపేవారు. అవి అధీకృతంకాదు. ఒక కాంట్రాక్టర్ సుమారు పది గ్రామాలు, పల్లెలు శివారు గ్రామాలకు విక్రయాలు జరిపేవారు. దాని కోసం రెండు జీపులను సిద్ధంచేసుకుని దాదాపు 20 మంది యువకులను ఆ జీపులో ఉంచి సారా బట్టీలు, గుడుంబా వంటి అక్రమ తయారీలపై దాడిచేయించేవారు. ఒక కాంట్రాక్టర్‌కు పది దుకాణాలు, వాటికి స్థానికంగా (బెల్ట్) మరికొన్ని దుకాణాలు ఏర్పాటై అమ్మకాలు సమృద్ధిగా సాగించేవారు. బట్టీసారా ఆ ప్రాంతపు ప్రజలు తాగకుండా ఉండేందుకు, జీపుల్లో ప్రైవేట్ స్క్వాడ్‌లను కాంట్రాక్టర్లే పోషించేవారు.

1986లో కొన్ని మార్పులు చేస్తూ సారాతయారీ, పంపిణీ బాధ్యతలను ఆంధ్రప్రదేశ్ బేవరేజెస్ కార్పొరేషన్‌కు ప్రభుత్వం అప్పగించింది. ఈ కార్పోరేషన్ ద్వారా 3 జిల్లాల్లో సారా డిపోలను ఏర్పాటు చేసి అక్కడినుంచి తాలూకాల్లో ఉండే చిన్న డిపోలకు సారాయి తరలించేవారు. మొదట 180 ఎం.ఎల్, 360 ఎం.ఎల్. ఒక లీటర్ సీసాల్లో కార్పొరేషన్ సారాయి తయారు చేసేది. ఆ తర్వాత పాకెట్లలో 200ఎం.ఎల్ నుంచి 100ఎం.ఎల్ వరకూ సారా నింపి పంపి అమ్మకం జరిపేవారు. సాచెట్లు కాంట్రాక్టర్లకు కార్పొరేషన్ నుండి వచ్చేవి. అవి లేని పక్షంలో సీసాలుండేవి. అయితే ఎక్కువ పాట చెల్లించి ఆ ప్రాంతాన్ని కైవసం చేసుకొన్న బడా కాంటాక్టర్లు ఆ సీసాలనుంచి సారాబయటికి తీసి సాచెట్లలలో నింపేవారు. ఆలానింపే క్రమంలో వందశాతం నీరు సారాలో కలిపి, ఒక లీటరును రెండు లీటర్లుగా చేసి సాచెట్లతో అక్రమంగా చిల్లర దుకాణాల్లో విక్రయించేందుకు కాంట్రాక్టర్లు కక్కుర్తి పడుతుంటే ఎక్సైజ్‌శాఖ వారిని ప్రోత్సహించేది. మధ్యతరగతి, బలహీన వర్గాలు దారిద్ర్యరేఖకు దిగువ ఉన్నవారు వాడవాడలా సారా తాగి పతనావస్థకు చేరారు. రోజు గడవని కుటుంబాలు ప్రతీ మండలంలో, గ్రామాల్లో వేల సంఖ్యలో కొట్టుమిట్టాడు తుండేవి. ఈ క్రమంలో నెల్లూరు జిల్లా దూబకుంటలో రోశమ్మ సారా వ్యతిరేకోద్యమాన్ని ప్రారంభించింది. ఈ ఉద్యమం రాజకీయ పార్టీల సహాయంతో తొందర్లోనే రాష్ట్రవ్యాప్తంగా పాకి ఆ ప్రభావంతో అప్పుడు అధికారంలోఉన్న కాంగ్రెస్ ప్రభుత్వం 1993లో సారా నిషేధాన్ని రాష్ట్రవ్యాప్తంగా అమలుచేసింది.

కాంట్రాక్టర్లు ఆర్జించిన సొమ్ముతో ధనవంతులుగా, కుబేరులుగా మారి రాజకీయాలను శాసించే స్థాయికి వచ్చారు. కానీ సారా దుకాణంలో పనిచేస్తున్న వాళ్లు జీపుల్లో ఉన్న ప్రైవేట్ స్క్వాడ్, ఒక సారా దుకాణానికి అనుబంధంగా ఉన్న చిన్నచిన్న చిల్లర దుకాణాలు నిర్వహించే బెల్ట్‌లకు సంబంధించిన కుటుంబాలు ఆ ఆదాయం లేక రోజులు గడపలేక తల్లడిల్లి పోయారు. సారా నిషేధం నాడు 11 వేల దుకాణాలుండగా ప్రతీ దుకాణానికి అరు సబ్ దుకాణాలు నిర్వహిస్తున్న 66 వేల దుకాణాల కుటుంబాల నిర్వాహకులు, పిల్లలు అదే వ్యాపారంలో నిమగ్నమై ఉండగా 1993 నుంచి రోడ్డున పడ్డారు. ఆంధ్రప్రదేశ్ బేవరేజెస్ ద్వారా మద్యం విక్రయాలు సాగుతున్నపుడు ఇదే సారా కాంట్రాక్టర్లు దుకాణాలకు లైసెన్సులు పొంది సీసాలు నింపి మద్యం విక్రయాలను గ్రామగ్రామాన కొనసాగిస్తున్నారు. వాటినే ఇప్పడు బెల్ట్ దుకాణాలనే పేరుతో పిలుస్తున్నారు. వాస్తవాన్ని పరిశీలిస్తే ఈ దుకాణాల ద్వారా లక్ష 50 వేల కుటుంబాలు జీవనోపాధిని కొనాసాగిస్తున్నాయి. సారా నిషేధం వల్ల ఒక సంవత్సరంపాటు ఆదాయంలేక విలవిల్లాడిన ఈ బడుగు వ్యాపారులకు బెల్ట్‌షాపుల పేరుతో కొంత ఊతం లభించింది. వీటిని ఆధారంగా చేసుకొని ప్రస్తుత మద్య లైసెన్స్‌లు ఉన్నవారు వేలం పాటల్లో పాల్గొని కోట్ల రూపాయలను చెల్లించి దుకాణాలను కైవసం చేసుకుంటున్నారు. కొన్ని చోట్ల ఒక్కో మద్యం దుకాణం వెల నాలుగున్నర కోట్ల రూపాయలు. అంతకు ఎన్నోరెట్లు సంపాదించగల సౌలభ్యన్ని ప్రభుత్వమే కల్పించడంతో మాఫియా గుర్రపు డెక్కలా పడిపోయింది.

గతంలో ఒక పార్టీ పలు గ్రామాల్లో సర్వే నిర్వహించగా పల్లెల్లో మూడు నుంచి ఐదు వరకు బెల్టుషాపులు కన్పించాయని స్పష్టంగా పేర్కొంది. అంతేకాకుండా తెలంగాణ, రాయలసీమ ప్రాంతాల్లోని పది జిల్లాల్లో నిర్వహించిన సర్వేలో 45 మండలాలో 197 గ్రామాల్లో గుర్తించిన బెల్ట్ షాపుల వివరాలను ప్రకటించారు. మద్యం మనిషిని మృగంగా మార్చుతుంది. దుర్బలుడిగా దిగదార్చుతుంది. నైతికంగా పాతాళానికి తొక్కుతుంది. మద్యం వల్ల ప్రజలు ముఖ్యంగా మహిళల జీవితాలు అగమ్యగోచరమవుతున్నాయి. రోజు రోజుకి మహిళలపై గృహహింస పెరుగుతోంది. సామూహిక మానభంగాలు, అత్యాచారాలు అధికమయ్యాయి. స్త్రీలు ఒంటరిగా తిరిగే పరిస్థితి లేదు. నేరాల సంఖ్య పెరుగుతోంది. 70–80 సంవత్సరాలు బతకాల్సినవారు ఈ వ్యసనం వల్ల 30–35 సంవత్సరాలకే తనువు చాలిస్తున్నారు. నల్గొండ జిల్లా ఒక్క పానుగల్లులోనే 25 సంవత్సరాల వయసున్న మహిళలు 70 మంది వితంతువులుగా మారినట్లు సర్వేలు తెలుపుతున్నాయి. అలాగే వరంగల్ జిల్లా మహబూబాబాద్, మరిపెడ గిరిజన తండాల్లో వితంతు మహిళలు ఉన్నారు. బెల్టుషాపులో అమ్ముడుపోయేది 90 శాతానికి పైగా చీప్‌లిక్కరే. దాన్ని తాగడం వల్ల శరీరంలో ప్రధానాంగాలు లివర్, కిడ్నీ వంటి అవయవాలు 3 – 5 ఏళ్ల వ్యవధిలో దెబ్బతింటాయి. ఇవి ఇలా ఉండగా ప్రభుత్వం మాత్రం మద్యం అమ్మకాలను పెంచుతూ రాష్ట్ర బడ్జెట్‌లో సగం అంటే దాదాపు 50 వేల కోట్ల రూపాయలు ఎక్సైజ్ శాఖ ద్వారా రావాలని అదేశిస్తోంది. దీంతో అధికారులు సేల్స్‌మెన్‌లా విక్రయాలు చేయించాల్సిన

పరిస్థితి దాపురించింది. మద్యం అమ్మకాల్లో మన రాష్ట్రానిదే మొదటిస్థానం.

ఈ క్రమంలోనే గ్రామ గ్రామానా గడుంబా వాసన గుప్పుమంటూ బెల్టుషాపుల వ్యాపారం నిత్యావసరాల దుకాణాల్లాగా మారిపోతోంది. రాష్ట్రంలో ఇరవై ఏడు వేల గ్రామాలుంటే ఒక లక్షాడేబ్బైవేల బెల్టు షాపులున్నాయి. ప్రతి గ్రామానికి 5-10 బెల్టు షాపులున్నాయని ప్రభుత్వం లెక్క తేల్చింది. రాష్ట్ర ప్రధాన రహదారులవెంట 24 గంటలూ మద్యం అమ్మకాలు నిరంతరంగా జరుగుతున్నా, రాష్ట్ర రాజధాని చుట్టూ గతంలో కంటే 54 శాతం మద్యం అమ్మకాలు పెరిగి ప్రజల జీవితం ఛిద్రమవుతున్నా పట్టించుకొనే నాథుడే లేడు. ఒక వైపు జనం మంచినీరు, విద్య, వైద్యం, వ్యవసాయానికి ఎరువులు వంటివి కావాలని, యువత ఉద్యోగాలు కావాలని అడుగుతుంటే ప్రభుత్వం మద్యాన్ని ఏరులై పారిస్తోంది. రాష్ట్రం హరితాంధ్రప్రదేశ్‌గా మారుతుందో లేదో కాని మద్యాంధ్రప్రదేశ్‌గా మారుతుందనడం అతిశయోక్తి కాదు.

గ్రామాలను పట్టిపీడిస్తున్న మద్యం మహమ్మారి బెల్టు షాపులతో మరింత విజృంభిస్తోంది. కూతవేటు దూరంలో ఉండే కిరణా దుకాణం లోను మద్యం దొరుకుతుండడంతో వాడకం విపరీతమైంది. అదే కుటుంబాలను కకా వికలం చేసి ప్రాణాంతకంగా మారిపోతోంది.

10 ఫిబ్రవరి 2012న రాష్ట్ర ప్రభుత్వం మరొక జి.ఒ. 20ని జారీ చేసింది. దీని ఫలితంగా రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న స్టేడియాలు, క్రీడా ప్రాంగణాలను క్రీడేతర, వాణిజ్య కార్యక్రమాలకు అద్దెకివ్వాలని నిర్ణయించిన ప్రభుత్వం మరో అడుగు ముందుకేసి, స్టేడియాల్లో మద్యం అమ్మకాలకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. వీటి కారణంగా 18-30 ఏళ్లలోపు యువత మద్యానికి బానిసలయ్యే ప్రమాదం ఉంది.

| సంవత్సరం | ఆదాయం (రూ. కోట్లు) |
|---|---|
| 2003-04 | 1914.98 |
| 2004-05 | 2192.67 |
| 2005-06 | 2684.57 |
| 2006-07 | 3436.63 |
| 2007-08 | 4950.00 |
| 2008-09 | 6500.00 |
| 2010-11 | 7650.00 |
| 2011-12 | 9014.00 |

మద్యానికి బానిసలుగా మారుతున్న వారిలో పేదప్రజలే అధిక భాగం అని సర్వేలు నొక్కి చెబుతున్నాయి. వీరిలో ఎక్కువ మంది సంపాదిస్తున్న మొత్తంలో 70 శాతం వరకు తాగుడుకే ఖర్చు చేయడం వల్ల వారి కుటుంబాలు ఆర్థికంగా చితికిపోతున్నాయి. సరైన ఆహారం తీసుకోకపోవడం వల్ల అనారోగ్యానికి గురై మరణిస్తున్నారు. ప్రభుత్వం మద్యంపై వచ్చే ఆదాయం అభివృద్ధి చేస్తామనడం శవాలపై పైసలు ఏరుకోవడమే అవుతుంది. మద్యం మహమ్మారి ఏ ఒక్కరి సమస్యోకాదు. మద్యానికి సామాన్యులు బలికాక ముందే దానికి ఆజ్యం పోసే ప్రభుత్వాలకు, మద్యం కంపెనీలకు వ్యతిరేకంగా ఉద్యమించాలి. మహిళలు, స్వచ్ఛంద సంస్థలు, ప్రజా సంఘాలు ఐక్యంగా ఉద్యమించాలి.

*(రచయిత అధ్యాపకులు, కాకతీయ యూనివర్సిటీ పి.జి.కాలేజి)* వీ



F.No.56-2/RO/Mag/10-11/IP/276/2350

**ప్రజలకు వంద రూపాయల మేలు చేయాలంటే వంద కమిటీలు వేసే ప్రభుత్వాలు, తాము చేసే లక్షల కోట్ల రూపాయల కుంభకోణాల విషయంలో ఎలా వ్యవహరిస్తాయో వివరిస్తున్నారు కె.వి. కూర్మనాథ్**

# 2జి కుంభకోణం - మీడియా ద్రోహం

ఫిబ్రవరి మొదటి వారంలో సుప్రీంకోర్టు 122 టెలికాం లైసెన్సులను రద్దు చేసింది. ఇవి దేశంలోని వివిధ రాష్ట్రాల్లో సెల్‌ఫోన్ సర్వీసులను ప్రారంభించడానికి కేంద్రం ఇచ్చిన అనుమతులు. ఈ తాజా కుంభకోణం వల్ల దేశానికి కలిగిన నష్టం రెండు లక్షల కోట్ల రూపాయలు. నష్టం కలిగించిందెవరూ అంటే – స్వయానా టెలికాం మంత్రి. ఆయనొక్కడేనా? అని నమ్మమంటోంది ప్రభుత్వం. మన దేశంలో ప్రభుత్వాలు, మంత్రివర్గాలు ఎలా పనిచేస్తున్నాయో చూస్తున్న మనకు ఎవరు ముఖ్యమైన నిర్ణయాలు తీసుకుంటారో, తీసుకోగలరో చెప్పాల్సిన అవసరం లేదు.

రాష్ట్రాల్లో అయితే ముఖ్యమంత్రులూ, దేశానికైతే ప్రధానమంత్రి (ఇంకా సూపర్ ప్రధానమంత్రి అయిన సోనియాగాంధీ, 'యువరాజు' రాహుల్‌గాంధీ, చిదంబరం) – వీళ్లు అనుకున్నది కాకుండా మరొకటి జరుగుతుందని ఎలా నమ్ముతాం?

విద్యార్థులకు ఇవ్వాల్సిన స్కాలర్‌షిప్పుల లాంటి చిన్న విషయాలపై గ్రూప్ ఆఫ్ మినిస్టర్స్‌ని ఏర్పాటు చేసి, నాన్చే ప్రభుత్వాలు, రెండు లక్షల కోట్ల రూపాయల విలువ చేసే అనుమతుల్ని ఏ ఒక్క మంత్రి నిర్ణయానికో వదుల్తుందని ఎలా అనుకుంటాం? ఇప్పటికే ఈ కుంభకోణం గురించి ఎన్నో వ్యాసాలు వచ్చి ఉన్నాయి కనుక రెండు మూడు అంశాలను చూద్దాం.

మొదటిది, ఈ మొత్తం వ్యవహారాన్ని ప్రభుత్వం, మీడియా, మధ్యతరగతి ఇంకా ఈ వ్యవస్థకి అనధికార ప్రతినిధులుగా వ్యవహరించే మేధావులు ఎలా చూస్తున్నారనేది. 'ఎవరో ఒకరిద్దరు తప్పు చేసి ఉండొచ్చు. కానీ ఇలా ఇన్ని లైసెన్సులను రద్దుచేస్తే ఎట్లా? కంపెనీ ప్రతినిధుల్ని అరెస్టు చేస్తే ఎలా? విదేశీ పెట్టుబడులు ఆగిపోతాయి ఇట్లాంటి నిర్ణయాలు వల్ల..' అని ప్రభుత్వం అంటోంది. జాతీయ పత్రికల్లో అధికభాగం, జాతీయ ఛానెళ్లు ఈ అభిప్రాయాన్ని ప్రచారం చేస్తూ ఉంటాయి. మంత్రినీ, కంపెనీ ప్రతినిధుల్నీ జైల్లో పెట్టిన రోజున చాలా పత్రికాఫీసుల్లో ఒకరకరమైన విషాద వాతావరణం ఉందంటే ఆశ్చర్యం లేదు.

'విధాన నిర్ణయాల్లో భాగంగా నిర్ణయం తీసుకుని ఉండొచ్చు. దానికి మంత్రుల్ని బాధ్యుల్ని చేస్తే ఎలా? వ్యాపార లావాదేవీల్లో భాగంగా ఆ శాఖ మంత్రితో, అధికారులతో కంపెనీల ప్రతినిధులు మాట్లాడడం సహజం. అందుకు అరెస్టు చేస్తే ఎలా? అనుమతుల్ని రద్దు చేస్తే ఎలా? భారతదేశంలో పెట్టుబడులు పెట్టడానికి వచ్చే వారు మన గురించి ఏమనుకుంటారో' అన్న వాదనలు చేస్తున్నారు.

ఇక్కడ మనకు ప్రత్యక్షంగా కనిపిస్తున్నదేమిటంటే, ప్రజాస్వామ్యం పేరుతో, స్వేచ్ఛా వాణిజ్యం పేరుతో, అభివృద్ధి పేరుతో ప్రభుత్వం, పెట్టుబడి, వీటి సమర్థకులుగా ఉండే మధ్యతరగతి మేధావులూ ఎలా చేతులు కలుపుతారో. రెండు లక్షల కోట్ల రూపాయల ప్రజాధనాన్ని బహిరంగంగా దోచుకుంటే రాజద్రోహమనీ, జాతికి శత్రువులనీ, ఏరి వేయాలనీ అనరెందుకో. అనకపోవడమే కాకుండా, సకల మర్యాదలతో సౌకర్యాలతో జైళ్లలో వసతులు కల్పిస్తారు.

ఈ రెండు లక్షల కోట్లలో ఒక లక్ష కోట్లు ప్రభుత్వరంగ బ్యాంకులవి. అంటే ఈ 122 లైసెన్సులు రద్దయ్యాయి కాబట్టి ఈ లైసెన్సుల కోసం ఆయా కంపెనీలకు బ్యాంకులు ఇచ్చిన ఈ రుణాలన్నీ మొండి బకాయిలు కానున్నాయి. అసలే ఆర్థిక మాంద్యం వల్ల నీరసపడి ఉన్న బ్యాంకులు ఇంత నష్టాన్ని భరించే పరిస్థితిలో ఉన్నాయా?

ఈ అంశం మీద సరిగా సమాచారం లేనివారి కోసం కొంచెం వివరణ. 2జి అంటే సెకెండ్ జనరేషన్ లేదా రెండోతరం టెలికాం సేవలు. ల్యాండ్‌లైన్ ఫోన్లు (అంటే వైర్లతో నడిచే) మొదటి తరానికి చెందినవి. కేవలం మాట్లాడుకునే అవకాశం ఉండేది. రెండోతరంలో మాట్లాడుకోవడంతో పాటు డేటా (ఎస్.ఎం.ఎస్.లు, ఇంటర్నెట్) కూడా బట్వాడా చేసుకోవచ్చు. మూడోతరం, నాలుగోతరం టెలికాం సర్వీసులు కూడా రాబోతున్నాయి. కానీ ప్రస్తుతం మన చర్చ 2జి గురించి కాబట్టి దీనికే పరిమితమవుదాం. ఈ సర్వీసులు అందుబాటులోకి రావడానికి గాలిలో మనకి కనిపించకుండా ఉండే విద్యుదయస్కాంత తరంగాలు కారణం. ఇవి దేశ భూభాగం మీద విస్తరించి ఉంటాయి కాబట్టి, అన్ని సహజ వనరుల్లాగానే ప్రజల ఆస్తిగానే పరిగణిస్తారు ప్రపంచవ్యాప్తంగా. అందుకే టెలికాం కంపెనీలు వీటిని వాడుకొని వ్యాపారాలు చేస్తాయి కాబట్టి దేశాలన్నీ వాటిని అమ్ముతాయి. లేదా వేలం వేసి అమ్ముతాయి. అన్ని వనరుల మీద ఆధిపత్యాన్ని నిలుపుకోవాలనుకొనే పెట్టుబడిదార్లు ఈ వనరుని కూడా గుప్పిట్లో పెట్టుకోవాలని చూశారు. భూముల్ని మింగేసి, ఆదివాసుల భూముల కింద వనరుల్ని ఆక్రమించుకున్న పెట్టుబడి, సామ్రాజ్యవాదం ఈ కనిపించని వనరుల మీద కూడా దృష్టి పెట్టిందని చూపించడానికి ఇది మరో ఉదాహరణ.

ఈ 122 లైసెన్సుల సంగతే చూడండి. ఇందులో 90 శాతం లైసెన్సులు స్థానిక పెట్టుబడిదారులు వేలంలో కొనుక్కున్నవి. వ్యాపారం చెయ్యడానికి కాదు. కొని పెట్టుకుంటే (భూమి విషయంలో వలె) ఎవరైనా

ఎప్పుడైనా వచ్చి లైసెన్సు కోసం ఎక్కువ మొత్తంలో డబ్బు చెల్లించి వాటాలు కొనుక్కుంటారని. అందుకే టెలికాం వ్యాపారంతో సంబంధం లేని, ఆ వ్యాపారంలో ఎలాంటి అనుభవం లేని ఎంతోమంది వేలంలో పాల్గొని 2జి స్పెక్ట్రమ్ కొనుక్కున్నారు. వాళ్ల దగ్గర ఉన్న డబ్బుతో కాదు. ఈ స్పెక్ట్రమ్‌నే పూచీగా, హామీగా చూపించి ప్రభుత్వ బ్యాంకుల నుండి అప్పు తీసుకొని కొన్నారు. లైసెన్సులు, ఒప్పందాలు రద్దయితే ఎవరికి నష్టం?

దూరదృష్టితోనే లైసెన్సులు కొంటున్నారు కాబట్టి, ఆ కొనడానికి కూడా ప్రభుత్వమే 'సహాయం' చేస్తుంది కాబట్టి, వ్యాపారం చేసే ఉద్దేశం లేదని తెలిసి కూడా ఇస్తున్నాం కాబట్టి ప్రభుత్వాన్ని నడిపేవారు ఈ దందాలో వాటా కోరారు. అందుకోసమే వేలం నిబంధనల్ని ప్రభుత్వానికి లాభం వచ్చేటట్లు కాకుండా కొనుక్కున్న వాళ్లకి ప్రయోజనం కలిగేలా చేశారు. దీనికి సూత్రధారులు సోనియా – మన్మోహన్ నేతృత్వంలో చిదంబరం, ప్రణబ్ ముఖర్జీ, రాజాలు.

కంపెనీలకు, అధికారులకు, ప్రభుత్వ నేతలకు మధ్య బ్రోకర్లుగా వ్యవహరించింది మీడియా, పబ్లిక్ రిలేషన్ కంపెనీలు. తమకు అనుకూలంగా నిర్ణయాలను తెప్పించుకోవడానికి ఎవరెవరికి ఏయే మంత్రిత్వ శాఖల్ని ఏయే స్థానాల్లో నియమించాలో కంపెనీలే నిర్ణయించాయని సాక్ష్యాధారాలతో బయటపడ్డాయి. బయటకొచ్చిన రహస్య టెలిఫోన్ సంభాషణల్లో నడిచిన స్క్రిప్ట్ ప్రకారమే అంతా జరిగింది. కానీ ఎవ్వరికీ ఏమీ కాలేదు. తన పబ్లిక్ రిలేషన్స్ కంపెనీ ద్వారా వ్యవహారం నడిపించిన టాటా మర్యాదస్తుడే! ప్రభుత్వం వైపు నుంచి పని నడిపించిన చిదంబరం, ఆయనకి వెన్నుదన్నుగా నిలిచిన సోనియా, మన్మోహన్ సింగ్‌లు కూడా అమాయకులే.

ప్రజాస్వామ్యంలో ప్రధాన స్తంభాలు నాల్గింటిలో మూడు ఈ కుంభకోణంలో పాలు పంచుకున్నాయి కాబట్టి దీనిపై కావలసినంత రాద్ధాంతం జరగలేదు. ఏదో కోర్టు అడ్డు చెప్పబట్టి కనీసం ఇంతవరకు వచ్చింది కానీ లేకపోతే ఈ మాత్రం కూడా జరిగి ఉండేది కాదు. వందో రెండొందలో తీసుకుని ఎవరైనా చిరుద్యోగి పట్టుబడితే అవినీతి, అవినీతి అని వీరంగం చేసే మధ్యతరగతి, మీడియా రెండు లక్షల కోట్ల రూపాయల విషయంలో ఎంత గొడవ చెయ్యాలి? మధ్యతరగతి ఆలోచనా విధానాన్ని ప్రభావితం చేసే జాతీయ మీడియా చిత్రంగా దొంగల్నే, అవినీతిని పెంచి పోషించిన ప్రైవేట్ రంగాన్నే సపోర్ట్ చేస్తోంది. వాళ్ల తప్పుల్ని ఎండగట్టకుండా, బ్యాంకులకు రావాల్సిన లక్ష కోట్ల గురించి మాట్లాడకుండా, పెట్టుబడి వాతావరణం పాడైపోతోందని గగ్గోలు పెడుతోంది.

మొన్న ఎన్రాన్ విషయంలోనూ ఇదే జరిగింది. (చిత్రంగా అప్పుడూ ఇప్పుడూ చిదంబరమే ప్రధాన సూత్రధారి.) బెంగాల్‌లో టాటాలకు వ్యతిరేకంగా రైతులు ఉద్యమిస్తే మీడియా రైతుల్నే తప్పు పట్టింది. టాటా గారు ఏదో ఉద్ధరిద్దామని వస్తే ఇలా చేస్తారేంటని ప్రజల్నే తప్పు పట్టింది. అప్పుడూ, ఇప్పుడూ కూడా టాటానే తప్పు

## రద్దయిన లైసెన్సులు

| భారత కంపెనీ | విదేశీ వాటాదారు | లైసెన్సులు |
|---|---|---|
| యూనిటెక్ (యూనినార్) | టెలినార్ (నార్వే) | 22 |
| శ్యామ్ గ్రూప్ | సిస్టెమా (రష్యా) | 21 |
| లూప్ మొబైల్ | | 21 |
| విడియోకాన్ | | 21 |
| స్వాన్ టెలికాం | ఎటిల్‌శాట్ (యుఎఇ) | 15 |
| ఐడియా | ఆక్సియాటా (మలేషియా) | 13 |
| ఎస్ టెల్ | బాటెల్కో (బహ్రైన్) | 6 |

చేసి నేరం ప్రజల మీదికి తోసే ప్రయత్నం చేస్తున్నాడు. 'మర్యాదస్తులకి' ఈ అవమానమేంటని మధ్యతరగతీ, మీడియా బాధపడుతున్నాయి. అనిల్ అంబానీ, వేణుగోపాల్‌ధూత్ వంటి పెద్ద పెద్ద పెట్టుబడిదారులకు ఈ కుంభకోణంలో ప్రత్యక్ష పరోక్ష సంబంధమున్నప్పటికీ చట్టం వాళ్ల జోలికి పోదు. కనీసం వాళ్లనేమీ చేయరా అని అడిగే ప్రయత్నం చెయ్యదు మీడియా.

ప్రజల కోసం పనిచేసే వాళ్లని దేశ ద్రోహులనీ, జాతి వ్యతిరేకులనీ చిదంబరం, మన్మోహన్ సింగ్ అంటే అక్షరం పొల్లు పోకుండా రాసి, మద్దతిచ్చే ఛానెళ్లూ, పేపర్లూ వాళ్లే ఇంత పెద్ద దేశద్రోహానికి పాల్పడ్డారని రాయవు. పైగా సమర్థిస్తాయి కూడా. ప్రజా ఉద్యమాల్లో భాగంగా ప్రజలు బంద్‌లకు పిలుపిస్తే ఆ రోజు దేశానికి ఎన్ని వేల కోట్ల నష్టమొచ్చిందో, ఆ డబ్బుతో ఎన్ని ఆసుపత్రులు కట్టించవచ్చో, ఎన్ని స్కూళ్లు తెరవచ్చో బాక్సులు కట్టి రాసే పత్రికలు రెండు లక్షల కోట్ల రూపాయలతో ఏం చెయ్యొచ్చో రాయవు. రెండు సంవత్సరాల పాటు ఆంధ్రప్రదేశ్ లాంటి రాష్ట్రాల్లో పన్నుల లేకుండా చెయ్యొచ్చని, విదేశీ అప్పు తీర్చొచ్చని రాయవు. ఎందుకంటే ఇలాంటి ఐడియాలు ప్రజలకివ్వడం మీడియాకి నచ్చదు.

అసలు మీడియా ఇంతకంటే భిన్నంగా వ్యవహరిస్తుందని అనుకోవడం భ్రమ. ఎందుకంటే తనెటువైపుందో మీడియాకు తెలుసు. అంతిమంగా ఎవరి ప్రయోజనాల్ని కాపాడాలో దానికి తెలుసు. అందుకే ప్రత్యామ్నాయ మీడియాను అభివృద్ధి చేసుకోవడం, అన్ని విధాలా సహకరించడం ప్రజలకు తక్షణ అవసరం. భిన్నస్వరాల్నీ, భిన్న దృక్కోణాల్నీ ప్రతిఫలించి ప్రజలకు, ప్రజా ఉద్యమాలకు ప్రత్యామ్నాయ మీడియా దోహదం చేస్తోంది. ప్రజలకు ప్రత్యామ్నాయ రాజకీయాలు, ఉద్యమాలు ఎలా అవసరమో, వాటిని పరిపుష్టం చెయ్యడానికి, వ్యవస్థ నిజస్వరూపాల్ని బహిర్గతపరచడానికి ఇది ఎంతో అవసరం.

*(రచయిత పాత్రికేయులు)* వీ

***నియంతృత్వ పాలనలో స్వతంత్ర పత్రికా రచన దానికదిగా ఒక ఆచరణగా మారుతుంది. సమాచార ప్రచారమే ప్రధానంగా ఆందోళనా చర్య అవుతుంది.***

ఈజిప్ట్ ప్రజాందోళన 2010 జనవరి సందర్భంగా తహ్రీర్ స్క్వేర్‌లో వెలువడిన నినాదం

*సుదీర్ఘకాలం పాటు కార్మికులపై అమలైన అణచివేత విధానాలే రీజెన్సీ సిరామిక్ ఫ్యాక్టరీలో విషాద పరిణామాలకు కారణమని అంటున్నారు* **వి. చిట్టిబాబు**

# యానాం ఘటనల పూర్వాపరాలు

ఫ్రెంచ్‌వారు 1723 నుండి 1954 వరకు ఈ ప్రాంతంలో కాలనీ ఏర్పాటు చేసుకొని ఉండేవారు. ఆ కాలనీనే యానాం అని పిలుస్తున్నారు. యానాం, పుదుచ్చేరి, కారైకల్, మహే అన్నింటినీ కలిపి యూనియన్ టెరిటరీ ఆఫ్ పుదుచ్చేరి అంటారు.

యానాం గ్రామ జనాభా 55,616. ఇరవై చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంతో గౌతమి, గోదావరి నది పాయలు బంగాళాఖాతంలో కలిసే ప్రాంతం.

యానాంలో 72 కర్మాగారాలు ఉన్నాయి. అందులో రీజెన్సీ సెరామిక్స్ కంపెనీ ఒకటి. ఈ కంపెనీలో సెరామిక్ టైల్స్ తయారవుతాయి. ఎగుమతి రంగంలోని ప్రముఖ సంస్థల్లో రీజెన్సీ ఒకటి. ఈ ఫ్యాక్టరీ సుమారుగా 27 సంవత్సరాల క్రితం నెలకొల్పబడింది. ప్రస్తుతం ఈ ఫ్యాక్టరీలో 880 మంది శాశ్వత ఉద్యోగులుగా, 1200 మంది తాత్కాలిక కార్మికులుగా పనిచేస్తున్నారు.

2011 జనవరిలో రీజెన్సీ సెరామిక్స్ ఆఫీసర్స్ అండ్ వర్కర్స్ యూనియన్‌ను మచ్చా సోమశేఖర మురళీమోహన్ చొరవతో ఏర్పాటు చేసుకొన్నారు. శాశ్వత, తాత్కాలిక కార్మికులు కలిసి మొత్తం రెండువేల మంది పనిచేస్తున్న ఈ సంస్థ చరిత్రలో యానాంలో తొలిసారిగా ఏడాది క్రితమే కార్మిక సంఘం ఏర్పాటు చేసుకున్నారు. సంఘం ఏర్పాటవడం తోనే యాజమాన్యం కార్మికసంఘం మధ్య వివాదాలు తలెత్తాయి. ఒకరిపై ఒకరు పైచేయి సాధించే ప్రయత్నాల పరంపర మొదలైంది. కార్మిక సంఘం ఏర్పాటు విషయమే ఈ రెండు వర్గాల మధ్య వివాదంగా మారింది. కొన్ని సంవత్సరాల క్రితం కార్మిక సంఘం ఏర్పాటుకు ప్రయత్నించిన వారిని యాజమాన్యం ఉద్యోగాల్లోంచి తొలగించి సంఘం ప్రారంభం కాకుండా నిరోధించినట్లు చెబుతున్నారు. ఇప్పుడు కూడా అదే వ్యూహం అనుసరించేందుకు ప్రయత్నించినా అది సాధ్యంకాక పోవడంతో కార్మికసంఘాన్ని బలహీనపరిచేందుకు యాజమాన్యం కంకణం కట్టుకుంది. కార్మిక సంఘం వ్యవస్థాపకుడైన మురళీమోహన్‌పై కక్ష పూరితంగా వ్యవహరించిందని కార్మికులు ఆరోపిస్తున్నారు. గత డిసెంబర్ నుంచి వేతనాల విషయంలో కూడా విభేదాలు పెచ్చు పెరిగాయి. ఈ క్రమంలో యాజమాన్యం పదకొండు మందిని యానాం నుండి తమిళనాడులోని కారైకల్‌లో ఉన్న రెగ్మా సిరామిక్స్‌కు బదిలీ చేయడంతోనూ, కార్మిక నాయకుడు మురళీమోహన్‌ను ఉద్యోగం నుండి తొలగించడంతోనూ పరిస్థితులు మరింత విషయమించాయి. కొంతమంది కార్మికులు సంస్థ ప్రయోజనాలకు నష్టం కలిగిస్తున్నారంటూ యాజమాన్యం వ్యక్తిగత హామీ పత్రాలను ఇవ్వాలని కోరింది. దీనిని నిరసిస్తూ కార్మికులు విధులు బహిష్కరించి నిరసన తెలిపారు. సంస్థకు రెండు వందల మీటర్ల పరిధిలో కార్మికులు ఆందోళనలు, నిరసనలు చేపట్టకుండా యాజమాన్యం కోర్టు నుండి ఉత్తర్వులు తెచ్చుకుంది. విధులు బహిష్కరణ విషయంలో జనవరి 27న మొదట ఫ్యాక్టరీ వద్ద చిన్నఘర్షణ జరిగింది. పోలీసులు కొంతమంది కార్మికులతో పాటు వారి నాయకుడు మురళీమోహన్‌ను పోలీస్ స్టేషన్‌కు తీసుకెళ్లారు. పోలీసులు బూటుకాళ్లతో మురళీమోహన్ ఛాతిపై తన్నడంతో నొప్పితో ఆయన స్టేషన్‌లోనే కుప్పకూలిపోయాడు. కార్మికులు మురళీమోహన్‌ను హాస్పిటల్‌కు తీసుకెళ్లాలని ప్రాధేయపడితే పోలీసులు వినలేదు. కార్మికులు ఆందోళన ఉధృతం చేయడంతో హాస్పిటల్‌కి తరలిస్తుండగా మురళీ మోహన్ మరణించాడు. ఈ వార్త తెలియగానే కార్మికులు, స్థానిక, చుట్టుపక్కల గ్రామాల ప్రజలలో ఆగ్రహావేశాలు చెలరేగాయి. అందరూ కలిసి యానాం పోలీస్ స్టేషన్ దగ్గర జమ అయి ఆందోళన చేపట్టారు. పోలీసులు ముందస్తు హెచ్చరికలు, ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ అనుమతి లేకుండా కాల్పులు జరిపారు. ఈ కాల్పుల్లో తొమ్మిది మంది కార్మికులు తీవ్రంగా గాయపడ్డారు. దీంతో కార్మికులు, స్థానిక ప్రజలు రీజెన్సీ ఫ్యాక్టరీపై దాడికి దిగారు. ఈ దాడిలో రీజెన్సీ ఉపాధ్యక్షుడు చంద్రశేఖర్ మరణించాడు. కొందరు లూటీలు సాగించడంతో సంస్థకూ కొంత నష్టం వాటిల్లింది. సంస్థకు వంద కోట్ల రూపాయల వరకు నష్టం కలిగి ఉండవచ్చని అంచనా. కార్మికుల వాస్తవ సమస్యలను, న్యాయమైన డిమాండ్లను పరిష్కరించకుండా రీజెన్సీ యాజమాన్యం మొండిగా వ్యవహరించడమే ఈ మారణహోమానికి కారణమైంది.

మురళీమోహన్ పోలీసుల చేతిలో హతమైన తర్వాత జరిగిన అన్ని పరిణామాలకు రీజెన్సీ ఉపాధ్యక్షుడు కె.సి. చంద్రశేఖర్ మరణంతో సహా పోలీసులు, యాజమాన్యం, ప్రభుత్వం బాధ్యత వహించాలి. యాజమాన్యం లాకౌట్ ప్రకటించి మరింత అన్యాయానికి ఒడిగట్టింది.

లాకౌట్ ఎత్తివేసి కార్మికులను విధుల్లోకి తీసుకోవాలి. చంద్రశేఖర్ మరణానికి కారకులైన అసలు దోషులను అరెస్టు చేయాలి. అమాయక కార్మికులను చంద్రశేఖర్ హత్యకేసులో ఇరికిస్తూ ఇంతవరకు 35 మందిని అరెస్ట్ చేశారు.

పోలీసుల చేతిలో మరణించిన మురళీమోహన్ కేసులో

*మన దేశ ప్రధానుల నుంచి ఐ.ఎ.ఎస్.ల దాకా అవినీతిమయం అయిపోయిన వ్యవస్థ తీరును వివరిస్తూ, నిజమైన ప్రజాస్వామ్యం కోసం పోరాటమే మార్గమని అంటున్నారు* **పి.వి. రమణ**

# అవినీతి ఐఎఎస్‌లదా? మంత్రులదా?

*విత్తనమొకటి వేస్తే మొక్క వేరొకటి మొలుస్తుందా?*

ఓబులాపురం అక్రమ మైనింగ్ వ్యవహారంలో అప్పటి పరిశ్రమల శాఖ కార్యదర్శి సీనియర్ ఐఎఎస్ అధికారిణి వై. శ్రీలక్ష్మితో పాటు గనుల శాఖ డైరెక్టర్ వి.డి. రాజగోపాల్ కీలకపాత్ర వహించారని సిబిఐ వారిని అరెస్ట్ చేసింది. ఓబులాపురం మైనింగ్ కంపెనీకి అనంతపురం జిల్లాలోని ఇనుప ఖనిజాల గనులను నిబంధనలన్నీ తుంగలో తొక్కి కేంద్ర ప్రభుత్వ అనుమతులు రాకముందే రాష్ట్ర ప్రభుత్వం అనుమతులిచ్చేసింది. మైనింగ్ కోసం ఇతర కంపెనీలు పెట్టుకొన్న దరఖాస్తులన్నీ తోసిపుచ్చి, 450 కోట్ల రూపాయల వ్యయంతో భారీ ఉక్కు కర్మాగారాన్ని నిర్మించబోతున్నామని ఒక ప్రాజెక్ట్ నివేదిక ఇచ్చినందుకు, పైగా సామర్థ్యం, అనుభవం, ఆర్థిక పరిస్థితులను పరిగణనలోకి తీసుకొని ఓబులాపురం మైనింగ్ కంపెనీని ఎంపిక చేసామని రాష్ట్ర ప్రభుత్వం చెప్పింది.

రాజకీయ నాయకుల అండతో, సుప్రీంకోర్టు తీర్పును కూడా లెక్క చేయకుండా, అక్రమ మైనింగ్ వ్యవహారాల ద్వారా లక్షల కోట్ల రూపాయలను దోచుకున్నాడు ఓబుళాపురం మైనింగ్ కంపెనీ అధినేత గాలి జనార్దనరెడ్డి. శ్రీలక్ష్మితోపాటు ఇతర అధికారులందరూ అతనికి పూర్తి సహకారాన్ని అందించారు.

గతంలో రాష్ట్ర ప్రభుత్వ పారిశ్రామిక పెట్టుబడుల సంస్థ (ఎపిఐఐసి) మేనేజింగ్ డైరెక్టర్‌గా పనిచేసిన, నేటి రాష్ట్ర హోంశాఖ కార్యదర్శి, సీనియర్ ఐఎఎస్ అధికారి బిభుప్రసాద్ ఆచార్యను ఎమ్మార్ కుంభకోణంలో సిబిఐ అరెస్ట్ చేసింది. వై.ఎస్. రాజశేఖరరెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు పరిశ్రమలశాఖ కార్యదర్శిగా పనిచేసి రిటైరైన సీనియర్ ఐఎఎస్ అధికారి కె.వి. రావును, గతంలో ఎపిఐఐసి వైస్ ఛైర్మన్‌గా పనిచేసి, నేడు తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా పనిచేస్తున్న సీనియర్ ఐఎఎస్ అధికారి ఎల్.వి. సుబ్రహ్మణ్యంలను ఇదే కేసులో సిబిఐ ఛార్జిషీట్‌లో నిందితులుగా పేర్కొని విచారణ ప్రారంభించింది. వీరితోపాటు మరో సీనియర్ ఐఎఎస్ అధికారులైన రమాకాంత్ రెడ్డి, భాను, రత్నప్రభలను కూడా పిలిపించి విచారించారు. ఇంకా ముప్పై మంది ఐఎఎస్ అధికారులను విచారించ వలసి ఉందని సిబిఐ చెప్పింది.

ఎమ్మార్ కుంభకోణంలో ప్రధాన సూత్రధారి సీనియర్ ఐఎఎస్

---

ఇంతవరకూ ఎవరినీ అరెస్టు చేయలేదు. కస్టోడియల్ డెత్‌గా కేసు నమోదు చేసి బాధ్యులైన పోలీసులపై కేసు నమోదు చేసి అరెస్టు చేయాలి. ఈ పని ఇంతవరకు జరగలేదు. మురళీమోహన్ పోస్టుమార్టం రిపోర్ట్ పాక్షికంగా ఇచ్చారు. ఈ రిపోర్ట్ నిజాయితీగా వస్తుందని నమ్మకం లేదు. మురళీమోహన్‌కి చాలా కాలం నుండి గుండె నొప్పి ఉన్నట్లు ప్రాథమిక రిపోర్టు తయారు చేశారు. యాజమాన్యం ప్రలోభాలకు లొంగే రిపోర్టు తారుమారవుతోందని బాధితుడి కుటుంబం ఆందోళన వ్యక్తం చేసింది.

ఈ నేపథ్యంలో ప్రజాసంఘాలు, ప్రజాస్వామికవాదులు బాధితులకూ, కార్మికులకూ, మొత్తంగా యానాం ప్రజలకు సంబంధించి తక్షణం అమలు చేయాల్సిన కొన్ని డిమాండ్లు చేశారు. అవి –

1) యాజమాన్యంతో కుమ్మక్కై పోలీసులు దుర్మార్గంగా వ్యవహరించి కార్మిక నాయకుడు మురళీమోహన్‌ని పోలీస్ స్టేషన్ తీసుకువెళ్లి కొట్టి చంపినారు. ఇది కస్టోడియల్ డెత్. వెంటనే సంబంధిత పోలీసు అధికారులపై, యాజమాన్యంపై ఐ.పి.సి. 302, 120బి సెక్షన్ల కింద కేసు నమోదు చేసి అరెస్టు చేసి కఠినంగా శిక్షించాలి; 2) మురళీమోహన్ మరణానంతరం జరిగిన దాడుల్లో కార్మికులపై పోలీసులు జరిపిన కాల్పుల్లో అనేకమంది బులెట్ గాయాలకు గురయ్యారు. అందుకు కారణమైన పోలీసులపై ఐ.పి.సి. 307 సెక్షన్ కింద కేసు నమోదు చెయ్యాలి. చట్టవ్యతిరేకంగా కాల్పులు జరిపిన సంబంధిత పోలీసులను సర్వీస్ నుండి తొలగించి వెంటనే అరెస్టు చేసి శిక్షించాలి; 3) పోలీసుల చేతిలో హతుడైన కార్మిక నేత మురళీమోహన్ కుటుంబానికి ముప్పై లక్షల రూపాయల నష్టపరిహారం చెల్లించాలి. బుల్లెట్ గాయాలకు గురైన వారికి, లాఠీఛార్జీలో గాయపడ్డవారికి నష్టపరిహారం వెంటనే చెల్లించాలి; 4) యానాంలోని రీజెన్సీ సిరామిక్స్ కంపెనీలోని కార్మికులందరికీ ఉద్యోగ గ్యారంటీని, ఉపాధి భద్రతను కల్పించాలి. చట్టబద్ధమైన అన్ని రకాల వేతనాలను, సౌకర్యాలను కల్పించాలి; 5) యానాం ప్రజల పట్ల పాండిచ్చేరి ప్రభుత్వ నిర్లక్ష్యాన్ని అందరూ ఖండించాలి. యానాం పరిపాలనాధికారిగా ఐ.ఎ.ఎస్.ని నియమించి, యానాం ప్రజల అభివృద్ధికి, అన్ని ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికుల అభివృద్ధికి యుద్ధ ప్రాతిపదికన చర్యలు చేపట్టాలి; 6) మురళీమోహన్ పోలీసుల చేతిలో హతుడైన తర్వాత జరిగిన అన్ని పరిణామాలకు కంపెనీ, పోలీసులు, యాజమాన్యం, ప్రభుత్వమే బాధ్యత వహించాలి.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు)* వీ

అధికారైన బి.పి. ఆచార్య, రాజశేఖరరెడ్డి జమానాలో రైతుల నుండి బలవంతంగా సేకరించిన వేలాది ఎకరాలు, నిబంధనలకు విరుద్ధంగా, కనీస ప్రాజెక్టు నివేదికల్లాంటి ప్రాథమిక అవసరాల్ని కూడా కోరకుండా బడా పెట్టుబడిదారులకు, ఎమ్మార్, రహేజా, ఆల్‌ఖైమా, యూనిటెక్, లేపాక్షి నాలెడ్జ్ హబ్, నాలెడ్జ్ సిటీ ల్లాంటి ప్రాజెక్టులకు హైదరాబాద్, విశాఖపట్నం, మెదక్, అనంతపురంలలో వేలాది ఎకరాలు కేటాయించిన చరిత్ర ఉంది.

ఎమ్మార్, ఎ.పి.ఐ.ఐ.సి.లు కలిసి జాయింట్ వెంచర్ ఎమ్మార్ హిల్స్ టౌన్‌షిప్ ప్రైవేట్ లిమిటెడ్ (ఇ.ఎచ్.టి.పి.ఎల్.)గా ఏర్పడింది. 285 ఎకరాల్లో అత్యాధునిక టౌన్‌షిప్, గోల్ఫ్ కోర్సులను అభివృద్ధి చెయ్యాలని నిర్ణయించారు. అభివృద్ధి హక్కులు ఎమ్మార్ కంపెనీకి 75 శాతం అని మొదట నిర్ణయించి తర్వాత దాన్ని వారికి అనుకూలంగా 90 శాతానికి మార్చారు. ప్రారంభంలో ఈ జాయింట్ వెంచర్‌లో ఎ.పి.ఐ.ఐ.సి.కి 26 శాతం వాటా ఉంటే, తర్వాత దాన్ని 6.5 శాతానికి తగ్గించేసారు. మార్కెట్ విలువ ఎకరాకు రెండు కోట్ల రూపాయలు ఉంటే ఎకరాను కేవలం 29 లక్షలకే కట్టబెట్టారు. విల్లాలు, ప్లాట్లు అధిక ధరలకు అమ్మి వాటిని ఖాతా పుస్తకాల్లో రాకుండా చూసుకొన్నారు.

పై అరెస్టులను, విచారణలను ఐఎఎస్ అధికారుల సంఘం తీవ్రంగా ఖండించింది. అవినీతికి మూలమైన మంత్రులను వదిలేసి మమ్మల్నే బలిపశువుల్ని చెయ్యడం ఎంతవరకు న్యాయమని ప్రశ్నించింది. ఐఎఎస్ అధికార్ల సంఘం ఆధ్వర్యాన వందమంది అధికారులు సమావేశమై జరుగుతున్న పరిణామాలపై తీవ్రమైన వ్యాఖ్యలు చేశారు. అనంతరం సంఘం అధ్యక్షులు భలేరావు, ఉపాధ్యక్షులు ప్రశాంత మహాపాత్ర కార్యదర్శి రేమండ్ పీటర్, మాజీ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి కాకి మాధవరావులు మీడియా ముందు తమ నిరసనలు తెలియజేశారు.

'అసలైన అధికారం మంత్రులు, ముఖ్యమంత్రుల దగ్గరే ఉంటుందనీ, వారు చెప్పినట్లు చేసినందుకు మమ్మల్ని శిక్షించడం న్యాయమా?' అని ప్రశ్నించారు. ప్రభుత్వ నిర్ణయాలకు మొత్తం మంత్రివర్గం బాధ్యత వహించాలి, 'బిజినెస్ రూల్స్' అందరూ పాటించాలి. ప్రభుత్వ పరంగా ఏ నిర్ణయం జరిగినా మత్రులు, ముఖ్యమంత్రులదే బాధ్యత అని బిజినెస్ రూల్స్‌లో స్పష్టంగా ఉంది. దాని ప్రకారమే రైలు ప్రమాదం జరిగితే ఆ శాఖ మంత్రి లాల్‌బహదూర్ శాస్త్రి పదవికి రాజీనామా చేసారు అన్నారు.

'వివాదాలకు గురైన ప్రాజెక్టుల ద్వారా లాభపడిన మంత్రులు తదితరులంతా హాయిగా తిరుగుతుంటే కేవలం ఐఎఎస్ అధికార్లను శిక్షించడం ఏ న్యాయం అని అన్నారు. 2జీ స్పెక్ట్రమ్ కుంభకోణంలో సుప్రీం కోర్టు తీర్పు ఆధారంగా నేడు వివాదాలకు గురైన ప్రాజెక్టులన్నింటినీ రద్దు చెయ్యాలని కొందరు సూచించారు. కోటి రూపాయలు తీసుకొన్న వారిని పట్టుకొని వంద కోట్ల రూపాయలు తీసుకున్న వారిని వదిలేస్తున్నారు. మేం తప్పు చేస్తే మీడియాలో మా మొహాలు చూపించాలి గానీ, మా కుటుంబాల మొహాలు చూపించడం ఎంతవరకు సమంజసం అన్నారు. కొంతమంది యువ ఐఎఎస్ అధికారులు తాము ఆఫీసులకు పరిమితం కాకూడదనీ, ప్రజలకు సంబంధించిన అంశాలపై ఎప్పటికప్పుడు స్పందించాలనీ, నిరుద్యోగం, కాలుష్యం వంటి అంశాలపై ఒక కోర్ కమిటీని ఏర్పాటు చేసి ప్రజలతో సంబంధాలు పెంచుకోవాలని' సూచించారు.

ఈ విధంగా ఐఎఎస్ అధికారులు ఉమ్మడిగా నిరసన తెలపడం మొదటిసారి కాదు. గతంలో ఎన్‌టిఆర్ హయాంలో నలభై మంది ఐఎఎస్ అధికారులపై సిబి, సిఐడి దర్యాప్తు మొదలుపెట్టినపుడు ఆ వేధింపుల నుండి రక్షించమని 1989లో అప్పటి ఐఎఎస్ అధికారుల సంఘం అధ్యక్షులు ఎచ్.కె.బాబు కేంద్ర ప్రభుత్వానికి ఫిర్యాదు చేశారు.

'సివిల్ సర్వీసులలో ఉన్నవారు ఇలాంటి ఆందోళనలు చేసే బదులు చట్టానికి, రాజ్యాంగానికి తాము బద్ధులమని, ఎవరైనా చట్ట విరుద్ధంగా పనిచేయాలని చెపితే తిరస్కరిస్తామని తీర్మానించుకొంటే మంచిది. తాము ప్రజల పక్షాన, ముఖ్యంగా పేద ప్రజల పక్షాన ఉంటామని, వారి గురించే పనిచేస్తామని చెప్పాలి. అలా చేసి ఉంటే ప్రజల నుండి మద్దతు, సానుభూతి వచ్చి ఉండేది. అవి లేకుండా ఎలాంటి సంఘాలైనా ఏమీ చెయ్యలేవు. చాలామంది అధికారులు పారిశ్రామికవేత్తలకు ఏజెంట్లుగా మారిపోయారు. మన్యం ప్రాంత గిరిజనులకు సేవకులుగా ఉండవలసిన కలెక్టర్లు కూడా వారి బాధ్యతలు నిర్వహించడం లేదు' అని సీనియర్ ఐఎఎస్ అధికారి ఇ.ఎ.ఎస్. శర్మ అన్నారు.

'రాష్ట్రంలో ఒ.ఎం.సి., ఎమ్మార్‌ల అక్రమాలకు బీజాలు పడినపుడే బాధ్యతాయుతంగా ప్రవర్తించి ఉంటే ప్రజల ఆస్తులకు రక్షకులుగా నిలిచి ఉండేవాళ్లు. అవినీతిపరులు ఐఎఎస్ అధికారులైనా జైలుకెళ్లాల్సిందే. మంత్రులు అధికారంలో 5-10 సంవత్సరాలు ఉంటారు. కానీ సర్వీసు మొత్తం ఉండేది అధికారులు మాత్రమే. అసెంబ్లీలో చర్చ జరుగుతున్నపుడు, ఆ విషయంపై కలెక్టర్ నుండి కోరిన నివేదిక పదిరోజుల్లో వస్తుందని మంత్రి చెపితే అంతటితో ఆ సమస్య వాయిదా పడుతుంది. ఇంతటి విస్తృతాధికారాలు కలిగి ఉన్న అధికారులు, ఒత్తిడికి లొంగామని అనడం సరికాదు' అని ప్రధాన మంత్రి కార్యాలయపు పూర్వ కార్యదర్శి, సీనియర్ ఐఎఎస్ అధికారి కె.ఆర్. వేణుగోపాల్ అన్నారు.

'ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయాలకు తుది బాధ్యత నాయకులదే. అలాగే పరిపాలనలో కీలకమైన పాత్ర ఐఎఎస్ అధికారులదే. ఐఎఎస్‌లకు జవాబుదారీతనం, బాధ్యత లేదంటే వ్యవస్థ కుళ్లిపోతుంది. మరే దేశంలోనూ లేనివిధంగా ఇక్కడ ఐఎఎస్ అధికారులకు పూర్తిస్థాయి రక్షణ కల్పించారు. నిర్భయంగా పని చేయడానికి, నిస్సంకోచంగా మనసులో మాట చెప్పడానికి, నాయకులు చెప్పేది తప్పయితే వ్యతిరేకించడానికి అవకాశమిచ్చారు. ఐఎఎస్‌లకు బాధ్యత లేదనడానికి వీల్లేదు. దేశాన్ని దోచుకొంటాం, మాపై ఎటువంటి చర్యలూ వద్దంటే కుదరదు. రాజకీయ అవినీతి పైస్థాయి అధికార్ల ప్రమేయం లేకుండా జరగదు. రాజకీయ నాయకుల అడుగులకు మడుగులొత్తడం వల్లనే ఈ పరిస్థితి వచ్చింది. కేంద్ర మంత్రి రాజాకు 2జీ స్పెక్ట్రమ్ కేసులో అతని కింద అధికారులు గట్టిగా చెప్పి ఉంటే ఇంత అనర్థం జరిగి ఉండేది కాదు. మేం చాలా నిజాయితీపరులమని చెప్పుకోవడం ఏమిటి? వారి ఉద్యోగమే నిజాయితీగా పనిచెయ్యాలి. అలా చేయనివారిని కఠినంగా శిక్షించాలి. వారి పదవిని ఊడపీకడమే కాకుండా వారు సంపాదించిన అక్రమ ఆస్తులన్నింటినీ స్వాధీనం చేసుకోవాలి' అన్నారు సీనియర్ ఐఎఎస్ అధికారి, లోక్‌సత్తా పార్టీ నాయకులు జయప్రకాశ్ నారాయణ.

'కొందరు ఐఎఎస్ అధికారుల్లో అవినీతి పెరిగిపోయింది. శిక్షణ ముగించుకొని కొత్తగా బాధ్యతలు చేపట్టిన వారి నుండి, కీలకస్థానాలకు చేరుకోబోతున్న సీనియర్ల వరకు అన్ని దశల్లోనూ అవినీతి కనిపిస్తోంది.

మంచి పోస్టింగ్‌ల కోసం, నిలకడగా ఒకే పోస్టింగ్‌లో ఉండడం కోసం ఐఎఎస్‌లు మంత్రులు, వారి సన్నిహితుల ద్వారా సిఫారసులు చేయించుకోంటున్నారు. తద్వారా అవినీతికి పాల్పడుతున్నారని' మైనారిటీ సంక్షేమ కార్యదర్శి, సీనియర్ ఐఎఎస్ అధికారి మహమ్మద్ అలీ రఫత్ అన్నారు.

2007లో విజిలెన్స్ కమిషనర్‌గా పనిచేసి రిటైరైన సీనియర్ ఐఎఎస్ అధికారి రామచంద్ర సమాల్ ప్రభుత్వానికి 56 పేజీల నివేదికను సమర్పిస్తూ, దానిలో 80 శాతం ఐఎఎస్ అధికారులు అవినీతిపరులేనని వివరాలతో సహా ఇచ్చారు. దానిపై ఇంతవరకు ఎలాంటి విచారణ జరగలేదు.

అలాగని మొత్తం ఐఎఎస్ అధికారులంతా అవినీతిపరులు కాదు. కానీ నిజాయితీపరులను వేళ్ల మీద లెక్కబెట్టాల్సి వస్తోంది. సీనియర్ ఐఎఎస్ అధికారి ఎస్.ఆర్. శంకరన్ గురించి వినని వారుండరు. అత్యంత నిజాయితీ, ధైర్యం ఆయన సొత్తు. మర్రి చెన్నారెడ్డి, ఎన్.టి. రామారావుల హయాంలో గిరిజనుల భూముల్ని గిరిజనేతరులకి అప్పచెప్పాలని ఆదేశించినా ఆయన లొంగలేదు. దానికి ఆయన్ను సోషల్ వెల్ఫేర్ డిపార్ట్‌మెంట్ నుండి డైరీ డెవలప్‌మెంట్ శాఖకు బదిలీ చేశారు.

బాండెడ్ లేబర్ గురించి, వారి హక్కుల గురించి గ్రామాలకు వెళ్లి ప్రచారం చేశారు. తమ ఆధిపత్యానికి అడ్డుకట్ట కడుతున్నారని భూస్వాములు ముఖ్యమంత్రికి ఫిర్యాదు చేశారు. కేబినేట్ మీటింగ్‌లో శంకరన్‌ని పిలిచి, మీరు గ్రామాలకు వెళ్లి ప్రజల్ని తిరుగుబాటు చెయ్యమని ప్రచారం చేస్తున్నారట, నిజమేనా అని ప్రశ్నించారట. దానికి శంకరన్ అవును అది సరైన పని కాబట్టే చేస్తున్నాను. అది ప్రభుత్వ బాధ్యత కూడా అని ధైర్యంగా జవాబు చెప్పారు. దానికి ముఖ్యమంత్రి విపరీతమైన కోపంతో 'ప్రభుత్వాన్ని పడగొట్టాలనుకునే మీలాంటి వాళ్లకు ఇక్కడ స్థానం లేదని అరిచాడు. దానికి ఏ మాత్రం భయపడకుండా తన స్వాభావిక ధోరణిలో నెమ్మదిగానే 'నేను చేసింది సరైంది అనుకుంటున్నాను. నేను కూడా ఇలాంటి ప్రభుత్వం కింద పనిచేయలేను' అని చెప్పి దీర్ఘకాలిక సెలవు మీద వెళ్లిపోయారు. ఆయన నిజాయితీ గురించి విన్న త్రిపుర ముఖ్యమంత్రి నృపేన్ చక్రవర్తి తన ప్రభుత్వంలో పని చేయమని ఆయన్ని ఆహ్వానించారు. అక్కడ శంకరన్ ఆరు సంవత్సరాలు పనిచేశారు.

మలమూత్రాలు ఎత్తే సామాజిక దుర్మార్గంపై ఆయన సాగించిన ఉద్యమం చాలా గొప్పది. సఫాయి కర్మచారి సంఘం (ఎస్.కె.ఎ.) ఆధ్వర్యంలో జరిగిన అనేక పోరాటాలలో ఆయన మార్గదర్శకత్వం ఉంది. ఆ సంఘం వారు ఆయన్ని ఇప్పటికీ దేవుడిలా గౌరవిస్తారు. ఎందుకంటే దేశంలో మలమూత్రాలు ఎత్తే కార్మికుల సంఖ్య 13 లక్షల నుండి 3 లక్షలకు తగ్గడానికి ఆయన ఇచ్చిన చైతన్యమే కారణం.

రాష్ట్ర మౌలిక సదుపాయాల సంస్థ జనరల్ మేనేజర్ పదవికి అర్హత లేని వ్యక్తిని నియమించాల్సిందిగా రాజశేఖరరెడ్డి పంపిన ఫైలును పక్కనపెట్టి నిబంధనల ప్రకారం అర్హతలున్న వ్యక్తికి జి.ఎం. పదవినిచ్చారు. ఆనాటి వైద్య, ఆరోగ్య శాఖ కార్యదర్శి, సీనియర్ ఐఎఎస్ అధికారి అయిన భలేరావు. దీనిపై ప్రశ్నిస్తే అర్హత లేని వ్యక్తికి పదవి ఎలా ఇస్తానని జవాబిస్తే, ఆయన్ను సస్పెండ్ చేశారు. దీనిపై కొందరు ఐఎఎస్ అధికారులు ముఖ్యమంత్రిని కలిస్తే 'నా ఆదేశాలు పాటించకపోతే ఏం జరుగుతుందో హెచ్చరించడానికే ఈ పని చేసాను' అని అన్నారు. దాంతో ఐఎఎస్ అధికారులు నోరు మూసేసారు.

ఆన్‌లైన్ మీడియా సొల్యూషన్స్ లిమిటెడ్ (ఒ.ఎం.ఎస్.ఎల్.) అనే అనుభవంలేని కంపెనీతో టెలికాం సర్వీసుల జాయింట్ వెంచర్‌ను ఒప్పుకోవల్సిందిగా అప్పటి ప్రిన్సిపల్ కార్యదర్శి జన్నత్ హుస్సేన్ ట్రాన్స్‌కో సి.ఎం.డి. రేచల్ ఛటర్జీ కార్యాలయానికి వెళ్లి హెచ్చరించారు. నిబంధనల ప్రకారం అధికారిక ప్రక్రియలన్నీ పూర్తయ్యే వరకు ఒప్పందం కుదుర్చుకొనే ప్రసక్తే లేదని ఆమె తేల్చి చెప్పడంతో ఆమెపై బదిలీ వేటు పడింది.

దేశమంతా కార్పొరేటర్ స్థాయి నుండి మంత్రుల వరకు, రాజకీయ నాయకులే కాకుండా వారికి సహకరిస్తున్న ఐఎఎస్ అధికార్లతో పాటు, ఇతర అధికారులు కోట్ల రూపాయల అక్రమార్జనలో మునిగి తేలుతున్న విషయం అందరికీ తెలిసిందే. కాని నేటి వరకు ఒకరికొకరు సహకరించుకొంటూ వస్తున్నవారు నేడు నువ్వు దొంగంటే, నువ్వు దొంగ అంటూ అరుస్తున్నారు. కాని అందరూ దొంగలేనని ప్రజలకు తెలుసు.

రాజకీయాలు నేరపూరితం కావడంతో నేరగాళ్లు, రాజకీయ నాయకులు, ప్రభుత్వాధికారులు దేశంలో అపవిత్ర కూటమిగా ఏర్పడ్డారని 1963లోనే వొహ్రా కమిటీ పేర్కొంది.

అవినీతి, ఇతర అంశాల మీద నేరారోపణలు ఎదుర్కొంటున్న ఐఎఎస్ అధికార్లను విచారించడానికి, చర్యలు తీసుకోవాడనికి ప్రభుత్వాన్ని సి.బి.ఐ.అనుమతి కోరినా, ఆరు సంవత్సరాలుగా 126 కేసులపై ఇంతవరకు అనుమతులు ఇవ్వలేదు. ఎందుకంటే అధికార్లతో పాటు రాజకీయ నాయకుల బండారం బయటపడుతుంది కాబట్టి.

కేంద్ర సంస్థ అయిన నేషనల్ అకాడమీ ఆఫ్ అడ్మినిస్ట్రేషన్ (ఎన్.ఎ.ఎ.) ఐఎఎస్ వ్యవస్థలో సంస్కరణల కోసం 1995లో ఒక స్టడీని చేపట్టింది. దాని ప్రకారం వారు తమ పదవుల హోదా పట్ల గర్వంగా ఉంటారు. ప్రభుత్వ పాలనలో వారి పర్యవేక్షణ, పని చేయడానికి ఉత్సాహం, నాయకత్వం తదితర లక్షణాలన్నింటిలో సాంప్రదాయ పరిధిలోనే కొనసాగుతున్నాయి. వారికి పేద ప్రజల గురించి సరైన అవగాహన లేదు. వారి సమస్యల పట్ల, వాటి పరిష్కారానికి అవసరమైన కార్యక్రమాలు చేపట్టే విషయంలోనూ వారికి నమ్మకం లేదు. వారిలో నిజాయితీ, నమ్మకం, రాజకీయ ఒత్తిడిలకు తలొగ్గకపోవడం, ధైర్యంగా పనిచేయడం వంటి గుణాలన్నీ క్రమక్రమంగా నశించిపోయాయి. మధ్య యుగాల నాటి దోపిడీ పద్ధతులను కొనసాగిస్తూ ప్రజావసరాల్ని నిర్లక్ష్యం చేస్తున్నారు. సంపన్నవర్గాల ఏజెంట్లుగా మారిపోతున్నారు అని చెప్పడం పరిపాలనా వ్యవస్థ ఎంత కుళ్లిపోయిందో సూటిగా తెలియజేస్తుంది.

రాజకీయ నాయకులు మొదటి అడుగు వేయగానే కోట్లు సంపాదించాలని ఎలా కోరుకుంటున్నారో, అధికారులు కూడా అదే మార్గంలో నడుస్తున్నారు. ఉద్యోగంలో చేరిన వెంటనే డబ్బు సంపాదనా మార్గాల్లోకి పరిగెడుతున్నారు. ఉదాహరణకు ఈ మధ్య ప్రొబేషనరీ డి.ఎస్.పి. గుణశేఖర్ విధుల్లోకి చేరిన రెండున్నర నెలల్లోనే అవినీతి నిరోధక శాఖ వారికి దొరికిపోయి డిస్మిస్ కాగా, మరో మహిళా డి.ఎస్.పి. చేరిన నెలన్నర కాలంలోనే అలాంటి కారణాలతోనే డిస్మిస్ అయింది.

గుంటూరు జిల్లా తెనాలి సబ్ కలెక్టర్‌గా కొత్తగా బాధ్యతలు తీసుకొన్న బాలాజీ దిగంబర మంజులే, లంచాలకు కక్కుర్తిపడి దొరికిపోయాడు. దాంతో ఆయనను బదిలీ చేశారు.

మహిళా ఆర్థిక సంస్థలో కోట్ల రూపాయల కుంభకోణంలో ఐ.ఎఫ్.ఎస్. అధికారి కిషన్ బాధ్యుడని సి.ఐ.డి. అధికారులు తేల్చారు.

సత్యం కంప్యూటర్స్ రామలింగరాజు ఏడు సంవత్సరాల కాలంలో 7136 కోట్ల రూపాయలు ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు చూపించాడు.

దీనికి మంత్రులు, అధికారుల సహకారం పూర్తిగా ఉందని వేరే చెప్పనక్కర్లేదు.

విశాఖపట్నంలో వుడా చైర్మన్‌గా పనిచేసిన ఐఎఎస్ అధికారి విష్ణు ఎం.వి.పి. కాలనీలో గజం లక్ష రూపాయలు ఉండగా కావలిసిన వారికి గజం రు.3500లకే ఇచ్చేసిన వ్యవహారం ఈ మధ్య బయట పడింది. కోస్టల్ రెగ్యులేషన్స్ నిబంధనలకు వ్యతిరేకమైనా ఆంధ్రా యూనివర్సిటీ స్థలాన్ని, జి.వి.ఎం.సి. కమిషనర్, ఐఎఎస్ అధికారి రామాంజనేయులు ప్రైవేట్ కంపెనీకి ఫుడ్ కోర్టు ఏర్పాటుకు కేటాయించేసారు. మెక్‌డోనాల్డ్ లాంటి విదేశీ కంపెనీల ఆహార పదార్థాలతో విశాఖ ప్రజల పెరుగుతున్న అవసరాల్ని తీర్చడం కోసం ఈ ఫుడ్ కోర్టు చాలా అవసరమని ఆయన అంటున్నారు.

2003లో మహారాష్ట్రలో లేబర్ వెల్‌ఫేర్ కమిషనర్ మోహన్ ధోత్రేను అవినీతి ఆరోపణలపై డిస్మిస్ చేసారు. 900 కోట్ల రూపాయల పశువుల దాణా స్కాంలో లాలూప్రసాద్ యాదవ్‌తోపాటు ఐఎఎస్ అధికారులు జులియస్ బెక్, మహింద్రా ప్రసాద్, పాల్ చంద్రసింగ్ కూడా నిందితులే.

300 కోట్ల నష్టం వాటిల్లిన ఇనుప ఖనిజం స్కాంలో పశ్చిమ బెంగాల్‌లో దేబాదిత్య చక్రవర్తి, ఆర్.ఎం. జమీర్ అనే ఇద్దరు ఐఎఎస్ అధికారులు నిందితులు.

ఉత్తరప్రదేశ్‌లో నేషనల్ రూరల్ హెల్త్ మిషన్ (ఎన్.ఎచ్.ఆర్.ఎం.) లో జరిగిన వెయ్యి కోట్ల రూపాయల కుంభకోణంలో ఫామిలీ వెల్‌ఫేర్ మినిస్టర్ బాబూసింగ్ ఖుశ్వాహ్ హెల్త్ మినిస్టర్ ఆనందకుమార్ మిశ్రాల హస్తం ఉందని సి.బి.ఐ. ప్రకటించింది. వారితోపాటు అప్పటి ప్రిన్సిపల్ సెక్రటరీ ప్రదీప్ శుక్లాను కూడా ప్రశ్నిస్తున్నారు. ఈ స్కాంలో రహస్యాలు బయటపడకుండా ఉండడానికి ఇప్పటికే ఇద్దరు చీఫ్ మెడికల్ ఆఫీసర్లు, ఒక డిప్యూటీ చీఫ్ మెడికల్ ఆఫీసర్ హత్యకు గురయ్యారు.

2జీ స్పెక్ట్రం స్కాంలో ప్రధాన నిందితుడైన మాజీ టెలికాం మంత్రి రాజా టెలికాం శాఖలో నా కంటే ముందు మంత్రులుగా పనిచేసిన వారు అవలంబించిన విధానాలనే కొనసాగించాను. ఒకవేళ నేను నేరస్తుడినైతే నాకంటే ముందు పనిచేసిన మంత్రులందరూ నేరస్తులే. వారికి కూడా జైలు శిక్షపడాలి అన్నారు.

పైన పేర్కొన్నవన్నీ ఈ మధ్యకాలంలోని అవినీతి కుంభకోణాలైతే, స్వాతంత్ర్యం వచ్చిందని చెప్పుకుంటున్న తరువాత కాలం నుండే జరిగిన మహా కుంభకోణాల గురించి చూద్దాం.

1957లోనే నెహ్రూ హయాంలో ముంద్రా కుంభకోణం జరిగింది. ముంద్రా అనే వ్యాపారస్తుడిని ఆదుకొనేందుకు జీవిత బీమా సంస్థ నుండి ప్రజల సొమ్ము 1 కోటి 26 లక్షల రూపాయలు వాడారు. దీనిపై అప్పటి ఆర్థిక మంత్రి టి.టి. కృష్ణమాచారి తన పదవికి రాజీనామా చేయాల్సి వచ్చింది. విచారణలో ముంద్రా ఉత్తరప్రదేశ్ కాంగ్రెస్ వారికి ఒక లక్షా యాభై వేల రూపాయలు, కేంద్ర కాంగ్రెస్ వారికి ఒక లక్ష రూపాయలు విరాళం ఇచ్చినట్లు చెప్పాడు.

అణు శాస్త్రవేత్త, ధర్మతేజ నౌకా పరిశ్రమ ఏర్పాటు చేయడానికి ప్రభుత్వం 1960లో ఇరవై కోట్ల రూపాయలు అప్పు ఇచ్చింది. 1966లో తేజ ఎన్నో తప్పుడు మార్గాల్లో వ్యాపారం చేసినట్లు సి.బి.ఐ. తేల్చింది. అతన్ని జైల్లో పెట్టినప్పుడు నేను ప్రధాని ఇందిరాగాంధీకి ఎంతో సహకరించాను. కాని ఆమె నాకు ఏమాత్రం సహకారించడం లేదు అని వాపోయాడు.

స్వీడన్ నుండి కొనుగోలు చేసిన 1700 కోట్ల రూపాయల బోఫోర్స్ శతఘ్నుల కుంభకోణంలో అప్పటి ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీకి ప్రత్యక్ష సంబంధాలున్నాయన్న ఆరోపణలపై నేటి వరకూ నిజం బయటపడలేదు.

1992లో జైన్ సోదరులు హవాలా కుంభకోణంలో 115 మంది రాజకీయ నాయకులకు, అధికారులకు 65 కోట్ల రూపాయలు ముడుపులు గా ఇచ్చినట్లు వారి డైరీ ద్వారా ప్రపంచానికి తెలిసింది. 1991 ఏప్రిల్‌లో సి.బి.ఐ. డి.ఐ.జి. ఒ.పి. శర్మ జైన్ సోదరుల దగ్గర పది లక్షల రూపాయలు లంచం తీసుకుంటూ దొరికిపోయాడు.

డైరీలో ముడుపులు అందుకొన్న వారి పేర్లలో రాజీవ్‌గాంధీ - 2 కోట్లు, భజన్‌లాల్ - 1 కోటి, ఎల్.కె. అద్వానీ - 60 లక్షలు, కల్పనాథ్ రాయ్ - 54.7 లక్షలు, యశ్వంత్ సిన్హా - 21 లక్షలు, దేవీలాల్ - 50 లక్షలు, కమల్‌నాథ్ - 17 లక్షలు, అర్జున్‌సింగ్ - 10.5 లక్షలు, శరద్ యాదవ్ - 5 లక్షలు, జ్ఞానీ జైల్‌సింగ్ (మాజీ రాష్ట్రపతి) - 10 లక్షలు, పి.వి. నరసింహారావు - 3.55 కోట్లు, ఆర్. వెంకట్రామన్ (మాజీ రాష్ట్రపతి) - 50 లక్షలు ఆ జాబితాలో ఉన్నారు.

1992 సెక్యూరిటీల కుంభకోణంలో హర్షద్ మెహతాను అరెస్టు చేశారు. అప్పటి ప్రధాని పి.వి. నరసింహారావుకు ఒక కోటి రూపాయలు ఇచ్చినట్లు హర్షద్ మెహతా వెల్లడించాడు. అంతే కాకుండా సంయుక్త పార్లమెంటరీ కమిటీ ఇచ్చిన రిపోర్టులో '1991 నుండి 1992 వరకు వేలాది కోట్ల రూపాయలు బ్యాంకుల నిధులు స్టాక్ మార్కెట్లోకి తరలిపోతుంటే రిజర్వ్ బ్యాంక్ మౌనంగా చూస్తూ కూర్చొంది. ఇందుకు ఆ సమయంలో రిజర్వ్ బ్యాంక్ గవర్నర్‌గా ఉన్న ఎస్. వెంకటరామన్‌ను బాధ్యుడిగా చెయ్యాలి' అని పేర్కొన్నారు. 38 వేల కోట్ల రూపాయలు నష్టమొచ్చిన టెలికాం కుంభకోణంలో అప్పటి టెలికాం మంత్రి సుఖరాంకు సుప్రీంకోర్టు శిక్ష విధించింది.

సమాజంలో పోగుపడిన సంపద అంతా ప్రజల కష్టం ద్వారా ఏర్పడ్డదే. నిజానికి ఈ ఐఎఎస్ అధికారులు అనుభవిస్తున్న సౌఖ్యాలు, ఆడంబరాలు, ఆస్తులు అన్ని ప్రజల శ్రమ ద్వారా పొందుతున్నవే. ఆవు చేలో మేస్తుంటే దూడ గట్టున మెస్తుందా అన్నట్లు తమ కళ్లముందే మంత్రులు అక్రమార్జనతో అతి సునాయాసంగా కోట్ల రూపాయలు సంపాయిస్తుంటే వీళ్లూ అందులో భాగస్వాములవుతున్నారు. పైగా మేమేనా పాపాల భైరవులం అని ప్రశ్నిస్తున్నారు.

అవినీతి మన దేశంలోకి బ్రిటిష్ సామ్రాజ్యవాదుల కాలంలో కాలు పెట్టింది. దానికి జంటకాగిన కాంగ్రెస్ రాజకీయాలు కూడా అవినీతిని పెంచి పోషించాయి. అందుకే గాంధీ 1939లో ప్రస్తుతం విచ్చలవిడిగా కొనసాగుతున్న అవినీతిని ఆమోదించడం కంటే, కాంగ్రెస్‌ను గౌరవంగా సమాధి చేయడానికే నేనిష్టపడతాను అని అన్నారంటే ఆనాటి అవినీతి ఏ స్థాయిలో ఉందో అర్థం అవుతుంది.

ఏంచబోతే మంచమంతా కంతలేనన్నట్లు, ఈరోజు అన్ని రాజకీయ పార్టీలు అవినీతిలో మునిగితేలుతున్నాయి. వారితోపాటు ఐఎఎస్ అధికారులు, ఇతర అధికారులు, యూనివర్సిటీల్లో మేధావులు, హాస్పిటల్లో డాక్టర్లు, కోర్టులలో జడ్జీలు, లాయర్లు, శాస్త్రవేత్తలు ఇలా ఒకరేమిటి అన్ని రంగాల్లోనూ ఆఖరికి మీడియాలో కూడా అవినీతి విశృంఖలంగా సాగుతోంది.

అవినీతి లేని సమాజం కావాలంటే నేటి బూటకపు ప్రజాస్వామ్యం స్థానంలో నిజమైన ప్రజాస్వామ్యం కోసం జరుగుతున్న ప్రజాపోరాటాల్లో మనందరం భాగస్వాములు కావడమొక్కటే మార్గం.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)* వీ

*అంబేద్కర్ విగ్రహాలపై దాడులు భూస్వామ్య, అగ్రకుల, అప్రజాస్వామిక సంస్కృతి స్వభావాన్ని ప్రతిఫలిస్తాయనీ, చర్చ దాని పైన జరగాలనీ అంటున్నారు* **కె. సత్యనారాయణ**

# అంబేద్కర్ కేవలం విగ్రహం మాత్రమే కాదు

ఈ జనవరి 22 రాత్రి అమలాపురం పట్టణంలో అంబేద్కర్ విగ్రహాల్ని ధ్వంసం చేసి, మూతిలో, కాల్వలో పడవేసి దారుణంగా అవమానించిన దురదృష్టకర సంఘటన రాష్ట్ర వ్యాప్త నిరసనలకు, చర్చకు దారితీసింది. దళిత సంఘాలు, వివిధ ప్రజాసంఘాలు, రాజకీయ పార్టీలు ముక్తకంఠంతో ఈ చర్యని ఖండించాయి. గొప్ప ప్రజాస్వామికవాది, దార్శనికుడు, మేధావి అయిన బాబా సాహెబ్ అంబేద్కర్‌పై దాడి ఘటన మన సమాజపు భూస్వామ్య, అగ్రకుల స్వభావం గురించి, అప్రజాస్వామిక సంస్కృతి గురించి అర్థం చేసుకోవడానికి తోడ్పడుతుంది. ఈ హేయమైన చర్య అంబేద్కర్ ఔన్నత్యాన్ని ఏ మాత్రం తగ్గించదు.

ప్రజాస్వామికశక్తులు ఈ దాడిపై తీవ్ర నిరసన వ్యక్తం చేసాయి. దళిత సంఘాలు, విద్యార్థి సంస్థలు, ఆర్.పి.ఐ., టి.ఆర్.ఎస్., సి.పి.ఐ. (ఎం), టి.డి.పి. లాంటి రాజకీయ పార్టీలు, స్వచ్ఛంద సంస్థలు దోషులను గుర్తించి, అరెస్టు చేయాలని డిమాండ్ చేస్తూ ధర్నాలు, ర్యాలీలు తీసాయి. జనవరి 29 న రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా, స్థానిక బహుజన సమాజ్ పార్టీ, దళిత స్త్రీ శక్తి, ఎస్.సి., ఎస్.టి. సంక్షేమ సంఘాలు, స్వచ్ఛంద సంస్థలు, అంబేద్కర్ యువజన సంఘాలు సంయుక్తంగా 'చలో అమలాపురం' కార్యక్రమానికి పిలుపునిచ్చాయి. జనవరి 29న మధ్యాహ్నం అమలాపురం జిల్లా పరిషత్ హైస్కూల్ గ్రౌండ్స్‌లో బహిరంగ సభను ఏర్పాటు చేయాలని తలపెట్టారు. ఈ సభకు అనుమతి ఇచ్చి, తర్వాత రద్దు చేశారు. 'చలో అమలాపురం' కార్యక్రమాన్ని భగ్నం చేయడానికి అగ్రకుల రాజకీయ పార్టీల నాయకులు, ప్రభుత్వం, వారి తొత్తులైన కొందరు దళిత నేతలతో కలిసి కుట్రపన్నాయి. 28 రాత్రి నుంచి అమలాపురంలోకి ఎవరూ రాకుండా ఆంక్షలు విధించారు. అమలపురం వెళ్లే వాహనాల్ని ఆపి, ప్రజల్ని దింపేశారు. 29 మధ్యాహ్నం వరకు అమలాపురం వెళ్లాల్సిన వాహనాలు ఎక్కడికక్కడే నిలిపివేశారు. కాలి నడకన వచ్చిన కార్యకర్తలు ఏదో రకంగా అమలాపురం 'బుద్ధ విహార్' ప్రాంతం చేరుకున్నారు. ఇంతలో అక్కడికి చేరుకున్న ఆర్.పి.ఐ. అధ్యక్షులు, దళిత నాయకులు తారకం, ఎం.ఎల్.సి. జూపూడి ప్రభాకర్ రావు, దళిత స్త్రీ శక్తి రాష్ట్ర కన్వీనర్ గెడ్డం ఝాన్సీ, టిడిపి నాయకులు గొల్లపల్లి సూర్యారావు తదితరుల్ని అక్రమంగా అరెస్టు చేశారు. లాఠీఛార్జి జరిపి జనాల్ని తరిమేశారు. అంబేద్కర్ విగ్రహాల విధ్వంసం ఘటనపై, కనీసం ప్రజాస్వామికంగా నిరసన తెలిపే హక్కు కాలరాసి, తీవ్ర నిర్బంధాన్ని ప్రభుత్వం అమలు చేసింది.

జనవరి 30న అంబేద్కర్ విగ్రహాలపై దాడులకు నిరసనగా రాష్ట్ర బంద్ పాటించాలని తెలంగాణ విద్యార్థి ఐక్య కార్యాచరణ కమిటీ (జెఎసి), వివిధ విద్యార్థి సంఘాలు పిలుపునిచ్చాయి. టిఆర్ఎస్, సిపిఐ (ఎం), టిడిపి పార్టీలు, వివిధ ప్రజాసంఘాలు, దళిత సంఘాలు ఈ బంద్‌కి మద్దతు తెలిపాయి.

అంబేద్కర్ విగ్రహాలపై దాడులకు గల నేపథ్యం, కారణాల గురించి పోలీసులు, ప్రభుత్వం, రాజకీయ పార్టీలు పలురకాలుగా వ్యాఖ్యానించాయి. పోలీసుల కథనం, ప్రభుత్వ స్పందన పరిశీలిస్తే ప్రభుత్వ వైఖరి మనకు అర్థమవుతుంది. ఈ దాడికి బాధ్యుల్ని గుర్తించామనీ, పట్టుమని ఇరవై ఏళ్లు కూడా లేని ముగ్గుర్ని పత్రికల ముందు ప్రవేశపెట్టి, పోలీసులు తమ కథనాన్ని నిందితుల 'ఒప్పుకోలు ప్రకటన' రూపంలో బయటపెట్టారు. ఈ కథనం ప్రకారం జనవరి 22న రాత్రి కొందరు యువకులు, రౌడీలు మందుపార్టీ చేసుకున్నారు. తిరిగి వెళ్లే సమయంలో ఎస్.కె.బి.ఆర్. కాలేజీ సమీపంలో మహేష్‌బాబు ఫ్లెక్సీని ధ్వంసం చేశారు. తరువాత బండివారిపేటలో అంబేద్కర్ విగ్రహాన్ని కూలగొట్టారు. రాజీవ్‌గాంధీ విగ్రహాన్ని పడేశారు. రోళ్లపాలెం, చిందాడతరుమ ప్రాంతాలలోని విగ్రహాల్ని కాల్వలోనూ, మూతిలోనూ పారవేశారు. నల్లవంతెన దగ్గర అంబేద్కర్ విగ్రహం చెయ్యి విరగొట్టారు. ఈ మొత్తం చర్యలన్నీ మద్యం తాగిన మత్తులో తాము చేసిన ఆకతాయి పనులని ఈ నిందితులు పోలీసుల ముందు ఒప్పేసుకున్నారు. ఒక మూతిలో పడవేసిన అంబేద్కర్ విగ్రహాన్ని కూడా వారు పోలీసులకు చూపించారు. కథ చెప్పి, పోలీసులు అంబేద్కర్ విగ్రహాలపై దాడికి ఏరకమైన రాజకీయ కుట్ర లేదని, ఇది కేవలం ఆకతాయిల పనేనని విచారణకు ముందే తేల్చేశారు. పోలీసులు ఎవరినో కొందర్ని పట్టుకొని, నాలుగు తన్ని కథలు చెప్పించడంలో దిట్టలని తెలిసిన వారెవరూ ఈ కథనాన్ని నమ్మరు. పూర్తిస్థాయి విచారణ, సాక్ష్యాధారాల సేకరణ లేకుండా కేవలం నిందితుల ఒప్పుకోలు ప్రకటన ఆధారంగా దాడుల వెనుక కుట్ర లేదని పోలీసులు చెప్పడం సబబు కాదు. చట్టబద్ధం కూడా కాదు. ఇది కేవలం ప్రభుత్వానికి వంత పాడడమే అవుతుంది.

ఈ ఘటనపై ప్రభుత్వ స్పందన కూడా అన్యాయంగా ఉంది. అంబేద్కర్ విగ్రహాలపై దాడికి బాధ్యులను గుర్తించడం, శిక్షించడం అనే విషయాన్ని పక్కనపెట్టి, ఇకముందు విగ్రహాలు పెట్టాలంటే ప్రభుత్వ అనుమతి అవసరమని, విగ్రహాలకు రక్షణ విషయం ఆలోచిస్తున్నామని ప్రకటించింది. అనుమతి లేకుండా పెట్టిన విగ్రహాలపై దాడులు

జరుగుతున్నాయని, విగ్రహాలు పెట్టకపోతే ఈ గొడవలే ఉండవు కదా అనే రీతిలో ప్రభుత్వ వాదన ఉంది. అంబేద్కర్ విగ్రహాలపైనే దాడులు ఎందుకు జరుగుతున్నాయో ప్రభుత్వానికి తెలియని విషయం కాదు. ఈ దాడుల్ని ఎంత సీరియస్‌గా తీసుకోవాలో అంత సీరియస్‌గా ప్రభుత్వం తీసుకోలేదు. అంబేద్కర్ విగ్రహం, మిగతా విగ్రహాల్లాగా కేవలం విగ్రహం మాత్రమే కాదు. ఒక ఆత్మగౌరవ చిహ్నం. ఒక చైతన్య రూపం. ఒక పోరాట కేంద్రం. ఆత్మగౌరవ ఆకాంక్షల్ని, చైతన్యాన్ని, పోరాటాల్ని సహించని భూస్వామ్య శక్తులు, కుల దురహంకార శక్తులు చేసిన దాడుల్ని ప్రజాస్వామిక విలువలపై చేసిన దాడిగా గుర్తించడంలో ప్రభుత్వం విఫలమైంది. పోలీసుల ద్వారా కట్టుకథలు చెప్పించి, సమగ్రమైన విచారణకు ఆదేశించకుండా ప్రభుత్వం ఈ దాడుల వెనుకనున్న పాలకపార్టీ, అగ్రకుల భూస్వామ్య శక్తుల పాత్రని వెలుగులోకి రాకుండా చేసింది.

ఈ దాడులకు కాంగ్రెస్ పార్టీలోని అంతర్గత కుమ్ములాటలు కారణమనే వాదన ఉంది. కోస్తాంధ్రలో కాంగ్రెస్ పార్టీ కాపు కులస్తుల్ని తన వైపు తిప్పుకునే క్రమంలో బొత్స సత్యనారాయణను రాష్ట్ర అధ్యక్షుడ్ని చేసింది. చిరంజీవి పార్టీకి చెందిన ఇద్దరు కాపు కులస్తులకు మంత్రి పదవులిచ్చింది. ఈ నేపథ్యంలో కాపులతో నిరంతరం ఘర్షణలు ఎదుర్కొంటున్న మాల వర్గం తీవ్ర అసంతృప్తికి లోనయింది. కాపు కులస్తులు పాలకులుగా ఎదిగే క్రమాన్ని ఎం.పి. హర్షకుమార్ లాంటి మాల నాయకులు వ్యతిరేకిస్తున్నారు. ఈ క్రమంలో కాంగ్రెస్‌లోని వారే ఈ దాడులకు పథకం వేసారనే వార్తలు వచ్చాయి. ఈ వార్తల్లోని నిజానిజాలు నిగ్గు తేల్చాల్సిన ప్రభుత్వం 'ఆకతాయి చర్య'లని చెప్పి తప్పించుకోవాలని ప్రయత్నిస్తోంది. దళిత కవి ఎండ్లూరి సుధాకర్ చెప్పినట్టు మద్యం మత్తులో అంబేద్కర్ విగ్రహాల్నే ఎందుకు ధ్వంసం చేశారనే ప్రశ్న వేసుకోవాలి.

అంబేద్కర్ విగ్రహాలపై దాడి సంఘటనలపై జరిగిన చర్చను విశ్లేషించడం అవసరం. విగ్రహాల స్థాపన, ధ్వంసం రెండూ తప్పుడు చర్యలనీ, విగ్రహాల స్థాపన ద్వారా రాజకీయ చైతన్యం రాదని కొందరు వాదించారు. అంబేద్కర్ విగ్రహాల ధ్వంసం మూర్ఖుల ఆగ్రహంగా కొట్టి పారేశారు. ఈ వైఖరి అంబేద్కర్ విగ్రహం చుట్టూ తిరిగే సమీకరణ, చైతన్యం ప్రాధాన్యతను గుర్తించడానికి అడ్డొస్తుంది. విగ్రహాల దాడుల వెనుకనున్న రాజకీయ కుట్ర, అగ్రకుల భావజాలాన్ని చర్చలోకి రాకుండా చేస్తుంది. సమాజంలో చిహ్నాల చుట్టూ జరిగే సంఘర్షణని 'మూర్ఖమైన చర్య'గా తీసిపారెయ్యడం వల్ల సమాజంలోని కొత్త రాజకీయ రీతుల్ని, మనిషిగా గుర్తింపు, ఆత్మగౌరవం లాంటి ఆకాంక్షల్ని అర్థం చేసుకోలేం.

చిన్న రాష్ట్రాల డిమాండ్‌ని సమర్థించిన ప్రజాస్వామికవాదిగా అంబేద్కర్‌ను గుర్తిస్తూ, ఆయన విగ్రహాలపై దాడిని తెలంగాణ జాగృతి సంస్థ ఖండించింది. అలాగే శాసనసభ ఆవరణలో అంబేద్కర్ విగ్రహాన్ని స్థాపించాలని కూడా ఈ సంస్థ డిమాండ్ చేసింది. తెలంగాణ కోసం పోరాడుతున్న సంస్థలు అంబేద్కర్‌ని చదవడం, స్వంతం చేసుకోవడం చాలా మంచి పరిణామాలుగా మనం భావించాలి. అలాగే అంబేద్కర్ విగ్రహాన్ని శాసనసభ ఆవరణలో పెట్టాలనే డిమాండ్ కూడా చాలా ముఖ్యమైన డిమాండ్. భారత సమాజంలో నిజమైన ప్రజాస్వామ్యానికి ప్రతీకగా అంబేద్కర్ విగ్రహం అన్ని బహిరంగ ప్రదేశాల్లో, అధికారిక ప్రాంగణాల్లో ఉండడం అవసరమే. పార్లమెంట్ ఆవరణలో గల అంబేద్కర్ విగ్రహం ఏర్పాటుకు 1960ల్లో దళిత నాయకులు డిమాండ్ చేశారు. 1966లో అంబేద్కర్ కాంస్య విగ్రహాన్ని ఇందిరాగాంధీ ప్రతిష్ఠించారు. దళితుల ఓట్ల కోసం చేసినా ఈ చర్యతో దళితులు కూడా సమాజంలో ఉన్నారనే గుర్తింపుకు ఉపయోగ పడింది. మన శాసనసభ ఆవరణలో అంబేద్కర్ విగ్రహం పెడితే ప్రభుత్వం అధికారికంగా అంబేద్కర్ లేవనెత్తిన ప్రశ్నల్ని కనీసం గుర్తు చేసుకున్నట్టవుతుంది.

అంబేద్కర్‌ని స్వంతం చేసుకోవాలనే ప్రయత్నంలో భాగంగా తెలంగాణ జాగృతి లాంటి సంస్థలు 'మా తెలంగాణలో కుల పట్టింపులు అంతగా లేవు, సకల జనులు తెలంగాణతో ఉద్యమంలో భాగంగా కదులుతున్నారు' అంటూ తెలంగాణలో కులమే లేదన్నట్టు వాదించడం పెద్ద ప్రమాదం. ఆ ప్రాంతాల నిర్దిష్ట చరిత్రను బట్టి కుల అణచివేత ఉంటుంది. సీమాంధ్రతో పోల్చి తెలంగాణలో కుల పట్టింపులు లేవని చెప్పడం సరైంది కాదు. ముఖ్యంగా టిఆర్ఎస్, తెలంగాణ జాగృతి లాంటి సంస్థలు, వాటి నాయకత్వం తెలంగాణలో కులం లేదని అంటూ, అంబేద్కర్‌ని నెత్తికెత్తుకోవడం చూస్తే అనేక అనుమానాలు వస్తాయి.

నిజంగా అంబేద్కర్‌ని గౌరవించి, స్వంతం చేసుకోవాలంటే, టీఆర్ఎస్, తెలంగాణ జాగృతి సంస్థలు తమ నిర్మాణాల్లో దళితుల భాగస్వామ్యం, తమ ఎజెండాలో దళిత ఎజెండా భాగం చేయాలి. కుల వ్యవస్థ తమ నిర్మాణాల్లో పటిష్టంగా ఉన్న వాస్తవాన్ని గుర్తించాలి. దళితుల్ని నాయకత్వ స్థానాల్లోకి ఎదగనివ్వాలి. అపుడే అంబేద్కర్ విగ్రహ స్థాపన డిమాండ్‌ని ఒక నిజాయితీతో కూడిన డిమాండ్‌గా ప్రజలు గుర్తిస్తారు. తెలంగాణ ఉద్యమం సకల జనుల ఉద్యమం అని అనుకుంటే సరిపోదు. దళిత బహుజన తెలంగాణ నినాదంతో ఉన్న వారిని కలుపుకు పోవాల్సిన అవసరాన్ని గుర్తించాలి.

అంబేద్కర్ విగ్రహాలపై దాడికి మిగతా విగ్రహాలపై దాడికి తేడాను మనం గుర్తించాలి. అంబేద్కర్ విగ్రహాలపై నిరంతరం దాడులు జరుగుతున్నాయి. దళితులు ఎక్కడ ప్రశ్నిస్తారో ఆ సందర్భంలో అంబేద్కర్‌పై దాడి జరుగుతుంది. అంబేద్కర్ ఇంకా ఒక అంటరాని వాడుగా, అంటరాని ప్రజల ప్రతీకగా చూడడం వల్ల, ఆ అంటరాని ప్రజల చైతన్యాన్ని, ప్రశ్నల్ని తట్టుకోలేని ప్రతిసారీ అగ్రకుల భూస్వామ్య శక్తులు అంబేద్కర్‌పై దాడి చేస్తాయి. ఆయన మెడలో చెప్పుల దండలు పడతాయి. ఆయన విగ్రహం చేతులు, కాళ్లూ విరుగుతాయి. అంటే అంబేద్కర్‌పై దాడి కేవలం విగ్రహాల రక్షణకు సంబంధించిన సమస్య కాదు. అంటరాని ప్రజల్ని ఈ దేశంలో అందరితో సమానులుగా, మనుషులుగా ఎంతకాలం గుర్తించరో, ఈ సమాజంలో కుల వ్యవస్థ, దాని చట్రం ఎంతకాలం భద్రంగా ఉంటుందో అంతవరకు అంబేద్కర్ విగ్రహాలపై దాడులు జరుగుతూనే ఉంటాయి. ప్రభుత్వాలు, మేధావులు ఈ కుల వ్యవస్థనీ, దాని భావజాలాన్నీ అంతం చేస్తేనే అంబేద్కర్ విగ్రహాల్ని గౌరవించే ప్రజాస్వామిక సంస్కృతి గల సమాజం ఏర్పడుతుంది. అంతవరకు అంబేద్కర్ విగ్రహం నాలుగు రోడ్ల కూడలిలో ఆత్మగౌరవం, సామాజిక న్యాయం, సమానత్వం, స్వేచ్ఛ లాంటి విలువల్ని మనకు గుర్తు చేస్తూనే ఉంటుంది. ఈ విలువలంటే గిట్టని శక్తులు అంబేద్కర్ విగ్రహాలపై విధ్వంసం జరుపుతూనే ఉంటారు.

*(రచయిత అధ్యాపకులు, ఇఫ్లూ యూనివర్సిటీ)* వీ

*అంబేద్కర్ విగ్రహాల కూల్చివేత వెనుక ఉన్న అసలు దోషులను శిక్షించాలనీ, అభిషేకాల వంటి చర్యలతో ఉద్యమ నాయకత్వం హిందూ బ్రాహ్మణీయ సంస్కృతిని పునరుద్ధరించకూడదనీ అంటున్నారు* **చిమ్మె జాన్ బర్నబాస్**

# అంబేద్కర్ విగ్రహాల ధ్వంసం - క్షీరాభిషేకాలు

ఆంధ్రప్రదేశ్‌లో ఇటీవల అంబేద్కర్ విగ్రహాల విధ్వంసాలు, చెప్పుల దండలు వేయడాలు, అవమానించడాలు వివిధ ప్రాంతాలలో కొనసాగుతున్నాయి. వీటిపై విభిన్న వాదనలు, కారణాలు ఉన్నా అందుకు కావలసింది క్షీరాభిషేకాలు చేయడం, పాత విగ్రహాల ప్రదేశంలో కాంస్య విగ్రహాలు ప్రతిష్టించడం కాదు. దళితులు మరింత ఐక్యతతో సంఘటితపడి, అంబేద్కర్ ఆలోచనలనూ, భావాలనూ, నేటి భారత దేశ పరిస్థితులకు అన్వయించుకొని, సాంఘిక, ఆర్థిక అసమానతలకు వ్యతిరేకంగా, భూస్వామ్య, కుల వ్యవస్థకు వ్యతిరేకంగా పోరాడడం. పోరాటం చేస్తున్న వివిధ మార్క్సిస్ట్ – లెనినిస్ట్ – మావోయిస్ట్ ఉద్యమాలతో మమేకమై, విప్లవ పోరాటాల ద్వారానే ఈ దేశంలో కుల వ్యవస్థను నిర్మూలించగలమనే ఆత్మవిశ్వాసం దళితులలో కలిగించాలి.

ఆంధ్రప్రదేశ్‌కి సంబంధించినంత వరకూ 1985 జూలై 17న జరిగిన కారంచేడు దళితుల ఊచకోతకు నిరసనగా ప్రారంభించిన దళిత ఉద్యమం ఈ రోజు ఏ దశలో ఉంది? లేదా ఎ, బి, సి, డి వర్గీకరణ ఉద్యమం దాదాపు పదిహేడు సంవత్సరాల క్రితం ప్రారంభించ బడింది. దాని ఫలితాలు ఏమిటి? దళిత ఉద్యమం అంతిమ లక్ష్యం రాజ్యాధికారం అంటున్నాం, ఆ రాజ్యాధికారం ఎవరి దగ్గరి నుంచి లాక్కోవాలి? వారి శక్తి, యుక్తి, వారి పునాదులు (అగ్రకుల – రెడ్డి, కమ్మ, వెలమ భూస్వామ్య శక్తులు) ఎలాంటివి? ఒక గ్రామీణ ప్రాంతంలో నివసిస్తున్న దళిత యువకుడు ఇంత లోతుగా నేడు ఆలోచించే పరిస్థితిలో ఉన్నాడా? అనే ప్రశ్నలు ప్రస్తుత దళిత నాయకులనబడే వారందరూ వేసుకోవాలి. ఆ లెక్కకొస్తే, మన రాష్ట్రంలో స్వతంత్ర దళిత ఉద్యమం ఇప్పుడు లేకనే పాలకవర్గాలకు సరియైన గుణపాఠం చెప్పలేకపోతున్నాం.

ఈరోజు అంబేద్కర్ యువజన సంఘాల పేరు మీద ఉన్నవారూ, ఉద్యోగాలలో ఉన్న ఎస్.సి., ఎస్.టి. ఉద్యోగుల సంఘ నాయకులందరూ ఈ దేశ, రాష్ట్ర పరిస్థితులను అధ్యయనం చేయడం, అంబేద్కర్ ఆలోచనా విధానాలను అధ్యయనం చేయడం మరచిపోయి, ఇప్పుడంతా జగన్, చంద్రబాబు, కిరణ్‌కుమార్ రెడ్డిలలో ఎవరు బెటర్, ఎవరు మనలను వాడుకుంటారు, ఎవరికి సేవ చేస్తే పదవులు పొందవచ్చు అనే మీమాంసలో పడ్డారు. ఇది చాలా దారుణం. గ్రామాలలో నేడు సరియైన విద్య, వైద్యం, పారిశుధ్యం, నివాసం లేక రాష్ట్రంలో దళితులు అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. అధికారులంతా అధికార పార్టీ నాయకుల చుట్టూ తిరుగుతూ గ్రామాలలోని ప్రజలను బిచ్చగాళ్ల మాదిరి చూస్తున్నారు. అసలు 'మేం వారి (ప్రజల) సేవకులం' అనే దృక్పథాన్ని ప్రస్తుత రెవెన్యూ, పోలీసు యంత్రాంగం ఏనాడో మరిచిపోయింది. ఈ రోజు పోలీసుశాఖ పని కేవలం రియల్ ఎస్టేట్ మధ్యవర్తిత్వాలు చేయడం, లేదా ప్రేమించుకున్న యువతీ యువకులకు పెళ్లిళ్లు చేయడం లేదా యాక్సిడెంట్ (ప్రమాదాల) గొడవలను సర్దుబాట్లు చేయడంగా ఉంది. దళిత నాయకులుగా, అంబేద్కర్‌వాదులుగా మనమంతా నిరంతరం అధ్యయనం చేస్తూ, రాజ్యాంగ హక్కులనూ, పోలీస్ మాన్యువల్‌నూ గుర్తు చేయాల్సి వస్తున్నది. ఇది రాష్ట్రంలో నేడున్న దుస్థితి.

తూర్పు గోదవరి జిల్లా అమలాపురంలో మొట్టమొదట కూల్చబడిన అంబేద్కర్ విగ్రహం నుంచి లెక్కవేస్తే, ఇటీవల తెనాలిలో పగలగొట్టిన ఆచార్య ఎన్.జి. రంగా విగ్రహం, విజయవాడకు చెందిన వంగవీటి మోహనరంగా విగ్రహాల విషయంలో పోలీసులు చూపించిన నేరస్తులంతా దళిత యువకులే. ఈ యువకులకు మద్యం సేవించమని డబ్బులిచ్చి, విగ్రహాల విధ్వంసాలకు ప్రోత్సహించారు. ప్రోత్సహించింది ఎవరు అన్నది ఇక్కడ తేలవలసిన విషయం.

పి.సి.సి. అధ్యక్షుడు బొత్స సత్యనారాయణ, ముఖ్యమంత్రి ఎన్. కిరణ్‌కుమార్ రెడ్డి, చిరంజీవి తదితరుల ఆధిపత్య గొడవల మూలంగానే రాష్ట్రంలో అలజడి. ప్రజా ఘర్షణలను ప్రేరేపించడానికి, కొన్ని ప్రాంతాల లోని రాజకీయ నాయకులు సృష్టించిన అలజడే ఈ విగ్రహాల విధ్వంస కార్యరూపం. అయితే కొంతమంది దళిత నాయకులు అంబేద్కర్ విగ్రహాలకు పాలతో అభిషేకాలు చేస్తూ, పాలను వృథా చేస్తూ, సరికొత్త బ్రాహ్మణ సంస్కృతిని ప్రోత్సహిస్తున్నారు. ఇటీవల హైదరాబాద్‌లో మాజీ మంత్రి డా. పి. శంకర్‌రావుకు కూడా మందకృష్ణ నేతృత్వంలో ఈ పాలాభిషేకం జరిగింది. (హోంమంత్రి కుమారుడిని అరెస్టు చేయాలని కోరుతూ ఏర్పాటు చేసిన సభలో శంకర్‌రావుకు పాలాభిషేకం చేశారు.) ఇది అవసరమా? దళిత ప్రజలుగా మన కర్తవ్యాలు ఏమిటి? అసలు మన శత్రువులు ఎవరు? మిత్రులు ఎవరు? నాయకత్వం వహిస్తున్నది ఎవరు? ప్రభుత్వం అనగా ఏమి? రాజ్యం ఏమి? పోలీసు వ్యవస్థ ఎలాంటి వైఖరి తీసుకొంటున్నది? మన పాలకులు తీసుకుంటున్న సామ్రాజ్యవాద అనుకూల విధానాలపై ఏ విధంగా పోరు సల్పాలి? అనే ప్రశ్నలకు నేటి దళిత ఉద్యమకారుల వద్ద ఎలాంటి సమాధానం లేదు.

నేటి ప్రభుత్వ పాలనా వ్యవస్థలో పోరుడు అనే పదానికి అర్థం వస్తువుగా మారిపోయింది. సామ్రాజ్యవాద విషపోకడలు పెరిగిపోతున్న

*ఇరాన్‌పై అగ్రరాజ్యాల ఆంక్షలూ, అమెరికా కవ్వింపు ప్రకటనలూ గల్ఫ్ ప్రాంతంలో యుద్ధ వాతావరణానికి సూచికలుగా ఉన్నాయని అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

# ఇరాన్‌పై యుద్ధ మేఘాలు

ప్రపంచాధిపత్యం కొరకు, తానెదుర్కొంటున్న ఆర్థిక సంక్షోభం నుండి బయటపడడానికి యుద్ధం తప్ప మరో ప్రత్యమ్నాయ మార్గాన్ని అమెరికా ఎంచుకోకపోవడం దాని సామ్రాజ్యవాద దురహంకారానికి నిదర్శనం. ఇరాక్ యుద్ధం ముగిసింది. ఆఫ్ఘన్‌యుద్ధం చరమాంకానికి చేరింది. ఇప్పుడు ఇరాన్‌పై యుద్ధానికి సన్నాహాలు చేస్తోంది. ఇరాక్, లిబియా దేశాల మీద పట్టుసాధించిన అమెరికా, నాటో కూటమి తాజాగా ఇరాన్‌లోని అపార చమురు నిక్షేపాలపై కన్నేశాయనీ, అందుకే దాన్ని కూడ తమ స్వాధీనంలోకి తెచ్చుకోవాలని తహతహలాడుతున్నాయన్నది స్పష్టం. ఈ సమయంలోనే స్వదేశంలో, విదేశాలలో సామ్రాజ్యవాద దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమాలు సంఘటితమవుతున్నాయి. యుద్ధోన్మాదాన్ని సమర్థించుకునే ఫాసిస్టు స్వభావాన్ని బహిర్గతపరచుకునే రెండు ప్రధాన విధాన నిర్ణయాలను ఈ సంవత్సర ఆరంభంలో ఒబామా ప్రకటించాడు. మొదటిది, తన విధానాలను ప్రశ్నించే, వ్యతిరేకించే వారిని అక్రమంగా నిర్బంధించి, హింసించే జాతీయ రక్షణ సాధికార చట్టం, రెండవది, తన మాట వినని, తనని ఎదిరించే దేశాన్ని తన సైనిక శక్తితో లొంగదీసుకునే సైనిక వ్యూహపత్రం 21వ శతాబ్దంలో రక్షణ ప్రాధాన్యత – ప్రపంచానికి సుస్థిర నాయకత్వం.

అమెరికా అనుసరిస్తున్న అనుచిత విధానాల వల్ల ఆర్థిక సంక్షోభం నుండి బయటపడలేక, ప్రజా ఆగ్రహాన్ని చల్లార్చలేక, ప్రజాభిప్రాయాన్ని, దృష్టిని మరల్చడానికి అమెరికన్ మితవాద రిపబ్లికన్ పార్టీ ఇరాన్‌పై యుద్ధం చేయాలని గత కొంతకాలంగా ఒబామాపై ఒత్తిడి తెస్తోంది. మరోవైపు అమెరికా, ఇజ్రాయిల్ రహస్య ఏజెన్సీలు సేకరించిన వివరాల ఆధారంగా 2011 నవంబర్ 9న అంతర్జాతీయ అణుశక్తి సంస్థ ఇరాన్‌ను అభిశంసిస్తూ అణుబాంబు తయారీకి అవసరమైన సన్నాహక కార్యక్రమాలన్నింటినీ పూర్తి చేసిందంటూ ఒక తీర్మానాన్ని విడుదల చేసింది. ఆ నేపథ్యంలో అమెరికా, బ్రిటన్, కెనడాలు ఇరాన్‌పై తాజాగా కఠిన ఆంక్షలు విధించాయి. ఇరాన్ పెట్రో రసాయనాల పరిశ్రమ పనులు నిలిచిపోయే విధంగా ఆంక్షలు విధించాయి. చమురు, సహజ వాయువు మీద ఉన్న ఆంక్షలను మరింత విస్తరించారు. ఇరాన్ అణు కార్యక్రమాలకు పనికివచ్చే సామాగ్రిపైనా, సంస్థల ఆస్తులపైనా ఐరోపా దేశాలు ఆంక్షలు విధించాయి. ఇరాన్ పౌరుల పేర్లను కొన్నింటిని పేర్కొంటూ ఇ.యు. దేశాల్లో అడుగుపెట్టరాదంటూ ఆంక్షలు విధించాయి. ఇరాన్ ఆర్థిక రంగానికి కీలకమైన ఇంధనరంగాన్ని దెబ్బతీసే విధంగా ఆంక్షలు రూపొందించి విధించాయి. దాంతో ఇరాన్ బ్రిటన్‌తో దౌత్య సంబంధాలు

---

దశలో మనమంతా నేడు జీవిస్తున్నాం. రాబోయే రోజుల్లో మరిన్ని దారుణాలు చూడవలసి వస్తుంది. ఎదుర్కోవడానికి మన దగ్గర ఒక ప్రణాళిక ఉండాలి. పోరాడడానికి ఒక ఎజెండా కావాలి. సంఘాలు సంఘటితంగా పోరాడడానికి మరింత అదనపు బలం, త్యాగం అవసరం. ఇదే విషయాన్ని ప్రస్తుత, గతించిన చరిత్ర తెలియజేస్తున్నాయి. అనేక గుణపాఠాలు నేర్చుకొని అడుగడుగునా మనకుగా మనమే అంచనాలు వేసుకుంటూ ఉద్యమించాలి. పోరాడాలి. ఎందువల్ల నేడు శత్రువు బహుముఖంగా ఉన్నాడు, అంటే భూస్వామి, పెట్టుబడి దారుడు, పోలీసు, రెవెన్యూ వ్యవస్థ (ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్.), సారా కాంట్రాక్టర్లు, శాసనసభ్యులు, మంత్రులు, అందరూ శత్రువులే. వీరినంతా ఒకేసారి ఎదుర్కోలేం. వీరిని వివిధ సందర్భాలలో, వివిధ రకాలుగా, వివిధ రూపాలలో ఎదుర్కోవాలి. అందుకు సరియైన శక్తిని సమీకరించుకోవాలి. ఇప్పుడున్న దళిత ఉద్యమం పై సమస్య లన్నింటినీ సమీక్షించుకోవాలి.

డా. అంబేద్కర్ ఒక సందర్భంలో ఈ విధంగా అన్నాడు – 'మీ సొంతకాళ్లపై మీరు నిలబడి మీ హక్కు కోసం మీరు పోరాడుతూ, మీ ఉద్యమాన్ని మీరే నిర్మించుకోండి'. సొంతకాళ్లపై నిలబడడానికే నేడు పోరాడవలసి వస్తోంది. విద్యనభ్యసించడం కూడా నేడొక పెద్ద ఖర్చుతో కూడుకున్న వ్యవహారమైంది. రాబోయే రోజుల్లో దళితులకు విద్యను దూరం చేయాలనే కుట్ర జరుగుతోంది. గ్రామ, గ్రామాన కనీసం మంచినీళ్లు లేవు కానీ, మద్యం షాపులున్నాయి. చర్చ్‌లు, మసీదులు, దేవాలయాలు కొత్త కొత్తవి నిర్మించబడుతున్నాయి. వెలుస్తున్నాయి. గ్రంథాలయాలు మాత్రం నిర్మించడం లేదు. ప్రజాసంఘాలు స్వంత కార్యాలయాలు నిర్మించుకోవడం లేదు. ఇవి మనమంతా ఆవేదన, ఆందోళన చెందాల్సిన విషయాలు. అధికారబలంతో, అగ్రకుల, భూస్వామ్య శక్తులు అన్ని రంగాలను కలుషితం చేస్తున్న నేటి పరిస్థితులలో, వారిని ఎదుర్కొని, గ్రామాలలో పోరాడడం చాలా కష్టంతో కూడుకున్న సంగతి. కాబట్టి మార్క్సిస్ట్–లెనినిస్ట్ ఉద్యమాలతో మమేకం కావాలి. మావో ఆలోచనా విధానాన్ని బలపరచాలి. అంబేద్కర్ పేరును ఉచ్చరిస్తూ జీవించడం కాదు. భారతదేశ నిర్దిష్ట పరిస్థితులకు అన్వయించుకొని విప్లవబాటలో దళితులంతా నడవాలి.

*(రచయిత న్యాయవాది,*
*ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

పూర్తిగా తెగతెంపులు చేసుకొంది. ఆస్ట్రేలియా, కెనడాలు కూడా ఐఏఈఏకు సహకరించడం లేదనే కారణంతో ద్వైపాక్షిక ఆంక్షలు విధించాయి.

ఇన్‌స్టిట్యూట్ ఫర్ సైన్స్ అండ్ ఇంటర్నేషనల్ సెక్యూరిటీ డిసెంబర్ 2011లో విడుదల చేసిన నివేదికలో అమెరికా, బ్రిటన్, ఇజ్రాయిల్, సౌదీ అరేబియాలు, వాటి మిత్ర దేశాలు కలిసి నిరంతరంగా పెంచుతున్న ఉద్రిక్తతలు పశ్చిమాసియాని అత్యంత విపత్కరమైన యుద్ధం దిశగా నడిపేందుకు మాత్రమే దోహదపడుతుందని పేర్కొంది. ప్రస్తుతం అమెరికా, బ్రిటన్‌లు పశ్చిమాసియాలో చేపడుతున్న జోక్యాలు తమ ఆర్థిక పెత్తనాన్ని కాపాడుకునేందుకు, సౌదీ అరేబియా, ఇజ్రాయిల్ వంటి వాటి కీలక ప్రాంతీయ మిత్రులను సంతృప్తి పరచేందుకు చేపట్టిన దుందుడుకు చర్యలుగా నివేదిక తెలిపింది. ప్రస్తుత చర్యలు ఇరాన్‌ను రెచ్చగొట్టేవిగా, ప్రపంచ శాంతికి ప్రమాదకరంగా పరిణమించాయని పేర్కొంది. తాజా ఆంక్షలతో ఇరాన్‌తో జూలై ఒకటి తరువాత ప్రస్తుతం కొనసాగుతున్న ఒప్పందాలుగానీ, నూతన ఒప్పందాలుగానీ కొనసాగే అవకాశం లేదు. ఇప్పటికే ఆర్థిక సంక్షోభంతో కొట్టుమిట్టాడుతున్న ఇయు దేశాలు గ్రీస్, ఇటలీ, స్పెయిన్‌లు ప్రధానంగా ఇరాన్ చమురు మీద ఆధారపడి ఉన్నందున వాటి ఆర్థిక వ్యవస్థ మరింత సంక్షోభంలో చిక్కుకోనుంది.

ఇరాన్‌పై ఐరాస, పాశ్చాత్య దేశాల ఆంక్షలను రష్యా, చైనాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. ఇరాన్ అణు కార్యక్రమాల్లో అసలు సైనిక కోణం లేనేలేదని తాము బలంగా విశ్వసిస్తున్నట్లు రష్యా విదేశాంగ ఉపముఖ్యమంత్రి ఇరాన్‌పై పాశ్చాత్య దేశాలు తాజాగా ఆంక్షలు విధించిన తర్వాత ప్రకటించారు. ఇరాన్ సమస్యను చర్చల ద్వారా పరిష్కరించాలనీ, ఈ సారి ఆంక్షలు చాలా దూరం వెళ్లాయనీ, ఇరాన్‌పై సైనిక చర్యలకు పూనుకుంటే తదనంతర పరిణామాలు చాలా ప్రమాదకరంగా ఉంటాయని కూడా ఆయన హెచ్చరించారు. మరోవైపు చైనా ఉపాధ్యక్షుడు జీ జింగ్ పింగ్ వాషింగ్టన్ పోస్టుకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆసియా ప్రజల అభివృద్ధికి, సుస్థిరతకు, శాంతికి విఘాతం కల్గించే విధంగా ఆసియాలో సైనిక ఉనికిని పెంచుకునే చర్యలు అమెరికా విరమించుకోవాలని, అణ్వాయుధాలు తయారు చేసుకునేందుకు ఇరాన్ అణు కార్యక్రమాలు నిర్వహిస్తోందని తాము భావించట్లేదని, ఇరాన్‌పై విధించిన ఆర్థిక ఆంక్షలు ఆర్థిక సంక్షోభాన్ని మరింత పెంచుతాయని ఆయన పేర్కొన్నాడు. స్వీడన్ విదేశాంగమంత్రి కార్ల్‌బిల్డ్ ఆంక్షలు విధించడం సమస్యకు పరిష్కారం కాబోదని వ్యాఖ్యానించాడు. దౌత్యపరమైన మార్గాల ద్వారా ఇరాన్ అణు సమస్యను పరిష్కరించుకోవాలన్నారు. అమెరికా నుండి వెలువడే క్రిస్టియన్ సైన్స్ మానిటర్ అనే పత్రిక తాజా కథనం ప్రకారం అణుబాంబును తయారు చేయాలని ఇంతవరకు ఇరాన్ నిర్ణయించలేదని అమెరికన్ గూఢచార సంస్థలు చెబుతున్నదానిని ఇజ్రాయిల్ సంస్థలు కూడా నిర్ధారించాయి.

కాగా, అణ్వాయుధ కార్యక్రమ వివరాలను ప్రపంచానికి వెల్లడించి ఇరాన్ తన నిజాయితీ నిరూపించుకోవాలని ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి బాన్‌కీమూన్ సూచించారు. అణ్వాయుధాలను తయారు చేయడం లేదని స్పష్టం చేయాలన్నారు. ఇరాన్ సంక్షోభ పరిష్కారానికి చర్చలే మార్గమని ఆయన అభిప్రాయపడ్డారు. ఇరాన్ అణుకేంద్రాలపై దాడి చేయాలన్న అమెరికా, ఇజ్రాయిల్ ప్రకటనలను యుఎన్ కార్యదర్శి ఖండించారు. అన్ని సమస్యలకు చర్చలే పరిష్కారమని అన్నారు. ఈ క్రమంలోనే ఇరాన్ అణు కార్యక్రమాలకు సంబంధించి అంతర్జాతీయ అణుశక్తి సంస్థ సీనియర్ అధికారి హెర్మన్ నెకార్ట్స్ నేతృత్వంలోని అధికారుల బృందం ఇరాన్‌తో కీలకచర్చల కోసం ఫిబ్రవరి 20న టెహ్రాన్ వెళ్లింది. ఇరాన్‌కు అండగా నిలుస్తున్న రష్యా, చైనా వంటి దేశాలు టెహ్రాన్‌కు సహకరించే విధంగా ఒత్తిడి తీసుకరావాలని వారు విజ్ఞప్తి చేశారు.

ఇరాన్-అమెరికా వైరం ఈనాటిదికాదు. 1951లో ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నికైన ప్రభుత్వాన్ని కూలదోసి తనబంటు షాను అధికార పీఠంలో కూర్చోబెట్టింది అమెరికానే. ఇరాన్ ప్రజానీకం విప్లవం ద్వారా 1979లో అయతుల్లా ఖొమైనీకి పట్టం కట్టే వరకు ఇరాన్‌కు అమెరికా సన్నిహిత దేశమే. ఏప్రిల్ 1979లో ఇరాన్ రాజు షా మహ్మద్ రెజా పహ్లావిని పదవీచ్యుతుని చేసి మతనాయకుడు అయతుల్లా ఖొమేని నాయకత్వంలో ఇరాన్ ఇస్లామిక్ రిపబ్లిక్ ఏర్పడింది. అప్పటి నుండి షియా ముస్లిం దేశంగా సోవియట్ రష్యా మద్దతుతో కొనసాగిన ఇరాన్ పశ్చిమ దేశాలకు శత్రుదేశంగా మారింది. ఇస్లామిక్ విప్లవం సందర్భంగా 1980లో టెహ్రాన్‌లోని అమెరికా దౌత్య కార్యాలయంపై విద్యార్థులు దాడి జరిపినప్పటి నుంచీ రెండు దేశాల మధ్య దౌత్య సంబంధాలు లేనేలేవు. అప్పటి నుంచీ ఇరాన్‌పై అమెరికా ఆంక్షల పర్వం కొనసాగుతూనే ఉంది. అంతర్జాతీయ తీవ్రవాదానికి ఇరాన్ మద్దతు ఇస్తోందనీ, మానవ హక్కుల ఉల్లంఘనలు చేస్తోందనీ మొదట్లోనూ, ఆ తర్వాత అణుబాంబు తయారు చేస్తోందని, ఉగ్రవాదులను ప్రోత్సహిస్తుందని ఆరోపిస్తుంది. వీటివల్ల ఇరాన్, అమెరికాల మధ్య దాదాపుగా ఎలాంటి వాణిజ్యం జరగడం లేదు. చమురు రాజకీయాల్లో భాగంగా పశ్చిమాసియాలో పట్టుకోసం ఇజ్రాయిల్‌ను ముందుపెట్టి అమెరికా అనేక కుట్రలకు పాల్పడుతూనే ఉంది. ఆయిల్ నిక్షేపాలపై ఆధిపత్యం కోసం అమెరికా ప్రోద్బలంతో ఇరాక్-ఇరాన్‌ల మధ్య 8 ఏళ్ల యుద్ధం జరిగింది. లెబనాన్-ఇజ్రాయిల్ వివాదంలో షియా మతస్తులైన హిజ్‌బుల్ తిరుగుబాటుదారులకు ఇరాన్ సహకరించడంతో అమెరికా ఇరాన్‌ను ధూర్తదేశంగా తీర్మానించింది. 2006 నుండి ఇప్పటి వరకు అమెరికా నాలుగుసార్లు ఆంక్షలు జారీ చేసింది. అయినా ఇరాన్ అమెరికాకు లొంగలేదు.

చారిత్రక కాలం నుండి పర్షియా ప్రాంతమైన ఇరాన్, ఇతర అరబ్బు దేశాలతో వైరభావాన్నే కొనసాగిస్తోంది. దీనికి ప్రధాన కారణం ఇరాన్‌లో అత్యధికులు షియా తెగకు చెందినవారు కాగా, చాలావరకు అరబ్ దేశాల్లో సున్నీతెగకు చెందిన వారి ఆధిపత్యంలో పాలన సాగుతోంది.

ఇరాన్ చమురు సంస్థలను జాతీయం చేయకుండా పాశ్చాత్య దేశాల చమురు సంస్థలకు సహకరించిన మహ్మద్ రెజా షా అధికార హయాంలో అమెరికానే అణ్వాయుధీకరణకు ఇరాన్‌ను ప్రోత్సహించింది. ఇరాన్‌లో అణుశక్తి రూపకల్పనకు 1967లోనే అంకురార్పణ జరిగింది. యూరోపియన్లు అందులో సబ్ కాంట్రాక్టర్లు. 1979లో అయతుల్లా ఖొమేని అధికారం చేపట్టిన వెంటనే ఇరాన్‌లో అణుకార్యక్రమాన్ని ఆపివేసి అమెరికా, జర్మనీ సంస్థలను దేశం నుంచి బహిష్కరించాడు. ఖొమేని పాలన కాలంలో ఇజ్రాయిల్‌ను చిన్న సైతాన్‌గా, అమెరికాను పెద్ద సైతాన్‌గా పిలిచేది. పాలస్తీనా పాలస్తీనీయులకే చెందాలని ప్రకటనలు చేశాడు.

2005లో ఇరాన్ అధ్యక్షుడుగా మహ్మద్ అహమ్మది నెజాద్ ఎన్నికైన తర్వాత ఇరాన్ అణు సాంకేతికలను అభివృద్ధి పరిచే కార్యక్రమాన్ని ముమ్మరం చేసింది. దీనికి పరోక్షంగా రష్యా సహకరించింది. ఇజ్రాయిల్‌కు బద్ధశత్రువైన పాలస్తీనా తీవ్రవాద

సంస్థలైన హమస్, హెజ్‌బొల్లాలకు ఆర్థిక సహకారాన్ని అందిస్తూ వస్తోంది. ఈ కారణం వల్ల ఇజ్రాయిల్ ఇరాన్‌పై తీవ్ర వైరాన్ని పెంచుకుంది. గల్ఫ్‌లోని అరబ్బు దేశాలపై ఆధిపత్యం కోసం ఒకవైపు ఇరాన్, మరోవైపు ఇజ్రాయిల్‌లు అణుబాంబులవైపు చూడక తప్పని పరిస్థితి ఏర్పడింది. ఇరాన్ కంటే ముందే అణ్వాయుధాలు సమకూర్చుకున్న ఇజ్రాయిల్ అంతర్జాతీయంగా ఎలాంటి ఒప్పందాలపై సంతకం చేయలేదు. అయినా దానిపై ఒత్తిడి లేదు. కనీసం పల్లెత్తుమాట అమెరికా మాట్లాడదు. అదే అంతర్జాతీయంగా ఒడంబడికలపై సంతకాలు చేసి అనేకసార్లు అంతర్జాతీయ పరిశీలకులను అనుమతించిన ఇరాన్‌పై రకరకాల ఒత్తిళ్లు అమెరికా, దాని మిత్రదేశాలు తేవడం సామ్రాజ్యవాద తత్వం తప్ప మరొకటి కాదు.

2009లో ఒబామా అధికారం చేపట్టాక ఇరాన్-అమెరికా సంబంధాల్లో మార్పు వస్తుందని ఆశించిన వారికి భంగపాటే జరిగింది. 2009 మే లో ఇరాన్‌కు చెందిన అణుశాస్త్రవేత్త షహ్రామ్ అమీరీని అమెరికా బలగాలు ఎత్తుకెళ్లడంతో రెండు దేశాలమధ్య మరోసారి పగ రగిలింది. మరోవైపు మధ్యధరా ప్రాంతంలో బలీయమైన శక్తిగా ఎదగడం కోసం సౌది అరేబియా-ఇరాన్ దేశాల మధ్య పోటీ తీవ్రంగా కొనసాగుతోంది. ఇరాన్‌తో చీటికి మాటికి కాలు దువ్వుతూ అమెరికాను రంగంలోని దింపడానికి అది తహతహలాడుతున్నది. అమెరికా, ఇజ్రాయిల్ గత రెండు సంవత్సరాలుగా ఇరాన్ సైంటిఫిక్ సంస్థల్లో పనిచేస్తున్న వ్యక్తులపై దృష్టి సారించాయి. వారిని కిడ్నాప్ చేసేందుకు, హతమార్చేందుకు ప్రయత్నిస్తున్నాయి. ఇరాన్ మిలటరీ, పౌర స్థావరాలపై ఉగ్రవాద దాడులు జరిపించేందుకు ప్రయత్నిస్తున్నాయి. గత రెండు సంవత్సరాల్లో ఇద్దరు అణు శాస్త్రవేత్తలను హతమార్చారు. వారు కారులో ప్రయాణిస్తుండగా వారి కారును పేల్చివేశారు. ఇరాన్ అణు ఇంధన సంస్థ చైర్మన్ ఫెరేదౌన్ అబ్బాసీ దావానీ కారుపై కూడా ఇదే విధంగా బాంబు దాడి జరిగింది. రివల్యూషనరీ గార్డ్ స్థావరంలో నవంబర్ 12న జరిగిన పేలుడులో 17 మంది మృతి చెందారు. అందులో ఇరాన్ క్షిపణి కార్యక్రమ రూపకర్త జనరల్ హసన్ తెహెరాని మొఘద్దమ్ కూడా ఉన్నారు. నటాంజ్ యురేనియం కేంద్రంలో జనవరి 11న యువ అణు శాస్త్రవేత్త ఉప అధిపతి ముస్తాఫా అహ్మది రోషన్ హత్యకు గురయ్యారు. ఆయన కారు తలుపుకు అయస్కాంత బాంబును అమర్చడం ద్వారా పేల్చివేశారని పేర్కొన్నారు. ఈ ఉగ్రవాద చర్య వెనుక సిఐఎ హస్తం ఉందని నిరూపించేందుకు తమ వద్ద తగిన ఆధారాలు ఉన్నాయని ఇరాన్ విదేశాంగ శాఖ పేర్కొంది. ఇరాన్‌లో జరుగుతున్న హత్యలు, అల్లర్ల వెనుక ఇజ్రాయిల్ రహస్య ఏజెన్సీ మొస్సాద్, అజ్ఞాతంలో ఉన్న ఇరాన్ రెబెల్ గ్రూప్ మొజాయిద్దీన్-ఇ-ఖల్క్ కారణమని ఇరాన్ అధికారులు పేర్కొంటున్నారు. మొస్సాద్ నేడు అమెరికా భద్రతా దళాలకు అత్యంత సన్నిహితంగా ఉంటూ ఇలాంటి దుశ్చర్యలకు పాల్పడు తుందన్నారు. ఈ హత్యను ఖండించాలని ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శికి, భద్రతా మండలికి ఇరాన్ విజ్ఞప్తి చేసింది.

2010లో ఇరాన్ అణు స్థావరాల స్టక్‌నెట్ కంప్యూటర్ వైరస్‌ను అమెరికా, ఇజ్రాయిల్ ప్రయోగించాయి. పరిశ్రమల్లో ఉపయోగించే కంప్యూటర్లను కూడా ఈ వైరస్ దెబ్బతీసింది. ఇరాన్ అణు కార్యక్రమాన్ని దెబ్బతీయడమే లక్ష్యంగా ఈ వైరస్‌ను ప్రయోగించాయి. ఇరాన్ గగనతలంలో సాయుధ డ్రోన్ విమానాల విహారానికి ఒబామా ప్రభుత్వం అనుమతించింది. అమెరికాకు చెందిన ఆర్‌క్యూ-170 సెంటినెల్ స్టెల్త్ డ్రోన్‌ను ఇరాన్ గత డిసెంబర్‌లో దింపేసిన తరువాత అమెరికా, ఇరాన్ దేశాల మధ్య ఉద్రిక్తతలు మరింత పెరిగాయి. 50 వేల అడుగుల ఎత్తున ప్రయాణించగల డ్రోన్ అమెరికా విమానాల్లో అత్యంత ఆధునికమైంది. ఈ విషయాన్ని డిసెంబర్ 9న ఇరాన్ టీవీ చానళ్లలో ప్రదర్శించింది. ఆర్‌క్యూ - 170 సెంటినల్ పేరిట గల ఈ గూఢాచార విమానం అంతర్జాతీయ నిబంధనలను అతిక్రమించి తమ వైమానిక తలంలో 250 కి.మీ. లోపలికి చొచ్చుకొచ్చినట్లు ఇరాన్ తెలిపింది. ఇలాంటి చర్యలు పునరావృతమైతే చర్యలు తీవ్రంగా ఉంటాయని అమెరికాను హెచ్చరించింది. ఐరాసకి ఫిర్యాదు కూడా చేసింది. ఇరాన్ స్వాధీనం చేసుకున్న డ్రోన్‌ను వెనక్కు పంపాలని అమెరికా చేసిన డిమాండ్‌ను ఇరాన్ తోసిపుచ్చింది.

గల్ఫ్ ప్రాంతంలో మళ్లీ యుద్ధమేఘాలు కమ్ముకుంటున్నాయా? ఇరాన్‌పై అమెరికా దాడి చేయడం తథ్యమా? వంటి పలు అనుమానాలకు ఇటీవల కాలంలో సంభవిస్తున్న పరిణామాలు అవుననే సమాధాన మిస్తున్నాయి. గల్ఫ్ ప్రాంతంలోని చమురుపై కన్నేసిన అమెరికా మరో దురాక్రమణకు రంగం సిద్ధం చేస్తోంది. చమురు బావులు అత్యధికంగా ఉన్న ఇరాన్‌ను లొంగదీసుకుంటే భవిష్యత్ అవసరాలకు ఢోకా ఉండదనేది అమెరికా ఆలోచన. మరోవైపు ఇరాన్ అణ్వస్త్ర దేశంగా మారితే ప్రాంతీయాధిపత్యం చెలాయిస్తుందనే భయంతో సౌదీ అరేబియా కూడా ఇరాన్‌ను తీవ్రంగా వ్యతిరేకిస్తోంది. ఇరాన్ అణు కార్యక్రమాల్ని మొగ్గలోనే తుంచెయ్యాలనీ, దానిపై సైనిక దాడి జరపాలనీ అమెరికాను పదే పదే అది కోరుతుంది. ఇటీవల అమెరికాలో తమ రాయబారిని అంతమొందించడానికి ఇరాన్ కుట్ర పన్నిందని ఆరోపిస్తూ సౌదీ అరేబియా ఐరాసలో తీర్మానం ప్రవేశపెట్టింది. ఇరాన్ దేశంలో షియా, సున్నీ తెగల మధ్య తీవ్ర విబేధాలున్నాయి. వీటివల్ల ఆ దేశంలో తరచుగా ఘర్షణలు జరగడమే కాకుండా సాటి ముస్లిం దేశాల్లో కూడా ఇరాన్‌కు శత్రువులున్నారు. ఇరాన్‌లో అంతర్గతంగా మైనార్టీ తెగలు మత ఘర్షణలకు పాల్పడుతున్నాయి. ఆగ్నేయ ప్రాంతంలోని బెలూచి తెగవారు విడిపోయి స్వతంత్ర ప్రభుత్వం ఏర్పాటు చేసుకోవాలని గెరిల్లా యుద్ధాలు, దాడులు చేస్తున్నారు. దీనితో మతఘర్షణలు పెరుగుతున్నాయి. ఈ ఘర్షణలకు, వేర్పాటు వాదానికి విదేశీ శక్తుల ప్రోత్సాహం ఉందని ఇరాన్ భావిస్తోంది. వీటన్నింటికీ తోడు ఇరాన్ అణు సామర్థ్యాన్ని సాధిస్తే పశ్చిమాసియాలో తమకు పక్కలో బల్లెంగా మారుతుందని దానిపై దాడి జరపాలనీ ఇజ్రాయెల్ తహతహలాడుతోంది. ఇరాన్ అణు స్థావరాలపై దాడులు చేస్తామంటూ ఇజ్రాయిల్ అధ్యక్షుడు బెంజిమెన్ నెతన్యాహు ఇప్పటికే ఇరాన్‌కు హెచ్చరికలు జారీ చేశాడు. ఇజ్రాయిల్ అమెరికాకు మిత్రదేశం కావడంతో స్వీయ ప్రయోజనాల రీత్యా ఇరాన్‌మీద తరచుగా అమెరికా కయ్యానికి కాలు దువ్వుతోంది.

ఇరాన్ హెచ్చరికలను లెక్కచేయకుండా అమెరికా తన యుద్ధనౌక 'అబ్రహం లింకన్'ను ఓమన్ సముద్రం నుంచి ఇరాన్‌కు దగ్గరగా హార్ముజ్ జలసంధి గుండా నడిపి గల్ఫ్ జలాలలో మోహరించింది. ఈ నౌక 80 యుద్ధ విమానాలను మోసుకెళ్లగల సామర్థ్యం కలిగి ఉంది. బ్రిటన్ తన యుద్ధనౌక 'హెచ్ఎంఎస్ ఆర్గిస్'ను సింధుశాఖలోని అమెరికా సైనిక దళాలకు తోడుగా ఉండేందుకు పంపాలని నిర్ణయించింది. దీంతో హార్ముజ్ జలసంధిని మూసివేసి గల్ఫ్‌నుంచి యూరప్‌కు చమురు రవాణాను స్తంభింపజేస్తామని ఇరాన్ హెచ్చరించింది. ఈ చర్యలన్నీ ఉద్రిక్తతకు దారితీస్తున్నాయి. కొత్త ఆంక్షలను అమలు చేస్తే హార్ముజ్ జలసంధిని మూసివేస్తామని ఇరాన్ మిలిటరీ ఉన్నతశ్రేణి నాయకులు హెచ్చరించారు. పర్షియా గల్ఫ్ ప్రాంతంలో ఉన్న ఈ జలసంధి ద్వారా

చమురు అంతర్జాతీయంగా రవాణా అవుతుంది. హార్ముజ్ జలసంధి పొడవు 6.4 కిలోమీటర్లు. ఇరాన్, ఒమన్ మధ్య గల్ఫ్ ముఖ ద్వారంగా ఉంది. ప్రస్తుతం ఈ మార్గాన్ని ఉపయోగించుకుంటున్న సౌదీ అరేబియా, కువైట్, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, ఖతార్‌ల నౌకల రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడుతుంది. హార్ముజ్ జలసంధిని మూసి వేయడానికి ఇరాన్ ప్రయత్నిస్తే తీవ్ర పరిణామాలు తప్పవని అమెరికా రక్షణ శాఖ కార్యదర్శి లియోన్ పెనెట్టా అన్నారు. మొత్తం చమురులో ఐదవ వంతు ఈ జలసంధి ద్వారానే రవాణా అవుతోందని చెప్పారు.

అణుకార్యక్రమంపై పశ్చిమ దేశాలు వత్తిడి పెంచుతున్న క్రమంలో ఇరాన్ తన సైనిక పాటవాన్ని పెంచుకుంటోంది. డిసెంబర్ చివర్లో గల్ఫ్‌లో విలయత్-90 అనే పేరుతో ఇరాన్ సైన్యం హర్మజ్ జలసంధి సమీపంలో పది రోజుల పాటు నౌకదళ విన్యాసాలు నిర్వహించింది. ఇరాన్‌కు చెందిన రెండు యుద్ధ నౌకలు సూయిజ్ కాలువ దాటి మెడిటరేనియన్ సముద్రంలోకి ప్రవేశించాయి. తమపై దాడి చేస్తే అమెరికాకు చెందిన 32 స్థావరాలను ధ్వంసం చేస్తామని గతంలో ఇరాన్ హెచ్చరించింది. ఇరాన్‌పై ఆంక్షలు విధించిన తర్వాత ఇరాన్ సైన్యం ఉపరితలం నుండి ఉపరితలంపైకి ప్రయోగించే క్షిపణిని పరీక్షించింది. ఇది రాడార్లకు చిక్కదు. ఇరాన్ రెండు దీర్ఘశ్రేణి క్షిపణులను జనవరి 2న పరీక్షించింది. అవి ఖాదర్ (పాటవం), నూర్ (కాంతి), బహ్రెయిన్, ఇజ్రాయిల్ దేశాలలోని సైనిక స్థావరాలను దృష్టిలో ఉంచుకొని రూపొందించినవి. అమెరికాకు చెందిన ఫిఫ్త్ ఫ్లీట్ బహ్రెయిన్‌లో ఉంది. బహ్రెయిన్ ఇరాక్‌కు 200 కి.మీ. దూరంలో, ఇజ్రాయిల్ 1000 కి.మీ. దూరంలో ఉన్నాయి. ఇరాన్ రూపొందించిన క్షిపణులు 200 కిలోమీటర్ల నుండి 2400 కిలోమీటర్ల దూరంలో గల లక్ష్యాలను చేరుకొని దెబ్బతీయగలవు.

అమెరికా వద్ద ఆధునిక అణ్వాయుధాలు గుట్టలుగా పడి ఉన్నాయి. ఇంకా బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా, చైనా, ఇజ్రాయిల్, పాకిస్తాన్, భారత్ వద్ద ఉన్నాయి. పశ్చిమాసియాలో ఇజ్రాయిల్ అణ్వాయుధాలు తయారు చేసిన తర్వాతనే దాన్ని ఎదుర్కొనేందుకు ఇరాన్ గాని మరొక దేశంగాని అణు కార్యక్రమాన్ని ప్రారంభించాయి. ఇజ్రాయిల్, పాకిస్తాన్ అణు బాంబులు తయారు చేసినప్పుడు అమెరికాగాని ఐరోపా దేశాలుగాని ఇంత యాగీ ఎందుకు చేయలేదు? ఇరాన్ అణుబాంబు సమర్థకులు 'పాకిస్తాన్, ఉత్తర కొరియా వద్ద అణుబాంబులు ఉండబట్టే కదా అగ్రరాజ్యాలు వాటి జోలికి వెళ్లలేదు. అణుబాంబులు ఇరాక్, లిబియా వద్ద లేనందున వల్లనే కదా అమెరికా పశ్చిమ దేశాలు ఆ దేశాలను ఆక్రమించుకొని, ఆ దేశాధినేతలను హత్య చేసింది. ఆ దేశాల వద్ద అణుబాంబులు ఉంటే ఆ దేశాలు దురాక్రమణకు గురయ్యేవా? దేశాధినేతలు హత్యకు గురయ్యేవారా?' అని వాదన చేస్తున్నారు. ఇరాన్ అణుబాంబులు తయారు చేస్తే తమ దేశానికేకాక, ప్రపంచ మానవాళికే ముప్పు అని ఇజ్రాయిల్ గుండెలు బాదుకోవడం విడ్డూరంగా ఉంది. సర్వమానవాళి శ్రేయస్సుకోరే వారెవరైనా అణుబాంబులు ఏ దేశంలో ఉన్నా వాటిని విధ్వంసం చేయాలని డిమాండ్ చేయాలి. ఆ మేరకు ఉద్యమం నిర్మించాలి.

ఇరాన్, అమెరికా మధ్య ఉద్రిక్తతలు తారాస్థాయికి చేరుకుంటున్నాయి. యుద్ధం అనివార్యమంటూ అమెరికా, దాని ప్రధాన మిత్రపక్షమైన ఇజ్రాయిల్ రోజూ ఇరాన్‌ను హెచ్చరిస్తూనే ఉన్నాయి. ఇరాన్ తన అణు కార్యక్రమం శాంతియుత సైనికేతర ప్రయోజనాల కోసమేనని స్పష్టంగా ప్రకటిస్తూనే ఉంది. జార్జియా, భారత్, థాయిలాండ్ లలో బాంబుదాడుల వెనుక ఇరాన్ హస్తం ఉందని ఇజ్రాయిల్ ఆరోపిస్తోంది. ఆ నెపంతో ఇరాన్‌పై యుద్ధానికి దిగాలని ఇజ్రాయిల్ పక్కా వ్యూహం రచించినట్లుంది. నిజానికి ఈ పేలుళ్లలో ప్రాణనష్టం జరుగకపోయినా ప్రపంచానికే పెద్ద ముప్పు జరిగినట్లు ఇజ్రాయిల్ ఆందోళన వ్యక్తం చేయడం హాస్యాస్పదంగా ఉంది. అయినా అప్రకటిత అణ్వాయుధ దేశమైన ఇజ్రాయిల్ దాడి చేస్తామని ఇరాన్‌ను పదే పదే హెచ్చరిస్తోంది. అమెరికా అండతో ఇరాన్‌పై యుద్ధానికి ఇజ్రాయిల్ కాలు దువ్వుతుండగా, అంతర్గత సమస్యలు, ఆర్థిక సంక్షోభం, రానున్న ఎన్నికల కారణంగా అమెరికా చర్చలు-ఒత్తిళ్లు అనే ద్విముఖ వ్యూహాన్ని అనుసరిస్తూ బెదిరింపుల వరకే పరిమితమయ్యే అవకాశాలు ఎక్కువగా కనిపిస్తున్నాయి.

ఈ క్రమంలోనే ఇరాన్ తన అణుకార్యక్రమంలో చారిత్రాత్మక అడుగువేసిందని, అణు కార్యక్రమాన్ని నిర్వహించే హక్కు ప్రతి సార్వభౌమ దేశానికి ఉంటుందని, దీనిని ఎవరూ అడ్డుకోలేరని, బెదిరింపులతో అదిరిపోయే కాలం పోయిందని, ప్రపంచం మారిపోయిందన్న విషయాన్ని అమెరికా గుర్తించాలని, ప్రతి రంగంలో పురోభివృద్ధిని, స్వేచ్ఛను కోరుకునే దేశాలు తప్పనిసరిగా అమెరికా దురహంకార ఆధిపత్యాన్ని వ్యతిరేకించాలని, అగ్రరాజ్యాలు విధించే ఆంక్షలను కాలరాయాలని, ఎదురొడ్డి నిలువాలని, అప్పుడే పురోభివృద్ధి సాధ్యమవుతుందని, సార్వభౌమాధికారాన్ని నిలుపుకోగలుగుతామని ఇరాన్ అధ్యక్షుడు అహ్మదీనెజాద్ తేల్చి చెప్పారు.

ఇరాన్‌లో యుద్ధం చెలరేగితే భారత్‌పై ప్రభావం తీవ్రంగా ఉంటుందని దేశీయ విశ్లేషకులు ఆందోళన చెందుతున్నారు. యుద్ధం నెలకొంటే ఇంధన దిగుమతులు తగ్గిపోయి ఇంధన ధరలు పెరుగుతాయి. ఫలితంగా నిత్యావసర వస్తువుల ధరలు, ద్రవ్యోల్బణం ఆకాశాన్నంటుతాయని, రూపాయి విలువ మరింత పతనమై భారత ఆర్థిక వ్యవస్థ తీవ్ర ప్రతికూలతను ఎదుర్కోవలసి వస్తుంది. ఇరాన్‌తో ఆర్థిక లావాదేవిలు జరిపే బ్యాంకులు, ఆర్థిక సమస్యలపై వేటు వేయాలన్నా అమెరికా నిర్ణయం చెల్లింపుల విషయంలో భారత్‌కు చిక్కులు తెచ్చిపెట్టనుంది. ఈ నేపథ్యంలో ఇరాన్‌తో స్నేహాన్ని కొనసాగిస్తూ, చమురు సంక్షోభం తలెత్తకుండా వ్యూహాత్మకంగా వ్యవహరించడం భారత్‌కు సంకటంగా మారనుంది. ఇదిలా ఉంటే ఇరాన్ నుంచి ఎగుమతి జరిగే చమురు వాడకాన్ని నిలిపివేయాలని భారత్, పాక్, రష్యా, చైనాలకు అమెరికా హెచ్చరిక చేసింది. ఇరాన్ నుండి చమురు దిగుమతులను కొనసాగించాలన్న భారత్ నిర్ణయం పట్ల అమెరికా రిపబ్లికన్ పార్టీకి చెందిన మాజీ దౌత్యవేత్త నికొలస్ బర్న్స్ ఆక్రోశం వ్యక్తం చేశాడు. భారత నిర్ణయం తమ నాయకత్వ సామర్థ్యాన్ని ప్రశ్నార్థకం చేస్తున్నదని ఆయన వ్యాఖ్యానించాడు.

'అమెరికా జాతీయ పరిశ్రమ యుద్ధమే అయినప్పుడు దాని ఆధారంగానే ఆర్థికంగా తిరిగి పుంజుకోవాలని ఆ దేశం భావిస్తోంది' అని రష్యాకు చెందిన నికోలాయి మకరోవ్ చేసిన వ్యాఖ్యానం అక్షర సత్యం. అందుకే కుక్కను పిచ్చికుక్కగా ప్రచారం చేసి చంపడమన్నది అమెరికా పాలకులు అనుసరిస్తున్న పద్ధతి. కొరియా నుంచి ఇరాక్ వరకు, నొరీగా నుంచి గడాఫీ వరకు జరిగిందిదే. ఇదే విధానాన్ని ఇరాన్ విషయంలోనూ అనుసరిస్తోంది. అమెరికా ఏకపక్ష ధోరణిని, ఇరాన్‌పై తలపెట్టిన దాడిని ప్రపంచ దేశాలు ముక్తకంఠంతో ఖండించాలి. సైనికేతర శాంతియుత అవసరాలకు అణుశక్తిని వాడుకునే హక్కును ప్రతిదేశం గౌరవించాలి. ఇరాన్ సార్వభౌమత్వాన్ని హరించే పాశ్చాత్య దేశాల ఆంక్షలను అంతర్జాతీయ సమాజం గట్టిగా వ్యతిరేకించాలి.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

*దండకారణ్యంలో ప్రత్యామ్నాయ ప్రజా రాజకీయాధికార వ్యవస్థ ఎలా పనిచేస్తున్నదో విహంగ వీక్షణాన్ని అందిస్తున్నారు* **యాన్ మిర్డాల్**

# భారత్‌పై అరుణతార

*(భారత దేశంతో సుదీర్ఘ అనుబంధం గల స్వీడిష్ రచయిత యాన్ మిర్డాల్ 2010 జనవరిలో దండకారణ్య ప్రాంతంలో మావోయిస్టు గెరిల్లా దళాలతో రెండు వారాలు కలిసి పర్యటించి, అగ్రనాయకులను ఇంటర్వ్యూ చేసి 2012 జనవరిలో రెడ్‌స్టార్ ఓవర్ ఇండియా పుస్తకం ప్రచురించారు. 1980-81లో భారతదేశంలో పర్యటించి, 1986లో ప్రచురించిన ఇండియా వెయిట్స్‌కు ఇది కొనసాగింపు. ఆ పుస్తకంలోని అనుబంధం 5: భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) పొలిట్ బ్యూరో సభ్యుడు, దండకారణ్య స్పెషల్ జోనల్ కమిటీ బాధ్యుడు, సోనుతో ఇంటర్వ్యూకు అనువాదం ఇది. యాన్ మిర్డాల్ భారతదేశంతో పాటు చైనా, మధ్య ఆసియా రిపబ్లిక్ లు, అఫ్ఘనిస్తాన్ పర్యటించి ఎన్నో పుస్తకాలు రాశారు.)*

**కా**మ్రేడ్స్ యాన్ మిర్డాల్, గౌతమ్ నవ్లాఖా వెళ్లిన చోటల్లా అక్కడి కామ్రేడ్స్ వారిని సాదరంగా ఆహ్వానించేవారు. పరిచయాలు జరిగేవి.

దండకారణ్యం పరిధిలోకి ఆంధ్రప్రదేశ్, చత్తీస్‌గడ్, ఒడిశా, మహారాష్ట్ర సరిహద్దులలోని అటవీ ప్రాంతాలు, గ్రామాలు అన్నీ వస్తాయి. దండకారణ్యం అనే పేరు పార్టీ పెట్టింది కాదు. చరిత్రలో ఈ పేరు పురాణాల కాలం నుంచీ ఉంది. రామాయణంలో రాముడు తన అజ్ఞాత అరణ్యవాసం గడపడానికి ఈ దండకారణ్యానికే వచ్చాడంటారు. ప్రస్తుతం దండకారణ్యాన్ని పార్టీ పది డివిజన్ల కింద విభజించింది. దండకారణ్యానికి బయటికి కూడ, ఉదాహరణకు మాన్‌పూర్, మైన్‌పూర్ ప్రాంతాలకు, విస్తరించింది. 2004 వరకూ కూడ పాత బస్తర్, గడ్చిరోలి మాత్రమే పోరాట ప్రాంతాలుగా ఉండేవి. ఆ తర్వాత మాన్‌పూర్, మైన్‌పూర్‌లకు కూడ విస్తరించడం జరిగింది. సులభమైన సమన్వయం కోసం బస్తర్ ప్రాంతాన్ని ఆరు డివిజన్లుగా, గడ్చిరోలి ప్రాంతాన్ని రెండు డివిజన్లుగా విభజించాం. వాటితో పాటు మాన్‌పూర్, మైన్‌పూర్ రెండు డివిజన్లు కూడ కలిస్తే మొత్తం పది డివిజన్లు అవుతాయి. మొత్తం దండకారణ్య ప్రాంతంలో కోయ, దొర్ల తెగలు ప్రధానమైన ఆదివాసి సమూహాలు. వారు కాక హల్బీ, బత్ర, ప్రధాన్ తెగలు కూడ ఉన్నాయి. ఈ ప్రాంతంలో కొన్ని దళిత వర్గాలు, మహారాష్ట్రలో మహర్ కులానికి చెందినవారు కూడ ఉన్నారు. వీరు కాక, సాహు వంటి ఆదివాసేతర ప్రజలు కూడ కొందరు ఉన్నారు. కోయ, దొర్ల తెగలను కలిపి గోండులు అని పిలవడం అలవాటు. అందువల్లనే ఈ ప్రాంతానికి గోండ్వానా అనే పేరు కూడ ఉంది. మధ్యప్రదేశ్, చత్తీస్‌గడ్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, ఒడిశా రాష్ట్రాలన్నీ కలిపి గోండు ప్రజానీకం జనాభా 70 లక్షలు ఉంటుంది. దండకారణ్యంలో మేం పనిచేస్తున్న 10 డివిజన్లలో కలిసి 45-50 లక్షల జనాభా ఉంటుంది. దాదాపు అరవై వేల చదరపు కిలో మీటర్ల ప్రాంతంలో ఉద్యమం విస్తరించి ఉంది.

ఈ ప్రాంత ప్రజలకు అనాదిగా, క్రీస్తు పూర్వం నుంచీ కూడ చరిత్ర పొడవునా వీరోచిత పోరాట సంప్రదాయం ఉంది. చరిత్రలో, బ్రిటిష్ వారు రాకపూర్వమూ, బ్రిటిష్ వలస పాలనలో ఎక్కువగానూ ఇక్కడి ప్రజలు ఎన్నో విస్తృతమైన తిరుగుబాట్లలో పాల్గొన్నారు. 1825 నుంచి 1964 వరకూ ఇక్కడి ప్రజలు వేరు వేరు నాయకత్వాల కింద 10,11 సార్లు తిరుగుబాట్లు చేశారు. 1964లో బస్తర్ ప్రజలు చివరిసారిగా రాజు నాయకత్వంలో నెహ్రూ ప్రభుత్వం మీద పోరాడారు. ఆ తర్వాత 10-15 సంవత్సరాలు నిశ్శబ్దంగా ఉన్న తర్వాత 1980ల తొలిరోజుల్లో మేం ఇక్కడ ప్రవేశించాం. చరిత్రక్రమమంతా ఇక్కడి ప్రజలు దోపిడీకి వ్యతిరేకంగా తమ భూమి కోసం, భుక్తి కోసం పోరాటాలు జరుపుతూనే ఉన్నారు. భారతదేశంలో అన్ని ఆదివాసి జాతులలో లాగనే వీరికి కూడ ప్రజాస్వామిక జీవన విధానం ఉండేది.

1980ల తొలిరోజుల్లో పార్టీ ఇక్కడ ప్రవేశించిన కొత్తలో జరిగిన చరిత్రను కామ్రేడ్ మురళి వివరంగానే చెప్పాడు. 1989లో రాష్ట్రవ్యాప్త ఆదివాసి రైతాంగ నిర్మాణం దండకారణ్య ఆదివాసి మజ్దూర్ కిసాన్ సంఘ్‌గా రూపుదాల్చింది. ఈ సంస్థ నాయకత్వంలో స్త్రీ పురుషులు భూమి హక్కులకోసం పోరాటాలు చేశారు. ప్రత్యేకంగా దున్నేవారికే భూమి నినాదంతో భూమిలేని నిరుపేద రైతులు సంఘటితమయ్యారు. ప్రస్తుతం ఈ సంస్థ సభ్యత్వం ఒక లక్షకు చేరింది. ఆ తర్వాత 1991లో మహిళా విముక్తి లక్ష్యంతో మహిళల సంస్థగా క్రాంతికారీ ఆదివాసి మహిళా సంఘం ఏర్పడింది. ప్రస్తుతం దానిలో ఒక లక్ష మంది సభ్యులున్నారు. ఆ సమయానికే మేం దండకారణ్యంలో అతి ముఖ్యమైన పార్టీగా రూపొందాం. 2004 లో చేతన నాట్య మంచ్ ప్రారంభమయింది. దాని సభ్యత్వం ప్రస్తుతం పదివేలు దాటింది. నా ఉద్దేశంలో భారతదేశం మొత్తం మీదనే అతి పెద్ద విప్లవ రచయితల, కళాకారుల సంస్థ అది.

మేం ఇక్కడ ప్రజలను సంఘటిత పరచడంలో విజయం సాధించాం. ప్రభుత్వ అటవీ శాఖ కింద, ఆదివాసి తెగ పెద్దల కింద పీడనకు గురైన సుదీర్ఘ చరిత్ర గల ఇక్కడి ప్రజలు సహజంగానే సంఘటితం కావడానికి ఆసక్తి చూపించారు. అయితే మొదట ప్రజలలో పార్టీ పట్ల విశ్వాసం పెంపొందడానికి కొంత కాలం పట్టింది. కాని చివరికి ఆ విశ్వాసం ఏర్పడిన తర్వాత, బ్రహ్మాండమైన విజయాలు సాధ్యమయ్యాయి. ఇక్కడి ప్రధాన సమస్య భూమి సమస్యే గనుక ఈ ప్రాంతంలో ప్రారంభించిన తొలి పోరాటం అటవీశాఖకు వ్యతిరేకంగా సాగింది. అటవీ శాఖ అదుపు కింద విస్తారమైన భూములు ఉండేవి. తొలిరోజుల్లో తెగపెద్దలకూ ప్రజలకూ మధ్య వైరుధ్యం ఉన్నప్పటికీ ప్రజలు దాని గురించి చెప్పడానికి సంకోచిస్తూ ఉండేవారు.

అప్పటికి వారికి పార్టీ మీద ఇంకా నమ్మకం ఏర్పడలేదు. పార్టీ వెళ్లిపోతే ఆ తర్వాత తాము తెగపెద్దల ప్రతీకారానికి బలి కావలసి వస్తుందని వారు భయపడేవారు. అందువల్ల తొలి సంవత్సరాలలో మేం మొత్తం ఆదివాసి ప్రజానీకానికీ అటవీ శాఖకూ మధ్య ఉన్న వైరుధ్యాన్నే ప్రధానంగా తీసుకున్నాం. ఆ క్రమంలో రాజ్య వ్యతిరేక పోరాటంలో మా నిజాయితీనీ, త్యాగనిరతినీ కళ్లారా చూసిన ప్రజలు మామీద నమ్మకం పెంచుకుని తమలోని అంతర్గత వైరుధ్యం గురించి మాతో చెప్పడం ప్రారంభించారు. భూమి సమస్య చాల తీవ్రమైనది గనుక పార్టీ ఆ సమస్యనే ఎక్కువగా పట్టించుకుంది. ఇవాళ ఈ ప్రాంతంలో భూమిలేని నిరుపేద రైతాంగం దాదాపుగా లేదని చెప్పవచ్చు. తొలిరోజుల్లో భూమిలేని నిరుపేదల సంఖ్య గణనీయంగా ఉండేది. మూడు లక్షల ఎకరాల భూమిని మేం గెలవగలిగాం. అలా గ్రామాలలో మొట్టమొదటి పోరాటం భూస్వాధీన ఉద్యమంగానే ఉండింది. తెగ పెద్దల చేతుల్లో కూడ చాల భూమి ఉండేది. కాని అటవీ భూములతో పాటు ఈ తెగ పెద్దల భూములను కూడ స్వాధీనం చేసుకుని పంపకం జరపడంతో ఈ ప్రాంత ప్రజల జీవన ప్రమాణం మెరుగుపడింది. తొలిరోజుల్లో ఆహార సమస్య కూడ తీవ్రంగానే ఉండేది. ఇవాళ వాళ్లకు రోజూ రెండు పూటలా తిండి దొరుకుతోంది. అందరికీ భూమి ఉంది. అటవీ శాఖకు వ్యతిరేక పోరాటం, తెగ పెద్దలకు వ్యతిరేక పోరాటం కలిసే సాగాయి.

కాని అదే సమయంలో రాజ్య నిర్బంధం కూడ పెరుగుతూ వచ్చింది. క్రమక్రమంగా దండకారణ్య ఆదివాసి మజ్దూర్ కిసాన్ సంఘ్ ను తమ సొంత సంస్థగా గ్రామస్తులు పూర్తిగా విశ్వసించే సమయం వచ్చింది. ఆదివాసి సంప్రదాయానికి అనుగుణంగా గ్రామస్తులలో ప్రతి ఒక్కరూ సంస్థ కార్యక్రమాలలో పాలు పంచుకున్నారు. ఆదివాసులలో తరతరాలుగా సాగివస్తున్న సామూహిక భాగస్వామ్యం అనే సంప్రదాయాన్ని పార్టీ తొలిరోజుల్లో విప్లవ లక్ష్యం కోసం సంపూర్ణంగా వినియోగించుకుంది. ఇప్పుడిక సంస్థా నిర్మాణం, పార్టీ ఉండవలసిన అవసరాన్ని, ప్రయోజనాలను వారు తమంతట తామే గుర్తించారు గనుక ప్రజల చైతన్యాన్ని మరొక మెట్టు పైకి ఎదిగించవలసిన కర్తవ్యాన్ని పార్టీ చేపట్టింది. తమకూ తెగపెద్దలకూ మధ్య ఉన్న వైరుధ్యానికీ, తమకూ రాజ్యానికీ మధ్య ఉన్న వైరుధ్యానికీ తేడాను ప్రజల చేత గుర్తింపజేయడానికి ప్రయత్నించింది. తద్వారా వారికి విభజన రేఖ స్పష్టమయింది. తెగ పెద్దలు రాజ్యంతో కలిసిపోయారు, పార్టీ, ప్రజలు ఏకమయ్యారు. భూమి మీద తమ హక్కును నిలుపుకోవాలంటే పోరాడక తప్పదనే చైతన్యం ప్రజలకు అప్పటికే కలిగింది. అలా పోరాటానికి సిద్ధపడకపోతే, రాజ్యమూ పెద్దలూ కలిసి భూమిని తిరిగి లాక్కోవడానికి అన్ని ప్రయత్నాలూ చేస్తారు. ప్రజలు స్వయంగా సాయుధంగా సంఘటితం అయితేనే తమ హక్కును కాపాడుకోవడం సాధ్యమవుతుందనే విషయాన్ని పార్టీ స్పష్టం చేసింది.

అదే సమయంలో, అంటే 1990-91లలో మొట్టమొదటి జన జాగరణ్ ప్రారంభమయింది. అదేమీ యాదృచ్ఛికం కాదు. తెగపెద్దలు తమ భూమినీ సాంప్రదాయిక అధికారాన్నీ కోల్పోవడంతో, దండకారణ్య ఆదివాసి మజ్దూర్ కిసాన్ సంఘ్ అధికారం ప్రబలమవుతూ వచ్చింది. అందువల్ల సహజంగానే రాజ్యమూ, పెద్దలూ కలిసికట్టుగా 1990-91లో జనజాగరణ్ పేరుతో మొట్టమొదటి తెల్ల బీభత్సకాండ ప్రారంభించారు. అదే సమయంలో పార్టీ రిక్రూట్ మెంట్ కూడ ఎక్కువగా జరగడం మొదలయింది. ఈ పరిణామాలన్నిటికీ పరస్పర సంబంధం ఉంది.

మొత్తానికి ఆ సమయం దండకారణ్య విప్లవోద్యమ చరిత్రలో కీలక దశ. అప్పుడే 1990-91లో తెల్ల బీభత్సం మొదలయింది. అప్పుడే రైతాంగ, మహిళా నిర్మాణాలు జోనల్ స్థాయిని చేరుకున్నాయి. ప్రజా మిలీషియా రూపంలో రిక్రూట్ మెంట్ పెరగింది. ఒక సంవత్సరం కూడ తిరగకముందే మహారాష్ట్రలో తీవ్రమైన నిర్బంధం మొదలయింది. 1991-94 మధ్య కాలంలో గడ్చిరోలి, బస్తర్ లలో సాగిన అప్రకటిత యుద్ధంలో డజన్ల మంది కామ్రేడ్స్ అమరులయ్యారు.

రాజ్యం ప్రజా ఉద్యమాన్ని ఎంతమాత్రం సహించదలచుకోలేదన్నది స్పష్టమే. సరిగ్గా అప్పుడే పార్టీ రాజ్యం మీద పోరాటం ఎక్కుపెట్టాలని నిర్ణయం తీసుకుంది. అప్పటినుంచీ రాజ్య బలగాల మీద దాడులు జరపడం మొదలయింది. ఆంధ్రప్రదేశ్ లో రాజ్య బలగాల మీద దాడులు 1987లో మొదలయ్యాయి. దండకారణ్యంలో 1991లో మొదలయ్యాయి. అప్పుడే గెరిల్లా జోన్ అభివృద్ధి చేసే ప్రక్రియ మొదలయింది. పార్టీ విస్తరించాలని నిర్ణయం తీసుకున్నది కూడ ఆ సమయంలోనే. ఆ నిర్ణయం ప్రకారమే 1989లో 15-20 మంది కామ్రేడ్స్ ను మధ్య భారతానికి పంపించడం జరిగింది. 1995లో పార్టీ రెండవ సమావేశం జరిగే సమయానికి రిక్రూట్ మెంట్, మిలీషియా, శత్రువుల మీద దాడులు వంటి అన్ని విషయాలలోను దండకారణ్యంలో పార్టీ అభివృద్ధి విస్తృతంగా జరిగింది. సాంప్రదాయిక తెగపెద్దల కోరలు ఊడిపోయాయి. గ్రామంలోని సమస్యలన్నిటినీ దండకారణ్య ఆదివాసి మజ్దూర్ కిసాన్ సంఘ్ ముందుకు తీసుకురావడం మొదలయింది. ఇది విస్పష్టమైన రూపంలో అధికార మార్పిడికి నిదర్శనం. అటు సాంప్రదాయిక తెగపెద్దల వ్యవస్థ, ఇటు ప్రభుత్వ పంచాయత్ వ్యవస్థ అధికారాన్ని పోగొట్టుకున్నాయి. చివరికి శిస్తు వసూలు కోసం పట్వారీలు కూడ గ్రామాలకు రావడం మానుకున్నారు. అప్పుడిక దండకారణ్య ఆదివాసి మజ్దూర్ కిసాన్ సంఘ్ మాత్రమే ఏకైక క్రియాశీల వ్యవస్థగా మిగిలింది. అధికార వ్యవస్థలో శూన్యం తలెత్తిందని పార్టీ గమనించింది. అంటే ఒక కొత్త శక్తి రాజ్యాధికారాన్ని చేపట్టవలసి ఉంది.

అలా 1994 నాటికి ప్రజా రాజ్యాధికార నిర్మాణాలను రూపొందించాలనే నిర్ణయానికి పార్టీ వచ్చింది. ఆ తర్వాత 1995లో అఖిల భారత ప్రత్యేక సమావేశం జరిగింది. ఆ సమావేశానికి పార్టీ యూనిటీ నుంచి సౌహార్ద ప్రతినిధి బృందం వచ్చింది. అక్కడ రాజ్యాధికార నిర్మాణాలు రూపొందించాలనే నిర్ణయానికి ఆమోదం లభించింది. 1996 నాటికి నూతన ప్రజా రాజ్యాధికారాన్ని నిర్మించే ప్రయత్నాలు మొదలయ్యాయి. వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలు వేగం పుంజుకున్నాయి. అప్పటికి ఈ ప్రాంతంలో ప్రధాన సమస్య అత్యంత వెనుకబడిన వ్యవసాయ పద్ధతి. కనుక జనతన సర్కార్ ఆ సమస్య మీదనే కేంద్రీకరించింది. వ్యవసాయం మీద కేంద్రీకరించాలనే నిర్ణయానికి రావడానికి కారణం మొత్తం బస్తర్ - గడ్చిరోలి ప్రాంతంలో ప్రభుత్వ గణాంకాల ప్రకారమే మొత్తం భూమిలో రెండు శాతానికి మాత్రమే నీటి పారుదల సౌకర్యం ఉండింది. కనుక వ్యవసాయాభివృద్ధికి అవసరమైన చెరువుల నిర్మాణం ప్రారంభించాం. ఇది ప్రజల మధ్య కొత్త ఐక్యత రూపొందడానికి తోడ్పడింది. దీనితో పాటే వినూత్న ప్రక్రియగా సహకార పద్ధతి కూడ మొదలయింది. మూడు నాలుగు కుటుంబాలు కలిసి ఉమ్మడిగా దున్నుకోవడం మొదలుపెట్టాయి. ఇళ్లు కట్టుకునేప్పుడైనా, ఇతర పనులు చేసుకునేప్పుడైనా 11 మందితో కూడిన సమష్టి పని బృందాలు ఏర్పడ్డాయి. వ్యవసాయ కార్యక్రమాలతోపాటు ఈ పని బృందాలు వంట చెరకు సేకరణ వంటి పది, పన్నెండు పనులను సమష్టిగా చేయడం మొదలుపెట్టాయి.

రైతాంగం నుంచి తయారయిన ఈ పని బృందాలు వర్గ దృక్పథం

తోనే నిర్మాణమయ్యాయి. పేద రైతు కుటుంబాలను ధనిక రైతు కుటుంబాలతో కలిపి ఒకే బృందంలో పెట్టినట్టయితే, పేద రైతుల పొలాలు దున్నే సమయం రావాలంటే వర్షాకాలం దాటిపోయి ఉండేది. సమష్టి పని పద్ధతి వారి మధ్య సమష్టి ఐక్యతా భావనను పెంపొందించడానికి ఉపయోగపడింది. ఇప్పుడిక చేతిలో భూమి ఉంది. సాగునీటి సౌకర్యం కూడ ఉంది. దానితో వారి జీవన ప్రమాణాలలో మెరుగుదల కనబడడం మొదలయింది. దానితో పాటుగానే రిక్రూట్ మెంట్ ఎన్నోరెట్లు పెరిగింది.

ప్రజారాజ్యాధికారం సంఘటితమైన తర్వాత, రాజ్యం మళ్లీ జన జాగరణ్ పేరుతో రెండో తెల్ల బీభత్సకాండకు తెగబడింది. బ్రిటిష్ వలసవాదుల తొత్తుగా పనిచేసిన భూస్వామి కొడుకు మహేంద్ర కర్మ 1990-91లో మొదటి తెల్ల బీభత్సకాండకు మాత్రమే కాక 1997లో రెండోసారి కూడ నాయకత్వం వహించాడు. లెనిన్ సరిగ్గా వ్యాఖ్యానించినట్టుగా, పాత భూస్వామ్య ప్రభువుల అధికారానికి బీటలు పడుతున్నప్పుడు, వారు పదిరెట్లు ఎక్కువ శక్తితో, వర్గ శత్రువులుగా విరుచుకు పడతారు. ఇది మేం కళ్లారా చూడగలిగాం. పార్టీ యూనిటీతో విలీనం తర్వాత 2001లో పార్టీ నిర్వహించుకున్న తొమ్మిదో కాంగ్రెస్ లో స్థావర ప్రాంతాల (బేస్ ఏరియా) గురించీ, ప్రజాసైన్యాన్ని నిర్మించడం గురించీ సైద్ధాంతిక స్పష్టత పెరిగింది. సమగ్రమైన సమీక్ష జరిపి గెరిల్లా బేస్ లను నిర్మించాలనే నిర్ణయం తీసుకోవడం జరిగింది. అదే దృక్పథంతో అప్పటికే 2000 డిసెంబర్ 2న ప్రజా గెరిల్లా సైన్యాన్ని రూపొందించి ఉన్నాం. 2001 నుంచి మొట్టమొదటి బేస్ ఏరియా నిర్మాణం గురించి నిర్దిష్టంగా విశ్లేషించుకోవలసి ఉంది. ఈ సమస్య మీద కూలంకషమైన చర్చ, సంభాషణ జరిగాయి. తత్ఫలితంగా గెరిల్లా జోన్ల లోపల గెరిల్లా బేస్ ల నిర్మాణం మొదలయింది. అంటే, భౌగోళిక అవకాశాలను, లభిస్తున్న ప్రజా మద్దతును దృష్టిలో ఉంచుకుని ప్రజా రాజ్యాధికారాన్ని నిర్మించే కృషికి నిర్దిష్ట రూపం ఇవ్వడం జరిగింది. గ్రామాలలో 500 నుంచి 3000 మంది ప్రజలను ఇప్పుడు విప్లవ ప్రజా కమిటీ (రెవల్యూషనరీ పీపుల్స్ కమిటీ) లు గా రూపొందించాం. సైన్యం లేకుండా ప్రజలు తమ రాజ్యాధికారాన్ని నిర్మించుకోజాలరు అనే అవగాహనతోనే ఈపని జరిగింది. ప్రజా సైన్యానికీ, ప్రజా రాజ్యాధికారానికీ సంబంధం ఉంది. ఈ పరిణత అవగాహన మాకు అటు ప్రజా సైన్యాన్ని అభివృద్ధి చేయడంలోను, ఇటు ప్రజా రాజ్యాధికారాన్ని అభివృద్ధి చేయడంలోను ఎంతగానో ఉపకరించింది. గెరిల్లా బేస్ లు ఏర్పాటు చేయడానికి ప్రతి డివిజన్ లో రెండో మూడో స్థలాలు ఎంపిక చేశాం. ఆ విధంగా మొత్తం మీద గెరిల్లా బేస్ లు ఏర్పాటు చేయడానికి 10-12 స్థలాల మీద కేంద్రీకరించాం. కేంద్ర గెరిల్లా బేస్ మాడ్ లో ఉంటుంది.

ఈ నిర్ణయం తర్వాత అమలు చేసే కృషి ప్రారంభమయింది. ఈ దిశలో మొదటి అడుగు గ్రామ స్థాయి విప్లవ ప్రజా కమిటీలను నిర్మించడం. రెండో అడుగు ప్రతి డివిజన్ లోను ఎంపిక చేసిన గెరిల్లా బేస్ ల మీద ఏరియా స్థాయి విప్లవ ప్రజా కమిటీలను నిర్మించడం. అలా 2004 డిసెంబర్ నాటికి మొట్టమొదటి ఏరియా స్థాయి విప్లవ ప్రజా కమిటీ తయారయింది. ఫిబ్రవరి 2005 నాటికి రెండవ ఏరియా స్థాయి విప్లవ ప్రజా కమిటీ తయారయింది. 2005 నుంచి 2008 వరకు అన్ని స్థలాలలోను ఏరియా స్థాయి విప్లవ ప్రజా కమిటీలు ఏర్పడ్డాయి.

ప్రతి డివిజన్ లోను కనీసం మూడు ఏరియా స్థాయి విప్లవ ప్రజా కమిటీలను నిర్మించాలనే పార్టీ నిర్ణయాన్ని అమలు లోకి తెచ్చే క్రమం ప్రస్తుతం నడుస్తోంది. ఇప్పుడిక డివిజన్ స్థాయి సర్కార్ల నిర్మాణం కూడ జరుగుతోంది. మొట్టమొదటి డివిజన్ స్థాయి సర్కార్ 2007 మార్చ్ లో ఏర్పాటయింది. గెరిల్లా బేస్ ల తొలిదశలో, సైనిక నిర్మాణం దానికి తగినట్టుగా, ప్లాటూన్లుగా ఉండేది. ఇప్పుడిక డివిజన్ స్థాయి సర్కార్లు వచ్చాక సైనిక స్థాయిలో కంపెనీలు ఏర్పడ్డాయి. ఈ ప్రక్రియను తీవ్రతరం చేసేందుకు జోనల్ స్థాయి సర్కార్ సన్నాహక కమిటీని ఏర్పాటు చేశాం. జోనల్ స్థాయి సర్కార్ ఏర్పడింతర్వాత, సైనికాభివృద్ధి క్రమంలో భాగంగా బెటాలియన్ ను ఏర్పాటు చేశాం. మొట్టమొదటి బెటాలియన్ 2009 ఆగస్ట్ 10న ఏర్పడింది.

గ్రామ స్థాయిలో జనతన సర్కార్ వయోజన వోటు హక్కు ద్వారా ఏర్పడుతుంది. ఆ పైస్థాయి సర్కార్ లకు ప్రాతినిధ్య ఎన్నికలు ఉంటాయి. ఈ ప్రక్రియ పైన జోనల్ స్థాయి మండలి వరకూ సాగుతుంది. ఆధునిక ప్రభుత్వ పాలనతో పరిమిత అనుభవం ఉన్న ఆదివాసి ప్రజానీకమే దండకారణ్యంలో ఎక్కువగా ఉన్నారని గుర్తు ఉంచుకుని, ఆ అవగాహన కల్పించే లక్ష్యంతో 2008 ఫిబ్రవరిలో మొట్టమొదటి వర్క్ షాప్ నిర్వహించాం. అది చాల ఉపయోగకరమైన అనుభవం. ఇటు పార్టీకీ, అటు ప్రజలకూ కూడ అభిప్రాయాలు, అనుభవాలు స్వేచ్ఛగా పంచుకోవడానికి అవకాశం దొరికింది. మరొక పక్క, ఇంకా పైస్థాయి ప్రజా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు జరిగాయి.

పార్లమెంటరీ ఎన్నికల బహిష్కరణ పిలుపును ఇప్పుడు మరింత క్రియాశీలంగా చేపట్టగలుగుతున్నాం. 2008 నవంబర్లో జరిగిన చత్తీస్‌గడ్ శాసనసభ ఎన్నికలలో, 2009 ఏప్రిల్‌లో జరిగిన 15వ లోకసభ ఎన్నికలలో, 2009 అక్టోబర్‌లో జరిగిన మహారాష్ట్ర శాసనసభ ఎన్నికలలో ప్రజా ప్రభుత్వ నేతృత్వంలో ప్రజలు క్రియాశీలంగా, ఉమ్మడిగా ఎన్నికలను బహిష్కరించారు. ఈ కృషిలో క్రమబద్ధమైన అభివృద్ధిని మేం గమనించగలిగాం. అన్ని విప్లవ ప్రజా కమిటీలు తమ తమ గ్రామాలలో బహిరంగసభలు ఏర్పాటు చేసి ప్రజలకు విషయాలు వివరించాయి. ప్రజలు తమ సొంత ప్రభుత్వాన్ని ఎన్నుకుంటూ ఉండగా అదే సమయంలో బైటి నుంచి వస్తున్న మరొక ప్రభుత్వాన్ని ఎలా ఎన్నుకోగలరు అని వాళ్లు ప్రశ్నించారు. అలా అక్కడి యావత్తు ప్రజానీకమూ నిర్దిష్ట చైతన్యంతో బూర్జువా పార్లమెంటరీ ఎన్నికలను బహిష్కరించారు.

ఈ ప్రజా ప్రభుత్వాలతో సమాంతరంగానే ప్రజా ప్రభుత్వాన్ని పరిరక్షించుకునే ధ్యేయంతో ప్రజా మిలీషియా నిర్మాణం కూడ అభివృద్ధి అయింది. మా సైనిక బలం కూడ పెరుగుతూ వచ్చింది. అందువల్ల సాధారణంగా ప్రతి ఎన్నికల సమయంలోనూ ప్రజల చేత బలవంతంగా వోట్లు వేయించే పారా మిలిటరీ బలగాలను మా పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా ఆర్మీ, ప్రజా మిలీషియా కలిసికట్టుగా బలంగా ప్రతిఘటించాయి. మొత్తం బస్తర్ పోరాట ప్రాంతంలో 2నుంచి 5 శాతం పోలింగ్ మాత్రమే జరిగింది. ఉదాహరణకు, గొగొండలో 700 మంది వోటర్లుండగా ఎన్నికల సమయంలో వెయ్యి మంది పారామిలిటరీ బలగాలను దించారు. ఇన్ని ఏర్పాట్లు చేసినప్పటికీ బూర్జువా పత్రికల ప్రకారమే ఆ ఊళ్లో పది వోట్లు పడ్డాయి. అది కూడ మూడో సారి రిపోలింగ్ జరిగినప్పుడు. ఈ సంఘటనతోనే ఈ ప్రాంత ప్రజానీకానికి బూర్జువా పార్లమెంటరీ ఎన్నికలు ఎంత అర్థరహితమైనవో తేటతెల్లమవుతుంది. ఇలా ఒకవైపు ప్రజాప్రభుత్వం రాజ్యాధికారాన్ని చేపడుతుండగా, మరోవైపు బూర్జువా పార్లమెంటరీ ఎన్నికలను తిరస్కరిస్తున్నాం. కాశ్మీర్ మినహాయిస్తే ఇంతగా అతి తక్కువ పోలింగ్ జరిగిన ప్రాంతం, ఎన్నికల బహిష్కరణ ఇంతగా విజయవంతమైన ప్రాంతం ఇది ఒక్కటే. ఇది కచ్చితంగా రాజ్యానికి వణుకు పుట్టించింది.

ఇక రిక్రూట్‌మెంట్‌కు సంబంధించి కూడ, పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా

ఆర్మీ 2001 నుంచీ రిక్రూట్‌మెంట్ కార్యక్రమం సాగిస్తోంది. ఇప్పుడిక జనతన సర్కార్లు అధికారంలోకి వచ్చాయి గనుక, రిక్రూట్‌మెంట్ చేసే బాధ్యతను విప్లవ ప్రజా కమిటీలకు అప్పగించాం. ప్రజా సైన్య నిర్మాణమనేది ప్రజా ప్రభుత్వ బాధ్యతే గదా. ఇప్పుడు ప్రజా సైన్యంలో చేరడానికి ప్రోత్సాహం గ్రామస్థాయిలోనే దొరుకుతోంది. ఉదాహరణకు 2008 డిసెంబర్ లో గంగలూరులో అక్కడి ఏరియా విప్లవ ప్రజా కమిటీ రెండు ప్రదేశాల్లో పదివేల మందికి పైగా పాల్గొన్న రెండు పెద్ద బహిరంగ సభలు నిర్వహించింది. అక్కడ వేదిక మీది నుంచే ఏరియా విప్లవ ప్రజా కమిటీ అధ్యక్షుడు పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా సైన్యంలో చేరమని సభికులకు పిలుపు ఇచ్చాడు. ఈ రెండు బహిరంగసభల నుంచే దాదాపు 100 మంది యువకులు పిఎల్‌జిఎ లో చేరడానికి సంసిద్ధత వ్యక్తం చేశారు. వారిని పరీక్షించిన తర్వాత పార్టీ వారిలోంచి 60–65 మందిని చేర్చుకుంది.

ఇప్పుడు దండకారణ్యంలోని అభివృద్ధి కార్యక్రమాలన్నీ ప్రజా ప్రభుత్వ, అంటే జనతన సర్కార్ బాధ్యతే. జనతన సర్కార్ ఇప్పుడు ప్రజల సమస్యలను పరిష్కరించడం పైనే కేంద్రీకరిస్తోంది. బూర్జువా పార్లమెంటరీ ప్రభుత్వం బలహీనం కావడంతో పాటే ప్రజా ప్రభుత్వం బలోపేతం కావడం కూడ జరుగుతోంది. విప్లవ ప్రజా కమిటీలలో మొదట ఏడు శాఖలు ఉండేవి. వాటికి అదనంగా వాణిజ్యం – పరిశ్రమల శాఖ, ప్రజా సంబంధాల శాఖలను కూడ కలపడం జరిగింది. ప్రజా ప్రభుత్వంలో మహిళల భాగస్వామ్యం పెరగడానికీ, మహిళలకు పాలనలో 50 శాతం భాగస్వామ్యం ఉండేలా చూడడానికీ చర్యలు తీసుకుంటున్నాం. ఈ దిశగా మా కృషి ఇంకా సాగుతోంది. చెప్పుకోదగినంత అభివృద్ధి సాధించలేకపోతున్నాం. మహిళా భాగస్వామ్యాన్ని విస్తరించడానికి ప్రయత్నిస్తున్నాం. విప్లవ ప్రజా కమిటీలో ప్రతి ఒక్క శాఖ ఒక్కొక్క ప్రత్యేక రంగంలో పనిచేస్తుంది. ప్రధానంగా వ్యవసాయ, విద్యా, సాంస్కృతిక, వైద్య శాఖలు అభివృద్ధి దిశలో శక్తిమంతంగా పనిచేస్తున్నాయి. ఈ దశలో ప్రస్తుతం మేం ప్రజల నుంచి పన్నులు వసూలు చేయడం లేదు. నాలుగు వర్గాల ఐక్యత ప్రాతిపదికగా మాతో ఉన్న మధ్య తరగతి నుంచి, పెటీ బూర్జువా వర్గం నుంచి వ్యవసాయాభివృద్ధి కోసం, వైద్య సహాయం కోసం, పాఠశాలల నిర్మాణం కోసం పన్నులు వసూలు చేస్తున్నాం. ప్రస్తుతానికి మేం ప్రజల నుంచి నిధి సేకరణ మీదనే ఆధారపడుతున్నాం. అది వ్యవసాయోత్పత్తి నుంచి, అటవీ ఉత్పత్తుల నుంచి కనీస స్థాయిలో వసూలు చేయగా పోగుపడిన నిధి. ఇక రక్షణ శాఖ విషయంలో, అంటే ప్రజా మిలీషియా అవసరాలు తీర్చడం, ఫ్లాష్ లైట్, తుపాకి మందు, విల్లు, బాణాలు, వగైరా మౌలిక రక్షణ సామగ్రి సమకూర్చడం ప్రజా ప్రభుత్వ బాధ్యతే. మేం యుద్ధం మధ్య ఉన్నాం. కనుక ప్రజల రక్షణ కోసమూ, జనతన సర్కార్ ను పరిరక్షించుకోవడం కోసమూ మేం రక్షణ శాఖ మీద, ప్రజా మిలిషియా మీద కేంద్రీకరిస్తున్నాం.

ముఖియాల సాంప్రదాయిక అధికారాలూ, ప్రభుత్వపు పంచాయత్ వ్యవస్థా వెనక్కి తగ్గుతున్న కొద్దీ ప్రజాధికారం విస్తరిస్తోంది. ఈ రెండు అధికారాల మధ్య ఘర్షణ అనివార్యం. 1997లో మహేంద్ర కర్మ రాజ్యపు పూర్తి వత్తాసుతో గ్రామపెద్దల పక్షం వహించాడు. ఆ తెల్ల బీభత్సకాండలో ఎంతో మంది స్థానిక కామ్రేడ్స్ చిత్రహింసలకు గురయ్యారు. ఎన్నో ఇళ్లు తగులబెట్టబడ్డాయి. ప్రజలను లొంగిపొమ్మని బహిరంగంగా బెదిరింపులు సాగాయి. ఉదాహరణకు మా స్థానిక కామ్రేడ్లలో ఒకరిని బహిరంగంగా ఒక బహిరంగ సభ ముందే చంపేశారు. భయభీతావహం సృష్టించారు.

మేం దళాల స్థాయిలో కూడ సైనిక బలగాన్ని తయారు చేసి ప్రజా శత్రువుల మీద చర్యలు తీసుకున్నాం. క్రూరుడూ, ప్రజా కంటకుడూ అయిన వెదిరె గ్రామ పెద్ద మాసాను ప్రజాశత్రువుగా గుర్తించి తొలగించాం. ఈ రకంగా ప్రత్యేకంగా గుర్తించిన కొందరికి మరణశిక్ష వేశాం. దానితో ఇతరులు ప్రజాశత్రువులుగా ఉండడానికి వెనుకాడారు. కొందరు ప్రజల ముందు లొంగిపోయారు. ఈ దశ 6–8 నెలలు సాగింది.

అదేవిధంగా 1997లో జరిగిన రెండో తెల్ల బీభత్సకాండను కూడ అభివృద్ధి నిరోధక శక్తులు పూర్తి రాజ్య సహకారంతోనే ప్రారంభించాయి. అప్పుడు కూడ కొందరిని ఎంచుకుని శిక్షించడం జరిగింది. మిగిలిన వాళ్లందరినీ ప్రజల ముందు నిలబెట్టినపుడు వారిలో చాల మంది లొంగిపోయారు.

అయితే, 2005 జూన్ 5న సల్వాజుడుం పేరిట మొదలైన దాడి అంతకు ముందరి రెండు తెల్ల బీభత్సకాండల కన్న కూడ విస్తృతి లోనూ, పరిధిలోనూ గుణాత్మకంగా భిన్నమైనది. గతంలోని రెండు జన జాగరణ్ కార్యక్రమాలను ప్రధానంగా స్థానిక స్థాయిలోనే నడపగా, సల్వాజుడుం మాత్రం స్థానిక, రాష్ట్ర, కేంద్ర స్థాయిలో సమన్వయ ప్రణాళికలో భాగంగా జరిగింది. స్థానిక స్థాయి సల్వాజుడుం హంతక మూకలతో రాష్ట్ర పోలీసులను, కేంద్ర పారా మిలిటరీ బలగాలను కలిపి ఇంకా ఎక్కువ దీర్ఘకాలిక లక్ష్యంతో ప్రజల మీదికి వదలడం జరిగింది. 2004లో పార్టీ విలీనం తర్వాత ప్రజా ఉద్యమం అభివృద్ధి చెంది బలోపేతం కావడంతో రాజ్యానికి పార్టీయే ప్రధాన లక్ష్యంగా మారింది. సరిగ్గా ఆ సమయంలోనే ప్రధాని మన్మోహన్ సింగ్ మావోయిస్టు పార్టీని దేశంలో ఏకైక అతి పెద్ద ప్రమాదంగా అభివర్ణించాడు. అంటే వికసిస్తున్న ప్రజా రాజ్యాధికారాన్ని అణచివేయడానికి ఉద్దేశపూర్వక, సమన్వయపూరిత, ప్రణాళికాబద్ధ దాడే సల్వాజుడుం.

2005 జూన్ 5 నుంచి డిసెంబర్ దాకా ఈ భయోత్పాతం పెద్దఎత్తున సాగింది. ప్రత్యేకించి బైరామ్‌గఢ్, బిజాపూర్ రెండు బ్లాకులను ఎంచుకుని, కేంద్రీకరించి భయభీతావహాన్ని వ్యాపింపజేశారు. ఆ క్రమంలో 644 గ్రామాలలో విధ్వంసం సృష్టించారు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే మూడు లక్షల మంది ఆదివాసులు నిర్వాసితులయ్యారు. వారిలో కేవలం 60 వేల మంది లెక్క మాత్రమే దొరికింది. వారిని సహాయ శిబిరాలు అని ముద్దుపేరు పెట్టిన నిర్బంధ శిబిరాలలో బందీలుగా ఉంచారు. మిగిలిన వారికి ఏం జరిగిందో ఇప్పటికీ ప్రభుత్వం చెప్పడం లేదు. వారిలో అత్యధిక సంఖ్యాకులు మాతో ఉన్నారు. అదంతా ఒక భయానకమైన విధ్వంస కార్యక్రమం. బలవంతాన నిర్బంధ శిబిరాలలోకి తోలుకుపోబడిన వారు అక్కడ దారుణమైన బతుకు ఈడుస్తున్నారు. తమ గ్రామాలకు తిరిగి వెళ్లే సాహసం చేసిన వారు ఎక్కువగా అడవిలోనే నివసించవలసి వస్తోంది. గ్రామాలలో ఉంటే నిర్విచక్షణాపూరితమైన లూటీలు, హత్యలు, అత్యాచారాలతో కూడిన ఫాసిస్టు నిర్బంధానికి గురి కావలసి వస్తోంది.

మేం మొదట ఫాసిజం గురించి మాట్లాడినప్పుడు నిజంగా దాని అర్థమేమిటో ప్రజలకు తెలిసేది కాదు. కాని సల్వాజుడుం మొదలయిన తర్వాత, నిర్బంధాన్ని అనుభవించిన తర్వాత, ఫాసిజం అంటే ఏమిటో వాళ్లు తెలుసుకోగలిగారు. ఈ భయోత్పాతాన్ని ప్రతిఘటించే ప్రయత్నాలను పార్టీ కూడ ప్రారంభించింది. 2006 జనవరి నుంచీ సల్వాజుడుంకు వ్యతిరేకంగా నిర్దిష్ట, ప్రణాళికాబద్ధ కార్యక్రమం ప్రారంభించాం. అందులో భాగంగా పిఎల్ జి ఎ అభివృద్ధి నిరోధకుల మీద ఎక్కుపెట్టి దాడులు చేయడం మొదలుపెట్టింది. దానితో పాటుగానే దేశవ్యాప్తంగా సానుకూల పరిణామాలు సంభవించాయి. ఆ దశలో ప్రజాస్వామిక శక్తులు చాలవరకు సహకరించాయి. సల్వాజుడుంకు వ్యతిరేకంగా పార్టీ తన కార్యక్రమం సాగిస్తుండగానే, సల్వాజుడుం ఒక స్వతంత్ర, యాదృచ్ఛిక ప్రజా ఉద్యమమని చూపేందుకు రాజ్యం చేసిన ప్రయత్నాలు దాని ప్రజాస్వామిక స్వభావపు రంగును బయటపెట్టాయి.

నక్సలిజాన్ని ఎదుర్కొనే శక్తిమంతమైన సాధనంగా సల్వాజుడుం గురించి రాజ్యం చాలకాలంగా ప్రచారం చేస్తోంది. ఈ వాదనను దేశవ్యాప్తంగా బలంగా సవాల్ చేయడం జరిగింది. ఇది ఆదివాసుల మనుగడ కోసం సాగుతున్న యుద్ధం. మనుగడ కోసమే మిలీషియాలో చేరమని పార్టీ స్పష్టంగానే ఆదివాసులకు పిలుపునిచ్చింది. ఒక సముచిత నిర్మాణ రూపంగా కోయ భూంకాల్ మిలీషియా ఆవిర్భవించింది. 2006 ఫిబ్రవరి 10న ఆవిర్భవించిన ఈ మిలీషియాకు స్ఫూర్తి 1910లో జరిగిన భూంకాల్ తిరుగుబాటు. ఇవాళ జీవితం కోసం, మనుగడకోసం, సల్వాజుడుంకు వ్యతిరేకంగా పోరాడేందుకు వేలాది మంది ఈ మిలీషియాలో చేరుతున్నారు. ప్రజలు, ప్రజా విముక్తి గెరిల్లా సైన్యం, పార్టీ, ప్రజా సంఘాలు, జాతీయ అంతర్జాతీయ స్థాయిలో ప్రచార కార్యక్రమాలు అన్నీ కలిసి ఒక మహా ఉద్యమ రూపం ధరించాయి. ఇందుకు దేశంలోని ప్రజాస్వామిక శక్తులన్నిటికీ పార్టీ కృతజ్ఞతలు తెలుపుతోంది. చివరికి సల్వాజుడుం అస్తిత్వాన్ని అధికారికంగా మే-జూన్ 2006 నుంచి నిలిపి వేశారు.

సల్వాజుడుం అనేది ఈ ప్రాంతపు సహజ వనరులను దోపిడీ చేయదలచిన రాజ్యపు సొంత సృష్టి. 2004లో భారతీయ జనతాపార్టీ అధికారంలోకి వచ్చాక 2005 నాటికే వందలాది ఒప్పందాలు కుదిరాయి. ఉదాహరణకు టెక్సాస్ పవర్ జనరేషన్ కంపెనీ చత్తీస్‌గడ్‌లో 500 కోట్ల రూపాయల పెట్టుబడి పెట్టింది. లోహండిగూడలో టాటా, బన్సీలో జిందాల్ విస్తారంగా భూములు సేకరించి పెట్టుకున్నారు. అంతిమంగా ఇది ఆదివాసుల ఉనికికి సంబంధించిన ప్రశ్న. 1970లో ప్రారంభమైన బైలదిల్లా గనుల అనుభవమే చూస్తే ఆ గనులు జపాన్‌కు లాభాలు చేకూరుస్తూ, ఆదివాసి జీవనాన్నీ సంస్కృతినీ నిరంతరాయంగా ధ్వంసం చేస్తున్నాయి. ఇలా సహజ వనరులను ఆక్రమించే విధానమే ఆదివాసి సమూహాలకు అతి పెద్ద ప్రమాదం. మన్మోహన్ సింగేమో మావోయిస్టులు అతిపెద్ద ప్రమాదమని అంటాడు గాని, ఆదివాసుల ఉనికికి, సహజ వనరులకు సంబంధించినంతవరకు ఈ దోపిడీయే నిజమైన అతిపెద్ద ప్రమాదం. అందుకే ప్రజలు పెద్ద సంఖ్యలో కదిలారు. సల్వాజుడుంను ప్రతిఘటించారు. ప్రభుత్వ బలగాల మీద దాడులు చేశారు. ఈ ప్రాంతంలో అణచివేత కోసం నాగా, మిజో బెటాలియన్లను మోహరించడాన్ని నాగాలాండ్, మిజోరాం ప్రజలు కూడ నిరసించారు.

అలా 2007, 2008 నాటికి ప్రభుత్వ బలగాల మానసిక స్థైర్యం దెబ్బతిన్నదని మేం గమనించాం. చివరికి 2009 అక్టోబర్‌లో చిదంబరం, మహేంద్ర కర్మ, ఇతర సల్వాజుడుం నిర్మాతలు సల్వాజుడుంను రద్దు చేస్తున్నట్టు బహిరంగ ప్రకటనలు ఇవ్వవలసి వచ్చింది. కాని ఇలా తన బీభత్సకాండ విఫలమయ్యేసరికి, రాజ్యం తన అణచివేత బలగాలన్నిటినీ సమీకరించి, మరొకసారి దాడి చేయడానికి, ప్రజల మీద ఒత్తిడిని పెంచడానికి ప్రయత్నాలు ప్రారంభించింది. ఈసారి ఈ బీభత్సకాండ పేరు ఆపరేషన్ గ్రీన్‌హంట్. సల్వాజుడుంలో 18 నుంచి 20 వేల మంది బలగాలు ఉండగా, ఇవాళ దాదాపు లక్షమంది భద్రతా బలగాలను ప్రజల మీదికి మోహరించారు. సల్వాజుడుం సమయంలో స్పెషల్ పోలీస్ ఆఫీసర్ (ఎస్‌పిఒ) అని పేరున్న వాళ్లను ఇప్పుడు కోయ కమాండోలు అంటున్నారు. అంటే ఆపరేషన్ గ్రీన్‌హంట్ అనేది సల్వాజుడుంకు మరింత తీవ్రతరమైన కొనసాగింపే తప్ప మరొకటి కాదు. ఇటువంటి భయోత్పాత బీభత్స కార్యక్రమాలు దండకారణ్య ప్రాంతానికి మాత్రమే పరిమితమైనవి కావు, జార్ఖండ్ బీహార్‌లలో సేంద్ర వంటి హంతక బలగాలున్నాయి.

మొత్తానికి లాల్‌గడ్ నుంచి సూరజ్‌గడ్ వరకూ, అపారమైన సంపదలు, సహజ వనరులు ఉన్న యావత్తు ఆదివాసి ప్రాంతమూ, రెడ్ కారిడార్ అని ప్రచారం చేస్తున్నారు గాని నిజానికి అది ఖనిజాల కారిడార్. ఈ ప్రాంతంలో ప్రజా రాజ్యాధికారం విస్తరిస్తున్నది గనుక ఈ వనరులు దోచుకోలేమని వాళ్లు భయపడుతున్నారు. అందుకే ఈ ప్రాంతం మీద ఒక బీభత్సకాండ తర్వాత మరొక బీభత్సకాండ అమలు జరుపుతున్నారు. సల్వాజుడుం విఫలమయిన తర్వాత అందుకే ఆపరేషన్ గ్రీన్‌హంట్ వచ్చింది. ముగింపుగా చెప్పాలంటే, తెల్ల బీభత్సం 1990-91లో మొదలయింది. దాని తర్వాత ప్రజా ప్రభుత్వాలు స్థాపించాలని మేం నిర్ణయించుకున్నాం. ఆ తర్వాత 1997లో రెండో తెల్ల బీభత్సం సాగింది. దాని తర్వాత విప్లవ ప్రజా కమిటీలను ఏర్పాటు చేసి ప్రజా రాజ్యాధికారాన్ని సంఘటితం చేసే నిర్దిష్ట చర్యలు ప్రారంభించాం. ఆ తర్వాత సల్వాజుడుం వచ్చింది. దాని తర్వాత మేం ఏరియా స్థాయికి విస్తరించాం. ఇన్ని సంవత్సరాల ప్రయాణంలో మేం సైనికంగా ప్లాటూన్ల నుంచి కంపెనీలకు సాగివచ్చాం. కంపెనీల నుంచి బెటాలియన్ల ఏర్పాటు వైపు సాగిపోతున్నాం.

**మహిళా సమస్య గురించి:** మైదాన ప్రాంతాలలో లాగనే ఆదివాసి సంప్రదాయంలో కూడ స్త్రీలు చాల ఇబ్బందులను, ఒత్తిడిని అనుభవించే వారు. హిందూ సంప్రదాయ శక్తులు ఆదివాసి సమాజంలోకి పూర్తిగా చొరబడనప్పటికీ, కొన్ని పీడనా రూపాలు మాత్రం ఉన్నాయి. ఉదాహరణకు చాల ప్రాంతాలలో స్త్రీలు పెళ్లి అయిన తర్వాత రవిక తొడుక్కోవడం నిషేధం. అలాగే ఒళ్లంతా పచ్చబొట్లు పొడిపించుకునే అలవాటు ఉంది. కాని ఉద్యమం విస్తరించినకొద్దీ కొత్త తరం ఈ అలవాట్లను మానేస్తోంది. మొత్తం మీద ఆదివాసులలో పురుషుల కన్న స్త్రీలు ఎక్కువ పనిచేస్తారు. నాగలి దున్నడంలో సహాయపడడంతో పాటు వంటపని, పిల్లల పెంపకం, అటవీ ఉత్పత్తుల సేకరణ వంటి పనులన్నీ స్త్రీలవే. అందువల్ల వారి భాగస్వామ్యం, మద్దతు చాల ఎక్కువ. అలాగే బలవంతపు వివాహాల వంటి చెడు సంప్రదాయాలు, సామాజిక చెడుగులు ఉనికిలో ఉన్నాయి.

కొన్ని ప్రాంతాలలో గత శతాబ్ది చివరి వరకూ కూడ గోతుల్ వంటి సంప్రదాయాలు అమలులో ఉండేవి. ఈ సంప్రదాయం ప్రకారం యువతీ యువకులు సాయం సమయాలలో విశృంఖల లైంగిక సంబంధాలలోకి వస్తారు. పార్టీ ఈ ప్రాంతంలో పనిచేయడం మొదలుపెట్టిన తర్వాత 1986 నాటికి ఎన్నో మహిళా సంఘాలను సంఘటితం చేయడం జరిగింది. 1991లో డివిజనల్ స్థాయి క్రాంతికారి ఆదివాసి మహిళా సంఘాలు ఉనికిలోకి వచ్చాయి. ఈ ప్రాంతంలో మహిళలే అతి ఎక్కువ పీడనకు గురి అవుతున్న సమూహం గనుక వారే సంఘటితం కావడానికి ఎక్కువ ఆసక్తి చూపారు. పిఎల్‌జిఎలోనూ, పార్టీలోనూ ఇప్పటికే 40 శాతం స్త్రీల భాగస్వామ్యం ఉంది. లక్ష మంది కన్న ఎక్కువ సభ్యులు ఉన్న క్రాంతికారి ఆదివాసి మహిళా సంఘం, కాశ్మీర్‌లోని దక్తరి మిల్లత్ లాగ, దేశంలోకెల్లా ఎక్కువమంది సభ్యులు ఉన్న క్రియాశీల ప్రజాసంఘం అని చెప్పవచ్చు. స్త్రీలు పార్టీ మీద పూర్తి నమ్మకం ఉంచుతున్న కొద్దీ, ఉద్యమం మహిళలకు ఎక్కువ రాజకీయాధికారాన్ని సంతరించే దిశగా ముందుకు సాగింది. బలవంతపు పెళ్లిళ్ల వంటి ఆచారాలకు అడ్డుకట్ట పడింది. ఇవాళ ఇక్కడ స్త్రీలు ఆత్మగౌరవంతో జీవిస్తున్నారని చెప్పవచ్చు. తమకు ఏదైనా సమస్య వస్తే వెళ్లి చెప్పుకోవడానికి పిఎల్‌జిఎ, పార్టీ ఉన్నాయనే విశ్వాసం వారిలో పెరిగింది. ఈ మార్పులతో పాటు, స్త్రీలకు ఎక్కువ రాజకీయాధికారం ఇచ్చే కృషి ముందుకు సాగుతోంది.

అభివృద్ధి నిరోధకులు, భద్రతా బలగాలు స్త్రీల మీద లైంగిక దోపిడీని, అత్యాచారాలను నిర్బంధ సాధనంగా ఉపయోగించారు. కాని స్త్రీలు తమ విప్లవ పాత్రలలో లేచి నిలిచి, ఆ దాడిని అడ్డుకున్నారు. వారు తమ కొడుకులనూ కూతుళ్లనూ పార్టీలోకి పంపి, కుటుంబాలు గడవడానికి కష్టాలు పడడం మాత్రమే కాదు, స్వయంగా తామే పార్టీ పనులలోనూ,

ఇతర పోరాటాలలోను చురుకుగా పాల్గొన్నారు.

**ప్రశ్న:** చెడు ప్రభావాలు ఉన్నప్పటికీ, అవన్నీ పాత సంప్రదాయాలు, ఆచారాలు గనుక వాటితో సున్నితంగా వ్యవహరించవలసి వస్తుంది. మీరు సంప్రదాయాల స్వతంత్ర ప్రతిపత్తిని భగ్నం చేయకుండా వాటితో ఎలా వ్యవహరించారు?

**జవాబు:** ఇది చాల ముఖ్యమైన ప్రశ్న. ఇటువంటి సమస్య వచ్చినప్పుడల్లా పార్టీ తన పనిని ఆత్మవిమర్శనాత్మకంగా సమీక్షించుకుని, వెంటనే ప్రజలకు క్షమాపణ చెప్పింది. ఉదాహరణకు, బహిష్టు సమయంలో స్త్రీలను ఊరి బయట ఉంచే ఆచారం ఒకటి ఉంది. ఒక గ్రామంలోని క్రాంతికారీ ఆదివాసి మహిళా సంఘం ఈ ఆచారాన్ని మాన్పించాలని, బహిష్టు సమయంలో కూడ స్త్రీలు ఊళ్లోనే ఉండేట్టు చూడాలని నిర్ణయించింది. ఇది గ్రామస్తుల కోపానికి దారి తీయడంతో సంఘం తన నిర్ణయాన్ని పునరాలోచించుకుని వెనక్కి తీసుకుంది. మేం మా తప్పుల నుంచి నేర్చుకున్నప్పుడల్లా క్షమాపణలు కోరుకున్నాం.

ఇక గోతుల్ లైంగిక సంబంధాల విషయానికి వస్తే, ఆదివాసి ఆచారాలు, సంస్కృతి కూడ ఈ 21 శతాబ్దంలో అంతే స్వచ్ఛంగా, శుద్ధంగా ఉన్నాయని చెప్పలేం. మార్కెట్ చొరబాటు, తత్ఫలితమైన దోపిడీ కూడ ఒక వాస్తవమే. ఈ రోజుల్లో ఆదివాసి సంప్రదాయాలను అవకాశంగా తీసుకుని బైటినుంచి వచ్చినవాళ్లు ఆదివాసి స్త్రీలను దోపిడీ చేయడానికి వీలుంది. ఆ బహిరాగతులు ఎటువంటి బాధ్యత తీసుకోకపోగా, ఆదివాసి స్త్రీలు గర్భం ధరించిన ఘటనలు ఎన్నో ఉన్నాయి. బైటి ప్రభావాల వల్ల, ఆదివాసుల శుద్ధ ఆచారాలు కూడ తప్పుడు రూపాలు పొందాయి. అందువల్లనే వేలాది మంది ఆదివాసి స్త్రీలు తిరుగుబాటు జెండా ఎత్తారు. ఈ సంప్రదాయాన్ని ఖండిస్తూ దాదాపు ఐదువేల మంది మహిళలు పాల్గొన్న ప్రదర్శనలు ఎన్నో జరిగాయి. వెంటనే పార్టీ జోక్యం చేసుకుంది. ఈ సమస్య మీద చర్చలు, సంప్రదింపులు జరిపి, చివరికి ఈ ఆచారాన్ని నిలిపి వేసింది. అంటే సాంప్రదాయిక ఆచారాల విషయంలో మనం చాల ఓపికతో వ్యవహరించాలి. ప్రజల చైతన్యస్థాయిని, విద్యా స్థాయిని పెంచడానికి కృషి చేయాలి.

ఉదాహరణకు, ఇక్కడ ఇంటి పేర్లకు చాల ప్రాధాన్యత ఇచ్చే అలవాటు ఉంది. ఒక ఇంటి పేరు గల వాళ్లు ఒకే దేవతను పూజిస్తారు గనుక, వారిలో వారు పెళ్లి చేసుకోవడం పూర్తిగా నిషిద్ధం. ఆఫ్రికన్ ఆదివాసి తెగల గురించి ఎంగెల్స్ చేసిన విశ్లేషణకు ఇది స్థూలంగా సరిపోతుంది. ఇద్దరు మడావిలు కలుసుకున్నారంటే వెంటనే వారి మధ్య సోదర స్ఫూర్తి తలెత్తుతుంది. పార్టీలోపల ఇది ఇబ్బందికరమైన పరిస్థితికి దారితీసింది. ఒకే ఇంటిపేరు ఉన్న ఇద్దరు కామ్రేడ్స్ ప్రేమించుకున్నారు. సాధారణంగా మనలాంటి పరిస్థితులే ఉన్న చైనాలో ఈ సమస్యను ఎలా పరిష్కరించారో చూడడానికి చైనా రాజ్యాంగం చూస్తే అటువంటి పెళ్లిని ఐదు తరాల తర్వాత ఆమోదించవచ్చునని ఉంది. కాని మేం అంత సంఘటితంగా, సువ్యవస్థితంగా లేం. చైనా నేపథ్యం పూర్తిగా ఇవాళ్టి మన స్థితికి సరిపోయేదీ కాదు. అప్పటికింకా విప్లవ ప్రజా కమిటీలు కూడ ఏర్పడ లేదు. ఇది చాల ఇబ్బందికరమైన ఘట్టం. అక్కడ నిర్ణయం మొత్తంగా ఆదివాసి సమూహాన్ని దూరం చేయగల శక్తి గలది. మేం ఆ సమస్యను మొత్తం పార్టీలోనూ, ప్రజలతోనూ చర్చించి, వెలువడిన అభిప్రాయాల మేరకు ఆ ప్రేమను అంగీకరించలేదు.

ఈ ప్రాంతంలో పెళ్లి సమయంలో చాల ఎక్కువగా, దుబారాగా ఖర్చు చేయడం, అదే హోదాకు చిహ్నం అని అనుకోవడం ఒక ఆచారంగా ఉండేది. ఇది వృథా ఖర్చు మాత్రమే కాక, ఆర్థిక పతనానికి కారణమయ్యేది. అందువల్ల పెళ్లి తతంగాన్ని రెండు మూడు రోజులు కొనసాగించే బదులు ఒక్కరోజులో ముగించేయాలని పార్టీ ఆదేశించింది. అంతేకాదు, ఆదివాసులలో ప్రతి ఆహార పదార్థానికీ, కూరగాయలయినా, మక్క అయినా, ఇప్పపువ్వు అయినా పండుగలు జరిపే ఆచారం ఉంది. దీనితో ఉత్పత్తి దెబ్బతినిపోతుండేది. అందువల్ల పార్టీ ఆ ప్రాంతంలోని పూజారులందరినీ పిలిచి, ఈ సమస్యను ఎలా పరిష్కరించాలో సూచనలు ఇమ్మని కోరింది. సాంప్రదాయిక పూజారులు బాగా స్పందించి సహకరించారు. సంవత్సరానికి ఆరు ప్రధాన పండుగలు జరిపితే చాలన్నారు. అలాగే ఆదివాసుల సాంప్రదాయిక వైద్య పరిజ్ఞానం మూఢాచారాలతో కలగలిసి ఉండేది. ఇప్పుడు జనతన సర్కార్‌లోని వైద్య శాఖ ఆదివాసుల వైద్య పరిజ్ఞానాన్ని ఉపయోగించుకుని ఔషధ మొక్కలను సేకరించి గొప్ప జ్ఞాననిధిని తయారు చేస్తోంది. మనం ఎల్లవేళలా గుర్తుంచుకోవలసిందేమంటే ప్రజల విశ్వాసాన్ని చూరగొనడం విద్య ద్వారా, చైతన్యం ద్వారా జరగవలసిందే తప్ప బలప్రయోగం ద్వారా జరగదు.

**ప్రశ్న:** యుద్ధమే అనివార్యమైతే, అంటే రాజ్యం ఈ సహజ వనరులను కొల్లగొట్టడానికి ప్రజా రాజ్యాధికారాన్ని కాలరాయదలచుకుంటే, ఈ యుద్ధం నుంచి రాజ్యాన్ని వెనక్కి నెట్టదలచిన పౌర హక్కుల సంస్థల పాత్ర ఏమిటి?

**జవాబు:** పౌరహక్కుల సంస్థలు ఉజ్వలమైన స్థాయికి ఎదిగాయి. ముఖ్యంగా ఎమర్జెన్సీ తర్వాత, 1977 తర్వాత ఈ దేశంలో అవి గొప్ప పాత్ర నిర్వహించాయి. ఐతే కాలం గడుస్తున్న కొద్దీ దేశంలో ప్రజా ఉద్యమ స్వభావం మారుతోంది. ప్రజా పోరాటాలు, రాజ్య నిర్బంధం కూడ వేగంగా మారిపోతున్నాయి. దేశంలో ఇవాళ్టి మారిన పరిస్థితిలో బలంగా జోక్యం చేసుకుని అర్థవంతమైన సహకారం అందించాలంటే, పౌరహక్కుల సంస్థలు కూడ ఈ మారుతున్న పరిణామాలకు తగినట్టుగా తమ అభిప్రాయాలను, అవగాహనలను మార్చుకోవలసి ఉంది. వారు ఈ దిశగా మారేందుకు మేం కూడ వారి మధ్య పెద్ద ఎత్తున పని చేయవలసి ఉంది. ప్రస్తుతం ప్రజాస్వామిక బృందాలలో ఒక ముఖ్యమైన సమస్య చర్చకు వస్తోంది. అది అభివృద్ధి నమూనాకు సంబంధించిన సమస్య. నిజమైన ప్రజాస్వామిక వాదులు ప్రజా అభివృద్ధి నమూనా గురించి మాట్లాడుతుండగా, ఇతరులు సామ్రాజ్యవాద, పాలకవర్గ అభివృద్ధి నమూనా గురించి మాట్లాడుతున్నారు. వారు నిజమైన ప్రజాస్వామిక వాదులు కారని నా అభిప్రాయం. మేం మా పనులు సక్రమంగా చేస్తే మా ఉద్యమం నిజమైన ప్రజాస్వామిక వాదులందరినీ ఆకర్షించగలుగుతుందనే నా అభిప్రాయం. ఇది వారికి కూడ పరీక్షా సమయమే. తమ చైతన్యాన్ని పెంచుకునేవారు ప్రజల పక్షాన నిలబడతారు. లేకపోతే తలకిందులు అవుతారు.

**ముగింపు:** ప్రతిచోటా పార్టీ నాయకత్వం, పిఎల్‌జిఎ కామ్రేడ్స్, ప్రజలు ఆర్ద్రమైన వీడ్కోలు సమావేశాలు ఏర్పాటు చేశారు. కామ్రేడ్ యాన్ మిర్డాల్ ఆరోగ్యంగా ఉండాలని, దీర్ఘకాలం జీవించాలని ఆకాంక్షించారు. కామ్రేడ్స్ యాన్ మిర్డాల్, గౌతమ్ నవ్లాఖాలకు అభినందనలు తెలిపారు. వాళ్లిద్దరూ కూడ తమ పని విజయవంతంగా పూర్తి కావడానికి సహకరించిన కామ్రేడ్స్ అందరికీ కృతజ్ఞతలు తెలిపారు. వీ

**వీక్షణం కార్యాలయంలో ఫిబ్రవరి 2న యాన్ మిర్డాల్‌తో జరిగిన ఇష్టాగోష్టి నివేదిక వచ్చే సంచికలో**

*మానవ చరిత్ర పరిణామ క్రమంలో గ్రామాల పుట్టుక, పెరుగుదల, రాజకీయార్థిక పరిణామాలనూ, గ్రామాల అధ్యయనాల చరిత్రనూ వివరిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

# గ్రామాల అధ్యయనాల చరిత్ర - 1

వర్తమాన రాజకీయార్థిక, సామాజిక వాతావరణంలో గ్రామాల అధ్యయనం ఎంత అవసరమో గత సంచికలో చూశాం. మరి గ్రామాల అధ్యయనం ఎలా జరపాలనే సంవిధానాలను, పరిశీలనా పరికరాలను అర్థం చేసుకునే ముందు దేశ వ్యాప్తంగానూ, రాష్ట్రంలోనూ గతంలో జరిగిన గ్రామాల అధ్యయనాల చరిత్రను తెలుసుకోవడం ఉపయోగకరంగా ఉంటుంది. ఎవరెవరు ఏయే కారణాల కోసం ఏయే పద్ధతులలో గ్రామాలను అధ్యయనం చేశారో అర్థం చేసుకుంటే, ఇవాళ గ్రామ అధ్యయనాలు ఎలా జరపాలో విశ్లేషించుకోవచ్చు. గతంలో విద్యా సంబంధమైన పరిశీలన కోసమో, పాలనాపరమైన కారణాలతోనో, ఆర్థిక, వ్యాపార, సైనిక, రాజకీయ కారణాలతోనో, సామాజిక మార్పుకు మార్గం కనిపెట్టాలనే కారణాలతోనో జరిగిన అధ్యయనాలను పరిశీలిస్తే, ఇవాళ సామాజిక మార్పు ప్రక్రియలో భాగంగా ఎటువంటి అధ్యయనాలు జరపాలో విధివిధానాలు రూపొందించుకోవచ్చు.

గ్రామాలు మానవ సమాజ చరిత్రలో ఆహారసేకరణ, వేట, పశుపోషణ, చలన వ్యవసాయ దశలు దాటి, స్థిర వ్యవసాయం మొదలయినప్పుడు ఏర్పడి ఉంటాయి. భారత చరిత్రలో ఈ క్రమం ఇప్పటికి దాదాపు పదివేల ఏళ్ల కింద జరిగి ఉంటుందని చరిత్రకారుల, పురావస్తు శాస్త్రవేత్తల అంచనా. జనాభా పెరుగుదల క్రమంలో, ప్రాకృతిక పరిణామాల క్రమంలో పాత గ్రామాలు పెరగడం, ఒక చోటినుంచి మరొక చోటికి మారడం, మొత్తంగానే రద్దయిపోవడం, కొత్త గ్రామాలు ఏర్పడడం వంటి పరిణామాలు ఎన్నో జరిగి ఉంటాయి. గత వెయ్యి సంవత్సరాలను మినహాయిస్తే అంతకు ముందరి భారత చరిత్ర గురించి నిస్సందేహమైన ఆధారాలు లేకపోవడం, దొరికే పురావస్తు ఆధారాలతోనైనా గ్రామాల చరిత్రను పునర్నిర్మించడానికి తగిన సమగ్రమైన ఆధారాలు దొరకకపోవడం ఒక సమస్య. శిలా శాసనాల ద్వారా, సమకాలీన లిఖిత, మౌఖిక సాహిత్యాధారాల ద్వారా, భాషా, సంస్కృతీ పరమైన ఆధారాల ద్వారా ఆ సమస్యను ఏదో ఒక స్థాయిలోనైనా పరిష్కరించుకోవడానికి చరిత్ర కారులు ప్రయత్నిస్తున్నారు. చరిత్ర రచనలో, మరీ ముఖ్యంగా ఇరవయో శతాబ్ది చరిత్ర రచనలో భారతీయ గ్రామాల గురించిన అధ్యయనాలు, ఆలోచనలు, ప్రతిపాదనలు, విశ్లేషణలు చాల ఎక్కువగానే జరిగాయి. ఆ తర్వాత విరివిగా జరిగిన సమాజశాస్త్ర, రాజకీయార్థిక శాస్త్ర గ్రామ అధ్యయనాలకు దారి చూపినవి ఈ చరిత్ర పరిశోధనలే.

తవ్వకాలలో బయటపడిన పురావస్తు ఆధారాలనూ, సాహిత్య ఆధారాలనూ సరిపోల్చి వాస్తవాన్ని ఉజ్జాయింపుగానైనా ఊహించడానికి జరిగిన ప్రయత్నాలలో భాగంగా ప్రాచీన సాహిత్యాన్నీ, భాషాపరికరాలనూ గ్రామాలకు సంబంధించిన చరిత్ర పరిశోధనలో వినియోగించడం జరిగింది. ఆ క్రమంలోనే జాతక కథలు, వేదాలు, ముఖ్యంగా రుగ్వేదం, రామాయణం, మహాభారతం, అర్థశాస్త్రం, మనుస్మృతి వంటి ప్రాచీన గ్రంథాలలో గ్రామాల ప్రస్తావన గురించి చర్చ జరిగింది. ఆధునిక అర్థంలో గ్రామాల అధ్యయనాలకు సరిపోయిన విశ్లేషణలు ఆ ప్రాచీన గ్రంథాలలో ఉండకపోవచ్చు గాని గ్రామాల చరిత్రను, గ్రామాలలో మానవసంబంధాలను, కొంతవరకు ఉత్పత్తి విధానాలను, ఉత్పత్తి సాధనాలను, గ్రామీణ ప్రజల ఆచార వ్యవహారాలను అర్థం చేసుకోవడానికి ఉపయోగపడే అంశాలు వాటిలో ఉన్నాయి. మరోమాటల్లో చెప్పాలంటే ఉత్పత్తి శక్తుల గురించీ, సామాజిక ఆస్తి సంబంధాల గురించీ, ఉపరితల అంశాల గురించీ ఈ ప్రాచీన సాహిత్యంలో స్థూలంగానైనా, అరకొరగానైనా సమాచారం దొరుకుతుంది. నిజానికి ఉత్పత్తి శక్తులు, సామాజిక సంబంధాలు, ఉపరితల అంశాలు అనేవే ఆధునిక సామాజిక శాస్త్రాల పరిశోధనాంశాలు కూడ. కాకపోతే ఆధునిక సామాజిక శాస్త్రాలకు దాదాపు వంద సంవత్సరాల అధ్యయన, పరిశోధనా, విశ్లేషణా క్రమంలో క్రమబద్ధమైన, పటిష్టమైన, సైద్ధాంతికమైన శాస్త్రీయ సంవిధానాలు రూపొందాయి. సమాచార సేకరణకు కచ్చితమైన, సందేహానికి తావులేని పద్ధతులు రూపొందాయి.

అయినా, భారతీయ గ్రామాన్ని నిర్వచించడంలో, అర్థం చేసుకోవడంలో, అధ్యయనం చేసే పద్ధతి రూపొందించుకోవడంలో వేరువేరు మార్గాలు, పరస్పర వ్యతిరేక పద్ధతులు, భిన్నమైన నిర్ధారణలు ఉన్నాయి. గ్రామాలు వేగంగానో, మందకొడిగానో నిరంతరంగా మారుతుండడం ఇందుకు కొంత కారణం కావచ్చు. అలాగే పరిశీలకుల దృక్పథాల లోని వైవిధ్యం మరి కొంత కారణం కావచ్చు. ఒకే దృక్పథం అవలంబించే పరిశోధకులు కూడ తమకు అందిన సమాచారం మేరకు, తమ స్థలకాలాలను బట్టి భిన్నమైన అవగాహనలను ప్రకటించిన స్థితి ఉంది. ఇందుకు ప్రఖ్యాతమైన ఉదాహరణ భారతీయ గ్రామం గురించి కార్ల్ మార్క్స్ అభిప్రాయాలకూ, మార్క్సిస్టు దృక్పథం నుంచే చరిత్రను అధ్యయనం చేసిన డి డి కోశాంబి అభిప్రాయాలకూ మధ్య వ్యక్తమైన స్పష్టమైన తేడా.

"భూమిపై ఉమ్మడి స్వామ్యమూ, వ్యవసాయాన్నీ చేతివృత్తులనూ సమ్మిళితం చేయడమూ, మార్చడానికి వీలులేని శ్రమ విభజన – ఇవే చాల ప్రాచీనమైన, చిన్న భారత గ్రామ సమాజాలకు ప్రాతిపదిక. ఒక కొత్త గ్రామం ఏర్పడుతున్నదంటే అప్పటికే సిద్ధంగా ఉన్న, అమలులోకి

తేదగిన ఈ ప్రాతిపదిక మీద ఏర్పడవలసిందే. వంద ఎకరాల నుంచి కొన్ని వేల ఎకరాల భూమిని ఆక్రమించే ఒక్కొక్క గ్రామం తనకు కావలసిందంతా తానే ఉత్పత్తి చేసుకునే పటిష్టమైన అఖండ వ్యవస్థగా ఉంటుంది. ఉత్పత్తిలో ప్రధాన భాగాన్ని గ్రామ సమాజం ప్రత్యక్షంగా ఉపయోగించడానికే ఉద్దేశిస్తారు. అది సరుకు రూపం ధరించదు. అందువల్ల సరుకుల మారకం ద్వారా భారత సమాజంలో మొత్తంగా రూపొందిన శ్రమ విభజనతో ఈ గ్రామ ఉత్పత్తికి సంబంధం లేదు. మిగులు ఉత్పత్తి మాత్రమే సరుకు అవుతుంది. అందులో కూడ ఒక భాగం రాజ్యం చేతికి అందేవరకూ సరుకు రూపం ధరించదు. గ్రామ ఉత్పత్తిలో ఒక నిర్దిష్ట భాగం వస్తు రూపపు కౌలుగా రాజ్యం చేతిలోకి అనాదిగా వెళ్తూ ఉంది. ఈ గ్రామ సమాజాల నిర్మాణ స్వరూపం దేశం లోని వేరు వేరు ప్రాంతాల్లో వేరు వేరుగా ఉంది. వాటిలో అత్యంత సరళమైన రూపాన్ని చూస్తే, అక్కడ భూమిని ఉమ్మడిగా సాగుచేస్తారు. పండిన పంట సభ్యుల మధ్య పంచుకుంటారు. అదే సమయంలో నూలు వడకడం, బట్టలు నేయడం ప్రతి కుటుంబంలోనూ అనుబంధ పరిశ్రమగా ఉంటాయి.

ఇలా ఒకే రకమైన పనిలో మునిగిపోయిన ప్రజాబాహుళ్యానికి పక్కపక్కనే ఇతరులు కూడ కనిపిస్తారు. వారు, న్యాయమూర్తీ, రక్షక భటుడూ, పన్ను వసూలు చేసే అధికారీ అన్నీ తానే అయిన 'ప్రధాన గ్రామస్తుడు"; భూమి సాగు లెక్కలను, వాటికి సంబంధించిన సమస్తాన్నీ నమోదు చేసే కరణం; నేరస్తులను విచారించే, గ్రామం మీదుగా ప్రయాణించే కొత్తవారు పొరుగు గ్రామం చేరే వరకూ రక్షణ కల్పించే మరో అధికారి; పొరుగు గ్రామాల నుంచి సరిహద్దులను కాపాడే సుంకరి; ఊరుమ్మడి చెరువుల నుంచి సాగునీటిని పంపిణీ చేసే నీరటికాడు; మత కర్మకాండలను నిర్వహించే బ్రాహ్మణుడు; పిల్లలకు ఇసుకలో చదువూ రాతా నేర్పే ఉపాధ్యాయుడు; విత్తనాలకూ, పంట కోతలకూ, అన్నిరకాల వ్యవసాయ పనులకూ శుభాశుభ తిథులను నిర్ణయించే పంచాంగ బ్రాహ్మణుడు లేదా జ్యోతిష్యుడు; అన్ని వ్యవసాయ పరికరాలనూ తయారుచేసే, మరమ్మత్తు చేసే కమ్మరి; వడ్రంగి; గ్రామానికి అవసరమైన కుండలు తయారు చేసే కుమ్మరి; మంగలి; బట్టలు ఉతికే చాకలి; కంసాలి; అక్కడక్కడ కవి – ఇతను కొన్ని గ్రామాలలో కంసాలి పనీ చేయవచ్చు, మరికొన్ని గ్రామాలలో ఉపాధ్యాయుడుగా ఉండవచ్చు. ఈ డజను మంది వ్యక్తులనూ మొత్తం గ్రామం పోషిస్తుంది.

జనాభా పెరిగితే, అనాక్రమిత భూమి మీద పాత పద్ధతిలోనే కొత్త గ్రామం ఏర్పడుతుంది. ఈ మొత్తం యంత్రాంగంలో ఒక క్రమబద్ధమైన శ్రమవిభజన కనబడుతుంది. కాని కార్ఖానాలో జరిగే శ్రమ విభజన లాంటిది ఇక్కడ అసాధ్యం. ఎందుకంటే, కమ్మరి, వడ్రంగి లాంటి వారి మార్కెట్ మారేది కాదు. ఆయా గ్రామాల పరిమాణాన్ని బట్టి ఒకరికి బదులు ఇద్దరో ముగ్గురో ఉండవచ్చు. గ్రామంలో ఈ శ్రమ విభజనను నియంత్రించే నియమం ప్రకృతి నియమం లాగ అప్రతిహతమైన అధికారాన్ని కలిగి ఉంటుంది. అదే సమయంలో ప్రతి చేతివృత్తి నిపుణుడూ, కమ్మరి గాని, వడ్రంగి గాని, ఇతరులు గాని, తన పనిస్థలంలో సాంప్రదాయిక పద్ధతిలో స్వతంత్రంగా, ఎవరి అధికారాన్నీ గుర్తించకుండా, తన చేతివృత్తి పని తాను చేసుకుపోతూ ఉంటాడు. ఇంత సరళమైన ఈ స్వయం సమృద్ధ గ్రామ సమాజపు ఉత్పత్తి వ్యవస్థ నిరంతరం తనను తాను పునఃసృష్టి చేసుకుంటూ, యాదృచ్ఛికంగా ధ్వంసమైనప్పుడు అదే చోట అదే పేరుతో పునరుద్భవిస్తూ ఉంటుంది. ఈ సరళత్వమే ఆసియా గ్రామ సమాజాల మారలేనితనపు రహస్యానికి కీలకం. ఆసియా రాజ్యాలు ఒకవైపు నిరంతరం రద్దయిపోతూ, పునః స్థాపితమవుతూ వచ్చినా, పాలకవంశాలు అనంతంగా మారుతూ వచ్చినా, మరొకవైపు ఆసియా సమాజాలు మారకుండా ఎందుకు ఉండిపోయాయో తెలిపే కీలకం కూడ ఇదే. సమాజ ఆర్థిక అంశాల నిర్మాణం రాజకీయాకాశంలో కమ్మిన పెనుతుపాను మబ్బుల స్పర్శ కూడ తగలకుండా ఉండిపోయింది" అని మార్క్స్ **కాపిటల్**లో రాశాడు.

డి డి కోశాంబి తన **యాన్ ఇంట్రడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ** లో "భారతదేశం గురించి మార్క్స్ స్వయంగా చెప్పిన విషయాలను యథాతథంగా అంగీకరించలేం.... ఆయన అభిప్రాయాలు ఎంత కచ్చితంగా, అద్భుతంగా ఉన్నప్పటికీ, అవి తప్పుదారి పట్టించేవి కూడ. అత్యవసరమైన లోహాలనూ, ఉప్పునూ అనేక గ్రామాలు తయారు చేసుకోజాలవు. అవి వాటిని మారకం ద్వారా సంపాదించుకోవలసిందే. అంటే అది సరుకుల ఉత్పత్తి ఉన్నదనడానికి సూచనే. ఈ సరుకులను ఎవరు మారకం చేశారనేది వేరే చర్చ. మిగులు ఉత్పత్తి రాజ్యం చేతుల్లోకి చేరేంతవరకూ సరుకు రూపం ధరించలేదని మార్క్స్ అన్న మాటను, కొన్ని కాలాలకు పరిమితం చేస్తే మాత్రమే అంగీకరించవచ్చు. అలాగే మార్క్స్ అన్నట్టుగా ఈ గ్రామాలు 'అనాది కాలం నుంచీ' ఉనికిలో లేవు. గిరిజన భారతం మీద నాగలి ఉపయోగించే వ్యవసాయ గ్రామీణ ఆర్థికవ్యవస్థ అభివృద్ధి దానికదిగానే ఒక గొప్ప చారిత్రక విజయం. ఇక రెండవది, గ్రామ పరిమాణం మారకుండా ఉండిపోయినప్పటికీ, ఆ గ్రామపు జన సాంద్రత చాల ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. ఒక ప్రాంతం రెండు గ్రామాలు ఉన్నప్పుడూ, రెండు వందల గ్రామాలు ఉన్నప్పుడూ, ఇరవై వేల గ్రామాలు ఉన్నప్పుడూ ఒకేరకమైన ఉపరితలాన్ని కలిగి ఉండజాలదు. ఒకే రకమైన రాజ్యాంగయంత్రం చేత దోపిడీకి గురికాజాలదు. అందుకు భిన్నంగా, ఉపరితలపు బరువు పెరుగుతున్న కొద్దీ గ్రామంలోపల భూయాజమాన్యాన్ని మార్చి వేస్తుంది. పరిమాణంలో మార్పు అంతిమంగా గుణంలో మార్పుకు దారితీస్తుంది" అన్నారు.

మార్పుకు, చలనానికి అత్యంత ప్రాధాన్యత ఇచ్చే మార్క్స్ భారతీయ గ్రామానికి గాని, భారత సమాజానికి గాని, ఆసియా సమాజాలకు గాని చలనరాహిత్యాన్ని ఎలా ఊహించాడా అనేది ఆశ్చర్యం కలిగించే ప్రశ్నే. నిజంగా చలన రాహిత్యాన్ని ప్రతిపాదించాడా, సాపేక్షిక నింపాదితనాన్ని అలా వ్యక్తీకరించాడా అనేది చర్చనీయాంశమే. అయితే ఆ వ్యాఖ్యలు చేస్తున్న సమయానికి (1857–67) ఆయనకు అందిన సమాచారం మీద ఆధారపడి ఈ అభిప్రాయాలు ఏర్పడి ఉంటాయని గుర్తు ఉంచుకోవాలి. ఈ మాటలకు ఆధారం 1810–17లో వెలువడిన లెఫ్టినెంట్ కర్నల్ మార్క్ విల్క్స్ రచన **హిస్టారికల్ స్కెచెస్ ఆఫ్ ది సౌత్ ఇండియా**, 1852లో ప్రచురితమైన జార్జ్ కాంప్‌బెల్ రచన **మాడర్న్ ఇండియా** అని ఆయనే స్వయంగా చెప్పుకున్నాడు. పారిశ్రామిక విప్లవంతో లోలోతులనుంచి కదలబారుతున్న యూరపియన్ సమాజంలో ఆ మార్పుకు భయపడే, ఆ మార్పును నిరాకరించే ఒక ధోరణి చలనరాహిత్యం కోసం వెతికింది. మార్పు ముందరి దశకు, వెనకకు, ప్రకృతిలోకి వెళ్లాలని కలలు కంది. ఆ అన్వేషణలోనే ప్రాచ్య సమాజాల మీద, భారత సమాజం మీద మోజు పెంచుకుని ఊహలు చేసింది. ఆ ఊహలకు వాస్తవంతో సంబంధం లేకపోయినా ఆ ఊహల మీద ఆధారపడి ప్రాచ్యవాదం (ఓరియంటలిజం), కాల్పనికవాదం (రొమాంటిసిజం) పుట్టుకు వచ్చాయి. ఆ భారత ఆకర్షణ వాదం వేసిన

వెర్రి తలలకు మాక్స్ ముల్లర్ తన పేరును సంస్కృతీకరించుకుని మోక్ష మూలుడని పిలుచుకోవడం ఒక నిదర్శనం. ఇరవయో శతాబ్ది దాకా అందుబాటులో ఉన్న సమాచారమంతా ఆ వాదాల ప్రారంభకులు, సమర్థకులు చేసిన రచనలే.

అంతేకాదు, ఈ రెండు అవగాహనల మధ్య వంద సంవత్సరాల తేడా ఉంది. మార్క్స్ 1867లో రాయగా, కోశాంబి 1956లో రాశారు. నిజానికి ఆ తర్వాత కూడ ఈ చర్చ సాగుతూనే ఉంది. ఆ తర్వాత గ్రామాల పట్ల అవగాహన గురించిన చర్చ ఇంకా తీవ్రతరమై భిన్నమైన అభిప్రాయాలు వెలువడ్డాయి. కొత్తగా గ్రామాల అధ్యయనాలు జరిగాయి. ఇప్పటికీ ఒక గ్రామాన్ని ఎలా చూడాలనే విషయంలో, గ్రామ అధ్యయనానికి ప్రాతిపదిక ఏమిటనే విషయంలో, గ్రామంలో మార్పులను ఎలా అర్థం చేసుకోవాలనే విషయంలో అనేక భిన్నాభిప్రాయాలు ఉంటున్నాయి. ఇలా మార్క్సిస్టు దృక్పథంలోనే గ్రామం పట్ల అవగాహనలో భిన్నాభిప్రాయాలు ఉన్న సమయంలో ఇవాళ భారతీయ గ్రామాన్ని పరిశోధించడానికి వెళ్లేటప్పుడు ఏ పరికరాలతో, ఏ అవగాహనతో, ఏమి శోధించడానికి వెళ్లాలి అనేది చాల సంక్లిష్టమైన ప్రశ్న. ఆ ప్రశ్నకు జవాబు/జవాబులు వెతికే క్రమంలో మొత్తంగా గ్రామం గురించి ఇంతవరకూ జరిగిన అధ్యయనాల చరిత్రను తెలుసుకోవడం ఉపయోగకరంగా ఉంటుంది.

ముందే చెప్పినట్టు ఇరవయో శతాబ్ది వరకూ గ్రామాల అధ్యయనానికి పటిష్టమైన, శాస్త్రీయమైన మార్గదర్శక పరిశీలనా పరికరాలు, సైద్ధాంతిక పటుత్వం రూపొందలేదు. కాని భారతీయ గ్రామాల గురించి ప్రస్తావనలు, అభిప్రాయాలు, విశ్లేషణలు వేల సంవత్సరాలుగా కనబడుతూనే ఉన్నాయి.

భారత సమాజం గురించి, కనీసం సింధూ నదికీ, యమునా నదికీ మధ్య ఉండిన సమాజం గురించి, దొరికే అతి ప్రాచీన లిఖితాధారం వేదాలు. అవి ఎప్పుడు వెలువడ్డాయో, ఎప్పుడు లిఖిత రూపం ధరించాయో, ఏయే భాగం ఏ దశ సమాజాన్ని గురించి చెప్పిందో ఎన్నో వివాదాలు ఉన్నప్పటికీ రుగ్వేదం, అథర్వవేదం క్రీ.పూ. 1500–1000 మధ్య సామాజిక దృశ్యాన్ని చూపుతాయనే అంగీకారం ఉంది. రుగ్వేదంలోనూ, అథర్వవేదంలోనూ కూడ గ్రామాల ప్రస్తావన ఉంది. అయితే గ్రామ అనే మాట మొదట వాడినప్పుడు ఆ మాటకు ఇవాళ మనం చెప్పుకునే అర్థం ఉండి ఉండకపోవచ్చునని రొమిలా థాపర్ **ఏర్లీ ఇండియా**లో అన్నారు. వేద సాహిత్యంలో సమాజానికి అతి సూక్ష్మరూపం పితృస్వామిక కుటుంబం. దాన్ని కులం అని పిలిచేవారు. కొన్ని కులాలు కలిస్తే గ్రామం అయ్యేది. అంటే తొలి గ్రామాలు పరస్పర రక్తసంబంధం ఉన్న కుటుంబాల సమూహాలు కావచ్చునని రొమిలా థాపర్ ఊహించారు. అసలు గ్రామం అంటే సంచార పశుపోషకుల వాహనాల సమూహం అనే అర్థం కూడ ఉన్నదని ఆమె అన్నారు. మొత్తానికి గ్రామాల మధ్య సంబంధం గురించీ, గ్రామానికీ, కొన్ని గ్రామాలు కలిస్తే ఏర్పడే విశ్‌కూ, కొన్ని విశ్‌లు కలిస్తే ఏర్పడే జనకూ, కొన్ని జన లు కలిస్తే ఏర్పడే దేశానికీ మధ్య సంబంధాల గురించీ, గ్రామ పెద్దగా పనిచేసే గ్రామిణి గురించీ వేద సాహిత్యంలో ప్రస్తావనలు ఉన్నాయి. కాని గ్రామం లోపల ప్రజల మధ్య సంబంధాల గురించి వివరణ పెద్దగా లేదు.

వేద సాహిత్యం తర్వాతి రామాయణ, మహాభారతాలలో గ్రామాల ప్రస్తావన ఎక్కువగానే ఉంది. రామాయణం ఘోష, గ్రామ అనే రెండు రకాల గ్రామాల గురించి, ఘోష మహత్తర, గ్రామ మహత్తర, గ్రామణి అనే గ్రామాధికారుల గురించి చెప్పింది. రావణుడిని చంపిన తర్వాత రాముడిని దేవతలు పొగడ్తలతో ముంచెత్తినప్పుడు గ్రామణి అని పిలిచారంటే గ్రామాలకు, గ్రామణికి ఉన్న ప్రాధాన్యత అర్థమవుతుంది. మహాభారతం కూడ ఈ రెండు రకాల గ్రామాల గురించి చెప్పింది. ఘోష అనేది చిన్నగ్రామమని, అడవి అంచున ఉంటుందని, అందులో గోప అనే పశుపాలకులు నివసిస్తారని చెప్పింది. గ్రామణి, దశ గ్రామణి (పది గ్రామాల పెద్ద), వింశతి (ఇరవై) గ్రామణి, శత (వంద) గ్రామణి, వెయ్యి గ్రామాల అధిపతి గురించి కూడ మహాభారతం రాసింది.

ఆ తర్వాత క్రీ.పూ. ఐదవ శతాబ్ది నాటి జీవితాన్ని చిత్రించిన బౌద్ధ, జైన సాహిత్యంలో గ్రామాల వివరణ ఇంకా ఎక్కువగా ఉంది. బౌద్ధ రచనలలో గామ, నిగామ, కుల అనే పేర్లతోనూ, జైన గ్రంథాలలో ఘోస, ఖేత, ఖర్వట, గ్రామ, పల్లి, వగైరా పేర్లతోనూ గ్రామాల ప్రస్తావన వచ్చింది. బౌద్ధ జాతక కథలలో సగటు గ్రామం అంటే వెయ్యి కుటుంబాల సమూహం. గ్రామంలో ఇళ్లు పక్కపక్కనే ఉండేవని, ఒక ఇంటికి నిప్పు అంటుకుంటే ఊరంతా తగులబడి పోతుందని జాతక కథల్లో ఉంది. గ్రామం – బహుశా నివాస ప్రాంతం – చుట్టూ ప్రాకారం ఉందని, గ్రామానికి ఒక సింహద్వారం ఉందని కూడ జాతక కథలు చెపుతాయి. ప్రాకారం బయట తోటలు, పొలాలు ఉంటాయని, పంటలకు చీడలు, పశువులు, పక్షులు హాని చేయకుండా కంచెలు, మాట్లు వేస్తారని, కాపలాదార్లు ఉంటారని కూడ వాటిద్వారా తెలుస్తుంది. పొరుగున ఉన్న అడవిని కొట్టి నేలను బాగు చేయడం ద్వారా గ్రామ క్షేత్రాన్ని విస్తరించి కొత్త అవసరాలు తీర్చుకుంటారని, పచ్చిక బీళ్లు ఊరుమ్మడి ఆస్తిగా ఉంటాయని, వ్యవసాయ భూమి వ్యక్తిగత కమతాల కింద ఉంటుందని, సాగు నీటి సౌకర్యం, కాలువల నిర్వహణ సమష్టిగా జరుగుతాయని జాతక కథలు చెపుతాయి.

"గ్రామం అంటే కొన్ని చిన్నా పెద్దా గుడిసెల సమూహం. సాధారణంగా ఇది ఒక బావి చుట్టూనో, సరస్సు చుట్టూనో ఏర్పడేది. దాని పక్కన చెట్లూ, ఖాళీ ప్రదేశాలూ ఉండేవి. తొలిరోజుల్లో గ్రామాలలో సాంఘిక జీవిత కేంద్రంగానూ, ప్రయాణికుల విశ్రాంతి గృహం గానూ ఉపయోగపడే ఉమ్మడి శాల ఉండేది. తర్వాతి కాలంలో ఈ శాలలను గ్రామ ఆలయాలు ఆక్రమించాయి. గ్రామస్తులు చాల ఎక్కువగా స్వీయ చైతన్యం గల సమూహంగా, ఉత్సాహభరితమైన సామూహిక జీవనం గడుపుతుండేవారు. ఒక జాతక కథ నుంచి ఉదాహరణ ఇవ్వాలంటే... 'ఒకరోజు వారందరూ గ్రామ వ్యవహారాలు చూడడానికి గ్రామం మధ్యలో సమావేశమయ్యారు... ఉపయుక్తమైన పనులు చేయాలని నిర్ణయించారు. అక్కడినుంచి లేచి కత్తులు, గొడ్డళ్లు, గునపాలు పట్టుకుని బయల్దేరారు. నాలుగు రహదారులలో ఉన్న బండరాళ్లను గునపాలతో పెకలించారు. తమ బళ్ల ఇరుసులకు అడ్డం పడుతున్న చెట్లను నరికేశారు. రహదారుల ఎత్తుపల్లాలను సమానం చేశారు. కట్టలు కట్టి చెరువులు తవ్వారు. గ్రామానికి ఉమ్మడి శాల కట్టారు. దాన ధర్మాలు కొనసాగించారు. బుద్ధుడి ఆదేశాలను పాటించారు...'' అని ఆ జాతక కథ చెపుతుంది. ఇటువంటి క్రియాశీల సామూహిక జీవనం మధ్యయుగాల దాకా సాగింది. సామూహిక సంక్షేమం గురించీ, చెరువులను తవ్వడం, బాగుచేయడం గురించీ, కాలువలు తవ్వడం గురించీ, రహదారులు బాగుచేయడం గురించీ, గ్రామ ఆలయాలను సంరక్షించడం గురించీ గ్రామ పాలక మండళ్లు శ్రద్ధ వహించాయని తమిళ శాసనాలు తెల్పుతున్నాయి" అని ప్రాచీన గ్రామ జీవితం గురించి చరిత్రకారుడు ఎ ఎల్ బాషామ్ **ది వండర్ దట్ వాజ్ ఇండియా**లో రాశారు. బాషామ్ ఇచ్చిన రెండు

ఆధారాలలో మొదటిదైన జాతక కథ క్రీ.పూ. నాలుగో శతాబ్దం నాటిది. తమిళ శిలా శాసనం క్రీ.శ. పదో శతాబ్దం నాటిది. కచ్చితమైన, నిర్దిష్టమైన చారిత్రక ఆధారాలు లేనప్పటికీ దాదాపు పదిహేను వందల ఏళ్ల కాలంలో గ్రామ వ్యవస్థల గురించి స్థూలమైన అవగాహనను ఇవి ఇస్తాయి.

జాతక కథల సంకలనం తర్వాత దాదాపు నాలుగు-ఐదు వందల ఏళ్లకు వచ్చిన కౌటిల్యుని అర్థశాస్త్రం చాల వివరంగా గ్రామజీవితం గురించీ, గ్రామిక అనే గ్రామాధికారి విధుల గురించీ, గ్రామవృద్ధులు అనే గ్రామపెద్దల, గ్రామీణుల బాధ్యతల గురించీ చర్చించింది. గ్రామానికీ గ్రామానికీ మధ్య కనీసం ఒకటి రెండు క్రోసు (రెండు మైళ్లు) ల దూరం ఉండాలని అర్థశాస్త్రం రాసింది. గ్రామాలు, పచ్చిక బీళ్లు, ఖాళీ స్థలాలు, అడవులు అనే విభజన, ఆయా స్థలాల, దేవాలయ ఆస్తుల సంరక్షణ బాధ్యతలు, భూవివాదాల పరిష్కారాలు, స్థిరాస్తుల అమ్మకాలు, చిన్న పిల్లల ఆస్తుల సంరక్షణ, గ్రామ సరిహద్దు రాళ్లు, పచ్చిక బీళ్లలో పశువుల మేత హక్కులు, అందుకు వసూలు చేసే రుసుము, గ్రామ ఆదాయం, జరిమానాలు, అవాంఛిత వ్యక్తులను గ్రామం నుంచి తొలగించడం, ఉమ్మడి ఉత్సవాలలో గ్రామస్తుల భాగస్వామ్య బాధ్యతలు వంటి అనేక విషయాలు అర్థశాస్త్రంలో చర్చకు వచ్చాయి. పది గ్రామాలు కలిసి ఒక సంగ్రహణం అవుతుందని, 200 కలిస్తే కర్వాటిక అవుతుందని, 400 కలిస్తే ద్రోణముఖ అవుతుందని, 800 అయితే మహాగ్రామం అవుతుందని, ఈ మహాగ్రామాన్ని పాలనాపరంగా స్థానీయ అని పిలుస్తారని అర్థశాస్త్రం రాసింది. (ఈ స్థానీయ అనే మాట రూపాంతరం చెంది ఠానా - ప్రస్తుత పోలీస్‌స్టేషన్ - అయి ఉంటుందని, ఇప్పటి ఠానా ఉండే పట్టణం లాగనే అప్పుడు కూడ స్థానీయ పరిసర గ్రామాల వాణిజ్య, ఉత్సవకేంద్రంగా ఉండేదని భారతదేశంలో గ్రామ పంచాయత్‌ల పై పరిశోధన చేసిన ఎచ్‌డి మాలవీయ ఊహిస్తున్నారు). ఇవన్నీ ఆనాటి గ్రామ జీవితాన్ని శాసించిన పాలనా విధానాల గురించి తెలియజేస్తాయి గాని జనజీవనం ఎలా ఉండిందో, ఈ విధినిషేధాల పట్ల ప్రజల స్పందన ఎలా ఉండిందో, అనుసరించారో, ఉల్లంఘించారో తెలియదు.

ఆ తర్వాత మనుస్మృతి కూడ గ్రామాల గురించి ప్రస్తావించింది. ఒక శిక్షాస్మృతిగా, విధినిషేధాల సంపుటిగా మనుస్మృతి గ్రామంలో సంబంధాల గురించి కొంత రాసింది. ఏడో అధ్యాయంలో గ్రామ పరిపాలన కింద విచారణాధికారుల గురించి, నేర విచారణ, శిక్ష విధింపు గురించి, లంచగొండితనం గురించి, ఏయే పనులు చేసేవారికి ఎంత వేతనం ఇవ్వాలనే దాని గురించి, వేరువేరు సరుకులకు సుంకాల గురించి మనుస్మృతి రాసింది. చండాలురు, శ్వపాకులు గ్రామం బైట నివసించాలని, వారు మరణించినవారి బట్టలు ధరించాలని, పగిలిన కుండలలో భోజనం చేయాలని, కుక్కలు, గాడిదలే వారి సంపద అని, ఇనుప వస్తువులే వారి ఆభరణాలని, వారు దేశ దిమ్మరులై తిరగాలని, వారి వ్యవహారాలు, వివాహాలు వారిలో వారికి మాత్రమే జరగాలని, వారు గ్రామాలలో రాత్రిపూట తిరగరాదని, పగటిపూట రాజాజ్ఞతో మాత్రమే తిరగాలని, మరణశిక్ష విధించబడిన నేరస్తుల తల నరికే పని వాళ్లదేనని, ఆ తర్వాత ఆ నేరస్తుడి బట్టలను, శయ్యలను, ఆభరణాలను తీసుకోవాలని మనుస్మృతి రాసింది.

దాదాపు ఈ కాలానికి (క్రీ.పూ. ఒకటో శతాబ్ది) చెందినదని భావిస్తున్న చాల ఆసక్తికరమైన టెర్రాకోటా (బంకమన్ను) ఫలకం ఒకటి అలహాబాద్ సమీపంలోని భీతా అనే గ్రామంలో తవ్వకాలలో దొరికింది. ఆ గుండ్రని ఫలకం మీద గ్రామదృశ్యం చిత్రించి ఉంది. కాలువలు, వ్యవసాయ పనులు, వస్తువుల అమ్మకాలు, చేపల పెంపకం, మచ్చిక చేసుకున్న జంతువులు, గుర్రాలు పూన్చిన రథం వంటి ఎన్నో చిత్రాలు ఆ ఫలకం మీద ఉన్నాయి. ఆ ఫలకాన్ని బాషామ్ తన పుస్తకంలో ఇచ్చారు.

ఆ తర్వాత ప్రధానంగా వ్యవసాయంపై పన్ను విధింపు గురించి, వసూళ్ల గురించి, సామాజిక నిర్మాణం గురించి, పాలన గురించి ప్రస్తావనలు ఒకవైపు రాజాస్థాన, సంస్కృత సాహిత్యంలో కనబడుతుండగా, మౌఖిక, స్థానిక భాషల సాహిత్యంలోను, విదేశీ యాత్రికుల కథనాలలోను గ్రామాల స్వరూపం, గ్రామీణుల మధ్య సంబంధాల గురించి మరొక చూపు చిత్రణ పొందడం మొదలయింది.

కొంతకాలానికే మొఘల్ పాలకులు, స్థానిక పాలకులు కూడ పన్నుల వసూళ్లు పెంచుకోవడం కోసమైనా, తమ పాలితుల గురించి సమగ్ర సమాచారం సేకరించడం కోసమైనా గ్రామీణ అధ్యయనాలు ప్రారంభించారు. మొదట షేర్ షా సూరి (1486 - 1545) బీహార్ ప్రాంతంలో, ఆ తర్వాత జలాలుద్దీన్ అక్బర్ (1542-1605) ఉత్తర భారతమంతా తమ పాలనా అవసరాల కోసమే అయినా గ్రామ అధ్యయనాలు, ప్రధానంగా వ్యవసాయాదాయం గురించీ, అందులో పన్నుగా రాబట్టగల భాగం గురించీ అధ్యయనాలు క్రమబద్ధంగా సాగించారు. మొఘల్ చక్రవర్తి అక్బర్ 1581లో దేశంలోనే మొట్టమొదటిసారిగా తన పాలనా ప్రాంతాలలో జనగణన జరిపించాడు. ప్రతి గ్రామంలోనూ ఎంత మంది ప్రజలు ఉన్నారో, వారి వృత్తులేమిటో వివరాలు ఈ జనగణనలో సేకరించారు. ఆ జనగణన ప్రకారం అక్బర్ పాలనలో 120 పెద్ద నగరాలు, 3,200 చిన్న కస్బా పట్టణాలు ఉన్నాయని తేలింది. ప్రతి కస్బా కింద వంద నుంచి వెయ్యి గ్రామాలు ఉన్నాయని అంచనా వేస్తున్నారు. ఔరంగజేబ్ కాలానికి బిజాపూర్, హైదరాబాద్‌లను మినహాయించి మిగిలిన సామ్రాజ్యంలో 4,01,567 గ్రామాలు ఉన్నాయని మరొక ఆధారం ఉంది.

మొఘల్ పాలకుల తర్వాత అధికారం చేజిక్కించుకున్న ఈస్టిండియా కంపెనీ రోజులలో ఇవాళ మనం చూస్తున్న గ్రామీణ అధ్యయనాలకు దగ్గరగా ఉండే అధ్యయనాలు మొదలయ్యాయి. ఈ పని ఎక్కువగా దక్షిణ భారతంలో, అందులోనూ ప్రత్యేకంగా తెలుగు భాషా ప్రాంతాలలో మరింత ఎక్కువగా సాగింది. ఈస్టిండియా కంపెనీ ఆధ్వర్యంలోని మద్రాస్ ఇంజనీర్స్ విభాగంలో ఉద్యోగిగా 1783లో చేరిన కాలిన్ మెకంజీకి 1790 నాటికి గుంటూరు సర్కార్లను పూర్తిగా సర్వే చేసే పని అప్పగించారు. ఆయన గుంటూరు మాత్రమే కాక, కడప, కర్నూలు, నల్లమల, నిజాం ప్రాంతాల సర్వే కూడ చేశాడు, చేయించాడు. ప్రాచీన శిలాశాసనాలనూ, నిర్మాణాలనూ చూసి వ్యక్తిగత ఆసక్తితోనూ, కంపెనీ ప్రయోజనాల కోసమూ కూడ సవివరమైన నివేదికలు తయారు చేశాడు. ఈ పనిలో భాగంగా ప్రతి గ్రామానికీ సంబంధించిన చరిత్రనూ, వనరుల వివరాలనూ, భూమి వివరాలనూ రాయించాడు. ఆయన సేకరించిన 1,568 లిఖిత ప్రతులను మెకంజీ కైఫియతులు అని పిలుస్తున్నారు. ఒక రకంగా భారతదేశంలో గ్రామాల అధ్యయనాలలో శాస్త్రీయ పరికరాలు, సంవిధానం రావడానికి ముందు చివరి మెట్టుగా ఈ గ్రామ కైఫియతులను చెప్పుకోవాలి.

(ఇంకా ఉంది)

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

*ఫీజు బకాయిలను రాష్ట్ర ప్రభుత్వం వెంటనే చెల్లించకుంటే ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ విద్యార్థుల భవిష్యత్తు అంధకారమవుతుందని అంటున్నారు* **సిలువేరు హరినాథ్**

# బకాయిల బాధలింకెంత కాలం?

సరిగ్గా రెండుదశాబ్దాల క్రితం దేశంలో ప్రవేశపెట్టబడిన నూతన ఆర్థికవిధానాల ప్రభావం బడుగు, బలహీనవర్గాలకు విద్యను అందకుండా చేస్తోన్నది. ప్రపంచీకరణ కారణంగా విద్య మార్కెట్ సరుకు స్థాయిని కూడా దాటిపోయింది. అందుకు పాలకులు కూడా తమవంతు ద్రోహాన్ని ప్రతీ ఏడూ తలపెడుతూనే ఉన్నారు. చంద్రబాబు నుండి కిరణ్‌కుమార్ రెడ్డి వరకు విద్యారంగంలో గ్లోబల్ విలువల్ని పెంపొదిస్తూ విద్యను కార్పోరేటుమయం చేయడం కోసమే ఎత్తులు వేస్తున్నారు. అందులో భాగంగానే విద్యార్థులకు చెల్లించవలసిన ఫీజు రియంబర్స్‌మెంట్‌పై ఎటువంటి పురోగతి లేకుండా చేయడం. పైగా విద్యార్థులే ఆ ఫీజుల భారాలకు బాధ్యత వహించేలా వారిపై మోయలేని భారాన్ని పెడుతున్నది. దీంతో విద్యార్థుల భవిష్యత్తు గందరగోళంగా తయారవుతున్నది. ప్రతీ ఏడాది విద్యార్థులకు సకాలంలో ఫీజు రియంబర్స్‌మెంట్ చెల్లించకుండా సర్కార్ చేతులెత్తుస్తూ చోద్యం చూస్తున్నది. ఆర్థిక ఇబ్బందులతో ఉన్నత చదువులు చదువలేని నిరుపేద కుటుంబాలకు చెందిన విద్యార్థుల పరిస్థితి త్రిశంకు స్వర్గంలో కొట్టుమిట్టాడుతున్నది. ఆనాటి ముఖ్యమంత్రి రాజశేఖర్‌రెడ్డి అమలుచేసిన సంక్షేమ పథకాలను కొనసాగిస్తామంటూ నోటితో చెబుతున్న ప్రభుత్వం ఆర్థిక ఇబ్బందులున్నాయంటూ నొసటితో వెక్కిరిస్తున్నది. ప్రస్తుత ఆర్థిక సంవత్సరానికి రు. 3017.19కోట్ల మేరకు అవసరం ఉండగా, ఫిబ్రవరి నాటికి రు. 2968.83 కోట్లు మాత్రమే ప్రభుత్వం మంజూరు చేసింది. గత ఏడాది బకాయిలన్నీ ఇచ్చేశామని సర్కారు చెబుతున్న మాటలు వాస్తవాలకు దూరంగా ఉన్నాయి. వాస్తవానికి 2009-10 బకాయిలు ఇంకా రెండు వందల కోట్ల మేరకు మిగిలిపోయి ఉండడం గమనార్హం.

గత ఏడాది బకాయిల కింద నిధులు మంజూరు చేశామని చెబుతున్నప్పటికీ ఇంకా ట్యూషన్ ఫీజులు, స్కాలర్‌షిప్‌లు కింద రు. 120.04కోట్లు, కార్పోరేట్ చదువుల పథకం కింద రు. 59కోట్లు, పారా మెడికల్ కోర్సుల కోసం రు. 20కోట్ల చొప్పున బకాయిలు ఇంకా మిగిలిపోయే ఉన్నాయి. ప్రస్తుతం సర్కారు రు. 836కోట్ల వరకు నిధులు మంజూరు చేసినట్లుగా ఉత్తర్వులు జారీ చేసింది. అయితే ఉత్తర్వుల మేరకు నిధులు మంజూరు కానేలేదు. లక్షకోట్లకు పైగా ఉన్న రాష్ట్ర బడ్జెట్‌లో ఎస్.సి.,ఎస్.టి.,బి.సి., మైనారిటీలతో పాటు ఇ.బి.సి. వర్గాల విద్యార్థులకు నిధులు ఇవ్వలేని దుస్థితి ఎందుకు తలెత్తిందనే అంశంపై సర్కారు నోరు మెదపడం లేదు. గత కొన్ని నెలలుగా విద్యార్థిలోకం ఆందోళనలు చేస్తున్నా ప్రభుత్వం అంతగా పరిగణనలోకి తీసుకోక పోవడం బడుగులపట్ల పాలకులకు ఉన్న చిత్తశుద్ధికి నిదర్శనమనే అభిప్రాయం వ్యక్తమవుతున్నది. ఈ విషయమై కళాశాలల యాజమాన్యాలు సర్కారుపై ఒత్తిడి తీసుకొచ్చినా ఫలితం లేకపోవడంతో సర్కారుతో ప్రత్యక్ష యుద్ధంలో తలబడే పరిస్థితి నెలకొంది. రాష్ట్ర ప్రభుత్వం తీరుపై హైకోర్టు, దేశ అత్యుత్తమ మంత్రుల కమిటీలు, కోర్టులంటూ ఉపకారవేతనాలు, ఫీజులు చెల్లింపుల్లో కాలయాపన చేసి, ప్రస్తుత విద్యా సంవత్సరం నుండి బయట పడాలని ప్రభుత్వం యోచిస్తోంది. ప్రస్తుత ప్రపంచీకరణ ఫలితంగా ఆయా కులవృత్తులు దెబ్బతినడంతో విద్యపై శ్రద్ధ చూపిన బడుగు విద్యార్థులకు నాటి ముఖ్యమంత్రి రాజశేఖర్‌రెడ్డి ప్రభుత్వం సాచురేషన్ పద్ధతిలో స్కాలర్‌షిప్, ఫీజులు చెల్లించడంతో బి.సి. విద్యార్థులు ప్రతిభ కనబరిచారు. అందువల్లనే అనేకమంది బి.సి. విద్యార్థులు వృత్తి విద్యపట్ల మక్కువ చూపడంతో పాటు మంచి ఫలితాలు కూడా సాధించారు. బి.సి. విద్యార్థులు మెడిసిన్ ఇంజనీరింగ్, ఫార్మసీ వంటి ఖరీదైన కోర్సుల్లో చొచ్చుకు పోవడంతో పాలకవర్గాలు సరిగా ఫీజుల చెల్లించకుండా వారి బంగారు భవిష్యత్‌కు గండికోడుతున్నారని, ఇది అగ్రకుల కుట్రేనని విద్యార్థులు వాపోతున్నారు.

ఈ వివరాలను బట్టి పరిశీలిస్తే లోటు బడ్జెట్‌తో మాత్రమే ప్రభుత్వం సంక్షేమానికి తూట్లు పొడుస్తున్నది. కావాల్సిన బడ్జెట్‌ను ఎప్పుడూ కేటాయించకుండా మొండిచెయ్యి చూపిస్తున్నది. దీంతో ఈ భారం విద్యార్థులతో పాటు వారి తల్లిదండ్రులకు కూడా గుదిబండగా మారింది. ఓట్ల కోసం వరాల జల్లు కురిపించే పాలకులు ఆ తరువాత ఆయా సామాజిక వర్గాలను నమ్మించి నట్టేట ముంచడం రివాజుగా మారింది. ఇట్లా ప్రతీ ఏడాది విద్యార్థుల సంక్షేమానికి సరిపడ నిధులను కేటాయించని సర్కారు తీరుతో ఈ సమూహాలకు చెందిన విద్యార్థులు ఉన్నత చదువుల చదువలేకపోతున్నారు. ఆర్థికంగా బలపడిన ఎగువ మధ్యతరగతితో పాటు, అభివృద్ధి చెందిన అగ్రవర్ణాల వారికి మాత్రమే వృత్తివిద్యా కోర్సులైన ఇంజనీరింగ్, మెడిసిన్ వంటి ఉన్నత చదువులు అందుబాటులో ఉంటున్నాయి. కానీ, బడుగు బలహీన వర్గాల పరిస్థితి వెనుక నుయ్యి, ముందు గొయ్యిలా మారింది. ప్రవేటు కళాశాలల

2011-12 ఆర్థిక సంవత్సరానికి స్కాలర్‌షిప్‌లు, ఫీజుల వివరాలు (లక్షల్లో)

| శాఖలు | కావాల్సిన బడ్జెటు | మంజూరు |
|---|---|---|
| బి.సి. సంక్షేమ శాఖ | 2,72,639 | 1,51,355 |
| సాంఘిక సంక్షేమ శాఖ | 1,18,519 | 63,448 |
| గిరిజన సంక్షేమ శాఖ | 37,967.01 | 16,625 |
| ఇ.బి.సి. సంక్షేమం | 88,222 | 45,393 |
| వికలాంగుల సంక్షేమం | 1811.32 | 490 |
| మైనారిటీ సంక్షేమం | 34,322 | 19,571 |
| **మొత్తం** | **553,480.33** | **296,883** |

యాజమాన్యాలు ముక్కుపిండి వసూలు చేసే నైజం కలిగి ఉండడంతో ఎస్.సి. , ఎస్.టి., బి.సి., మైనారిటీ, వికలాంగుల పరిస్థితి విషాదకరంగా మారుతున్నది. రిజర్వేషన్‌ల వంకను చూపి ఎస్.సి., ఎస్.టి.లను మభ్యపెట్టే సర్కారు బి.సి.లకు, మైనారిటీలకు తీరని అన్యాయం చేస్తున్నది. విద్యారంగంలో రోజురోజుకు పెరుగుతున్న ఆర్థికభారంతో ఈ వర్గాలకు రానున్న రోజుల్లో ఉన్నత స్థాయి చదువులు ఒక కలగానే మిగిలే అవకాశం లేకపోలేదు. ముఖ్యంగా మైనారిటీల్లో ఎక్కువమంది పేదలే ఉండడం వల్ల వారికి, ఈ ఫీజు రియంబర్స్‌మెంట్ కొంత ఉపశమనం కలిగేది. ఒకప్పుడు ముస్లిం కమ్యూనిటీ నుండి 42శాతం ఉద్యోగాలను పొందిన చరిత్ర ఇప్పుడు కేవలం రెండు శాతానికి పడిపోయింది. దీనికి ప్రభుత్వ విధానాలే కారణమని వేరే చెప్పాల్సిన అవసరం లేదు. మధ్యలో చదువు మానేస్తున్నవారి సంఖ్య కూడా రోజురోజుకు పెరిగిపోతున్నది. దేశంలో అన్ని రాష్ట్రాల ప్రభుత్వాలు ముస్లింలను ఓటర్లుగానే చూస్తున్నరు తప్ప వారి సంక్షేమం కోసం చిత్తశుద్ధితో చేస్తున్నది శూన్యమే.

రాష్ట్రప్రభుత్వం ప్రతీ ఏడాది విద్యారంగానికి కేటాయించే బడ్జెట్‌లో పురోగతి కనిపిస్తున్నప్పటికీ అదీ మారుతున్న కాలానికి అనుగుణమైంది కాదనేది వాస్తవం. ప్రపంచవ్యాప్తంగా విద్యారంగంలో వస్తున్న మార్పులు స్థానికంగా ఇక్కడి పరిస్థితులను కూడా ప్రభావితం చేస్తున్నాయి. కొత్తకొత్త వృత్తివిద్య కోర్సులతో పాటు, పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్న కళాశాలలు చదువును వ్యాపారీకరణ చేశాయి. తమ లాభాల కోసం ఎంతకైనా తెగించే దుర్నీతి వీరిదైతే, వారి ప్రయోజనాలకోసమే పనిచేస్తూ ప్రభుత్వాలు ఒక ఏడాది నుంచి మరో ఏడాదికి విద్యా విలువలను దిగజారుస్తూ క్రమంగా తమ బాధ్యత నుండి వైదొలుగుతున్నాయి. ఈ మార్పు విద్యారంగంపై ప్రభుత్వం చూపిస్తున్న నిర్లక్ష్యానికి అద్దం పడుతున్నది. కొన్ని సందర్భాల్లో ప్రభుత్వం దారుణంగా విద్యారంగానికి కేటాయించిన నిధులను కూడా వేరే రంగాలకు మళ్లిస్తూడడం అత్యంత సహజంగా మారిపోయింది. దీంతో విద్యార్థులు రోడ్డున పడుతున్నారు. దీనికి తోడు కళాశాల యాజమాన్యాలు ప్రభుత్వం చెల్లించని ఫీజుల రియంబర్స్‌మెంట్‌లకు విద్యార్థులను బాధ్యులను చేస్తూ , ప్రభుత్వం చేసే పొరపాట్లకు విద్యార్థుల చేత హామీ పత్రాలు రాయించుకునే పరిస్థితి నెలకొంటున్నది. ప్రభుత్వం మాత్రం బడ్జెట్‌లో అంకెలగారడీ చేస్తూ విద్యారంగాన్ని ప్రోత్సహిస్తున్నట్లు ప్రగల్భాలు పలుకుతున్నది.

గడిచిన అరదశాబ్దకాలంగా ప్రవేశపెట్టిన బడ్జెట్‌లను చూస్తే ఇదే విషయం అర్థమవుతుంది. కేటాయించేటపుడు భారీగానే ఉన్న లెక్కలు, నిధుల విడుదల దగ్గరికి వచ్చేసరికి మాయమైపోతున్నాయి. ఈ పరిస్థితికి పూర్తి బాధ్యత సర్కారుదే. 2009-2010 విద్యా సంవత్సరానికి కేటాయించిన బడ్జెట్ అంతకు ముందటి ఏడాది కంటే తగ్గించి కేటాయించింది సర్కారు. కానీ, విద్యార్థిసంఘాల ఆందోళనలు, ప్రజానిరసనల వెల్లువకు మళ్లీ 2011-2012 విద్యా సంవత్సరానికి మాత్రం గరిష్టంగా పెంచింది. కానీ, నిధులను ఖర్చు చేయడంలో ఎప్పటిలాగే నిర్లక్ష్యంగా వ్యవహరించి, ఈ నిధులను ప్రభుత్వం ప్రవేశపెట్టిన వివిధ సంక్షేమ పథకాలకు మళ్లించి చేతులు దులుపుకుంటున్నది.

వివిధ కేటగిరీలకు చెందిన వెనుకబడిన తరగతుల వారికి, షెడ్యూల్ కులాల, తెగలతో పాటు మైనారిటీ విద్యార్థులకు ట్యూషన్‌ఫీజులు, స్కాలర్‌షిప్‌లు చెల్లించేందుకు ప్రభుత్వం నిధులను బడ్జెట్‌లో కేటాయించి, ఆ తరువాత మాత్రం దారి మళ్లిస్తున్నది. దాంతో విద్యార్థుల సంక్షేమం గాలికొదిలినట్లైతున్నది. ఈ భారం పెరిగి, పెరిగి పూడ్చుకోలేనిదిగా మారుతున్నది. అధికారాన్ని కాపాడుకోవడం కోసం ప్రభుత్వం తన స్వంత సంక్షేమ పథకాలకోసం, తన పార్టీ పటిష్టత కోసం ఈ ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తూ విద్యారంగాన్ని బలహీన పరుస్తున్నది. ఈ విద్యాసంవత్సరం మంజూరైన నిధుల వివరాలను పరిశీలిస్తే, అందులో వినియోగించినవి ఎన్ననే ప్రశ్న ఉదయిస్తుంది. ట్యూషన్‌ఫీజులు, స్కాలర్‌షిప్‌లు సక్రమంగా చెల్లించకపోవడం వల్ల అనేక సమస్యలు తలెత్తుతున్నాయని ఇటు యాజమాన్యాలతో పాటు, విద్యార్థులు కూడా అనేకసార్లు విద్యాశాఖతోపాటు ప్రభుత్వానికి మొరపెట్టుకున్నారు.

2005-2011 వరకు విద్యారంగానికి కేటాయించిన బడ్జెట్ వివరాలు

| సంవత్సరం | బడ్జెట్ | విద్యారంగానికై కేటాయించిన శాతం |
|---|---|---|
| 2005-2006 | 4346.45 | 8.09 |
| 2006-2007 | 5301.45 | 9.86 |
| 2007-2008 | 6181.55 | 11.50 |
| 2008-2009 | 8655.07 | 16.10 |
| 2009-2010 | 7936.08 | 14.77 |
| 2010-2011 | 9824.37 | 18.28 |
| 2011-2012 | 11500 | 21.24 |

అయినా ప్రభుత్వం నుంచి కనీస స్పందన కరువైంది. అనేక ప్రజాసమస్యలలాగే ఈ సమస్యను కూడా పెండింగ్‌లో పెట్టి తన పబ్బం గడుపుకుంటున్నది సర్కార్.

ఫిబ్రవరి 2011 నాటికి విద్యా రంగానికి నిధుల మంజూరు వివరాలు (రు.లక్షలలో)

| శాఖ | ట్యూషన్ ఫీజు | స్కాలర్‌షిప్ | మొత్తం |
|---|---|---|---|
| సాంఘిక సంక్షేమం | 41,775 | 21673.25 | 63448.75 |
| గిరిజన సంక్షేమం | 9975 | 6650 | 16,625 |
| బి.సి. సంక్షేమం | 1,04,255 | 47,100 | 1,51,355 |
| ఇ.బి.సి. సంక్షేమం | 45,393.25 | ... ... | 45,393.25 |
| వికలాంగుల సంక్షేమం | 490 | .... ..... | 490 |
| మైనారిటీ సంక్షేమం | 13,171 | 6400 | 19571 |

ప్రస్తుతం విద్యాసంవత్సరం ముగింపు దశకు చేరుకుంటున్న తరుణంలో, విద్యార్థులకు చెల్లించాల్సిన బకాయిలను ప్రభుత్వం వెంటనే ఆయా కళాశాలలకు పంపించాలి. లేని పక్షంలో విద్యారంగంలో రానున్న రోజుల్లో మరింత సంక్షోభాన్ని చవిచూడక తప్పదు. అట్లా ప్రజాగ్రహాన్ని ఎదుర్కొకముందే పాలకులు మేలుకోవాలి. ఫీజుల బకాయిలను తిరిగి చెల్లించి పేద, మధ్య తరగతి, బడుగు, బలహీనవర్గాలకు చెందిన విద్యార్థుల ఆశలను నిరాశ కాకుండా చూడాలి. పొరుగు రాష్ట్రాల్లో అమలవుతున్న మేలైన పద్ధతులను రాష్ట్రంలో కూడా అవలంబించాలి. తద్వారా మాత్రమే డ్రాప్ అవుట్లను నిరోధించడానికి వీలవుతుందని గమనించాలి. పోటీ ప్రపంచంలో తమ కలలు నెరవేర్చుకోవడానికి విద్యార్థి లోకం సిద్ధంగానే ఉన్నప్పటికీ ప్రభుత్వ పట్టనితనం వారి పాలిట శాపంగా మారుతున్నదని గుర్తించాలి. ఇందుకోసం విద్యాశాఖ సరైన పద్ధతులను పాటించి ఈ సమస్యను వీలైనంత త్వరలోనే పరిష్కరించాల్సిన అవసరం ఎంతైన ఉంది. డా.బి.ఆర్.అంబేద్కర్ రాజ్యాంగంలో పొందు పరిచనట్టు విద్య అనేది ప్రాథమిక హక్కు అనే ప్రాథమిక విషయాన్ని ఇప్పటికైనా సర్కార్ తెలుసుకొని మసులుకోవాలి.

*(డాక్టొరల్ ఫెలో, హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయం)* వీ

*భూమి ఉనవాళ్లు లాభదాయక ఆదాయ మార్గాల వైపు మళ్లిపోగా, వ్యవసాయ సంక్షోభ భారాన్ని కౌలుదార్లు, చిన్న రైతులు, వ్యవసాయ కూలీలు మోస్తున్నారని అంటున్నారు* **ముద్దసాని శ్రీకాంత్ రెడ్డి**

# వ్యవసాయం రుణభారం - సాయం దూరం

'**భా**రతదేశం గ్రామాల్లో నివసిస్తుంది. గ్రామ శ్రేయస్సు దేశ సౌభాగ్యం' అని నుడివిన గాంధీజీ పలుకులను విస్మరించిన పాలకులు వ్యవసాయరంగాన్ని గత ఆరు దశాబ్దాల కాలంలో సమస్యల వలయాల సుడిగుండంలో వదిలేశారు.

ఆగస్ట్ 2011లో జరిగిన జాతీయ వ్యవసాయ పరిశోధనా మండలి సమావేశంలో ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ రెండవ హరిత విప్లవ ఆవశ్యకతను వివరించడం ముదావహమే అయినా వ్యవసాయరంగానికి మౌలిక సదుపాయాలు సమకూర్చడంలో పాలకుల ఆసక్తి, మేధావుల, ఆర్థిక నిపుణుల నిస్వార్థ సేవా తత్పరత ప్రస్తుత పరిస్థితుల్లో వ్యవసాయాన్ని సుభిక్షం చేసి ఆహార భద్రత కల్పించడానికి, గ్రామీణ వలసల నిరోధానికి తక్షణావసరం అని చెప్పక తప్పదు. 1951 నాడు 82 శాతం మించి ఉన్న గ్రామీణ జనాభా 2011 నాటికి 68 శాతానికి తగ్గడమే కాకుండా నిరంతరాయంగా సాగుతున్న గ్రామీణ వలసలు పట్టణాల, నగరాల వైపు కొనసాగడం వ్యవసాయరంగ మనుగడనే ప్రశ్నార్థకంగా మార్చింది.

ప్రపంచ దేశాలతో పోలిస్తే మన దేశానికి అత్యంత సారవంతమైన, అన్ని పంటలకు అనువైన భూవసతి ప్రకృతి వరప్రసాదంగా లభించినా (మొత్తం ప్రపంచ దేశాల్లోని సాగు యోగ్యమైన భూ వసతిలో 11.2 శాతం ఒక్క భారతదేశంలోనే ఉంది.) ప్రపంచ దేశాలన్నిటికంటే అత్యధిక శాతం (35 శాతం) భూమికి సాగునీటి లభ్యత ఉన్నా, ప్రపంచ దేశాలన్నిటి కన్నా ఎక్కువ జనబాహుళ్యం (వర్కింగ్ పాపులేషన్) కలిగి ఉన్నా వ్యవసాయరంగం రుణగ్రస్తమైన ఉండడానికి కారకాలు, కారణాలు కూడా అధికమే. వ్యవసాయరంగాన్ని ప్రభావితం చేసే ప్రకృతి కారణాల కంటే కూడా ప్రభుత్వ విధాన నిర్ణయాలు, అసంబద్ధ, అనాలోచిత చట్ట నియంత్రణ, బహుళజాతి సంస్థలపై ప్రభుత్వ పక్షపాతం, ప్రభుత్వ యంత్రాంగ నిష్క్రియాపరత్వం, భావితరాల్లో కర్షక వృత్తిపట్ల ఎడతెగని విముఖత చూపడానికి ముఖ్య కారణాలుగా కనబడుతున్నాయి. అదే విధంగా పెరుగుతున్న జనాభా, తరుగుతున్న భూకమతాలు, గిట్టుబాటు కాని పంటల సేద్య విధానం, ప్రపంచీకరణ పోకడలు, రుణగ్రస్త గ్రామీణ జీవన విధానం ప్రస్తుతం సేద్యాన్ని అతలాకుతలం చేస్తున్న ఇతర ముఖ్య కారణాలు.

గడిచిన అర శతాబ్ద కాలంలో వ్యవసాయ దృశ్యాన్ని పరీక్షిస్తే ప్రస్తుత పరిస్థితికి మూలం అర్థం కాక మానదు. వ్యవసాయదారులు చిన్న రైతులు ఈ అర శతాబ్ది కాలంలో వ్యవసాయ కూలీలుగా మారి, పల్లెల్లో కూలీ గిట్టుబాటుకాక పట్టణాల వలస పడుతున్నారు. 1951లో 72 శాతం ఉన్న వ్యవసాయదారులు 2001లో 54.4 శాతానికి పడిపోగా, 28 శాతం ఉన్న వ్యవసాయ కూలీల శాతం ఈ అర శతాబ్ది కాలంలో 45.6 శాతంకు పెరగడం గమనార్హం. ఈ పరివర్తనకు ముఖ్య కారణం చిన్న, మధ్యతరగతి వ్యవసాయదారులు తమ కమతాలను తెగనమ్మి పెనుభారమవుతున్న రుణభారాన్ని తగ్గించుకోవడానికి చేసిన ప్రయత్నమే అని చెప్పవచ్చు. అదే విధంగా గ్రామీణ రైతుల్లో కౌలుదారు రైతుల సంఖ్య గత పది సంవత్సరాల కాలంలో ఇబ్బడిముబ్బడిగా పెరగడానికి దీన్ని ముఖ్య కారణంగా చెప్పవచ్చు. ప్రకృతి వైపరీత్యాల

**జాతీయ స్థూల ఉత్పత్తిలో వ్యవసాయ, అనుబంధ వృత్తుల వాటా (శాతంలో)**
**(2004-05 ధరల ప్రకారం)**

| | 2004-05 | 2005-06 | 2006-07 | 2007-08 | 2008-09 | 2009-10 |
|---|---|---|---|---|---|---|
| 1. వ్యవసాయం, అటవీ, మత్స్య సంబంధ పరిశ్రమలు | 18.9 | 18.1 | 17.2 | 16.4 | 15.7 | 14.6 |
| 2. పరిశ్రమలు (గనులు, విద్యుచ్ఛక్తి, రియల్ ఎస్టేట్, పరిశ్రమలు మొదలైవి) | 28.0 | 27.9 | 28.7 | 28.8 | 28.0 | 28.5 |
| 3. సర్వీసులు, సేవలు | 53.1 | 53.9 | 54.2 | 54.8 | 56.4 | 56.9 |
| **మొత్తం** | **100** | **100** | **100** | **100** | **100** | **100** |

మూలం : సెంట్రల్ స్టాటిస్టికల్ ఆర్గనైజేషన్, న్యూఢిల్లీ

వల్ల అపార పంటనష్టం సంభవించినప్పుడు ప్రభుత్వ ఉదాసీన వైఖరి వల్ల పంట నష్టానికి పరిహారం కరువై రైతు వ్యవసాయమంటేనే విముఖత చూపుతున్నాడు.

గణాంకాలు పరిశీలిస్తే వ్యవసాయదారులు, వ్యవసాయంపై ఆధారపడ్డ వర్గాలు పచ్చని పల్లెలదారి విడిచి కాంక్రీట్ జనారణ్యాలైన పట్టణాలకు వలస వెళ్లడానికి గల ఆర్థిక కారణాలు దృగ్గోచరమవుతాయి. గత ఆరు సంవత్సరాల కాలాన్ని పరిశీలిస్తే వ్యవసాయరంగ దైన్యస్థితి కండ్లకు కట్టినట్టు కనిపిస్తుంది. జాతీయ స్థూల జాతీయోత్పత్తిని పరిశీలిస్తే 2004–05లో 19 శాతం ఉన్న వ్యవసాయ శాతం 2009–10లో 14.6 శాతానికి పడిపోగా అదే కాలంలో సర్వీసులు, సేవలు 53 శాతం నుండి 57 శాతం పెరగడం గమనించవచ్చు. మారుతున్న ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయరంగం పోటీ దిన దినం క్షీణించిపోగా మిగతా రంగాలైన సర్వీసులు, సేవలు, పరిశ్రమలు, రియల్ ఎస్టేట్ రంగం పుంజుకోవడం మనమందరం గమనించవచ్చు. పాతిక ఎకరాల భూస్వామి సరాసరి ఆదాయం పట్టణాల్లోని ఆఫీసుల్లో పనిచేసే దినసరి వేతన జీతగానికంటే కూడా కడు హీనంగా ఉండే పరిస్థితి, ఎడతెగని పట్టణాల వలసలకు ముఖ్య కారణంగా భావించాల్సి ఉంటుంది.

**రుణగ్రస్తమైన గ్రామీణ రైతాంగం**

మొత్తం గ్రామీణ రైతాంగ కుటుంబాలు, రుణగ్రస్త రైతు కుటుంబాల సంఖ్య, రుణశాతం (దక్షిణాది రాష్ట్రాలు)

| | రాష్ట్రం | మొత్తం గ్రామీణ కుటుంబాలు | రైతు కుటుంబాలు | రుణగ్రస్తమైన కుటుంబాలు | రుణగ్రస్తమైన కుటుంబాల శాతం |
|---|---|---|---|---|---|
| 1. | ఆంధ్రప్రదేశ్ | 142512 | 60339 | 49493 | 82 |
| 2. | కర్ణాటక | 69906 | 40413 | 24897 | 61.1 |
| 3. | కేరళ | 49942 | 21942 | 14126 | 64.4 |
| 4. | తమిళనాడు | 110182 | 38880 | 28954 | 74.5 |
| 5. | భారతదేశం | 1478988 | 893504 | 434242 | 48.6 |

మూలం : నేషనల్ సాంపుల్ సర్వే (59వ రౌండ్)

పైన పేర్కొన్న వివరాలు ప్రకారం దక్షిణాది రాష్ట్రాల్లో వ్యవసాయ వృత్తిపై మనుగడ సాగించే కుటుంబాల్లో అత్యధిక శాతం రుణభారాన్ని మోస్తుండడం గమనార్హం. ఇట్టి వ్యవసాయ కుటుంబాల శాతం మన రాష్ట్రంలో అత్యధికంగా 82 శాతం ఉండగా ఇతర దక్షిణాది రాష్ట్రాల్లో, తమిళనాడులో ఇది 74.5 శాతం ఉంది. దక్షిణాది రాష్ట్రాల్లో రుణగ్రస్తమైన వ్యవసాయ కుటుంబాల సరాసరి శాతం (70 శాతం) దక్షిణాది రాష్ట్రాల వ్యవసాయ సంక్షోభాన్ని తేటతెల్లం చేస్తోంది. దక్షిణాది రాష్ట్రాల రైతులు గత దశాబ్ద కాలంలో వాణిజ్య పంటల వైపు ఆకర్షితులై అధిక పెట్టుబడులు పెట్టి, బహుళజాతి కంపెనీల మాయాజాలంలో చిక్కి, తగిన గిట్టుబాటు ధర లభ్యం కాక అప్పులపాలై ఆత్మహత్యల వంటి విపరీత నిర్ణయాలు తీసుకోవడాన్ని గత పది సంవత్సరాల కాలంలో పెరిగిన రైతు ఆత్మహత్యలే పరిస్థితిని తెలియజేస్తాయి.

ఈ పట్టికలో ముఖ్యంగా గమనించవలసిన అంశం చిన్న, మధ్యతరగతి కమతాల రైతు కుటుంబాల రుణశాతం తక్కువగా ఉండి, మధ్యతరగతి, ఆపై రైతు కుటుంబాల రుణశాతం పెరుగుతూ ఉంది.

రైతు కమతాల వారీగా గ్రామీణ రైతాంగ పరిస్థితి (భారతదేశం)

| కమతాల విస్తీర్ణం (హెక్టార్లలో) | రైతు కుటుంబాల సంఖ్య (లక్షల్లో) | రుణగ్రస్తమైన రైతు కుటుంబాలు (లక్షల్లో) | రుణగ్రస్తమైన రైతు కుటుంబాల శాతం | సరాసరి రుణభారం (రూపాయల్లో) |
|---|---|---|---|---|
| <0.01 | 12.59 | 5.71 | 45.3 | 6121 |
| 0.01-0.40 | 292.87 | 130.11 | 44.4 | 6545 |
| 0.41-1.00 | 283.61 | 129.21 | 45.6 | 8623 |
| 1.01-2.00 | 160.60 | 81.92 | 51.0 | 13762 |
| 2.01-4.00 | 93.50 | 54.41 | 58.2 | 23456 |
| 4.01-10.00 | 42.58 | 27.73 | 65.1 | 42532 |
| >10.00 | 7.75 | 5.15 | 66.4 | 76232 |
| మొత్తం | 893.50 | 434.24 | 48.6 | 12585 |

మూలం : నేషనల్ సాంపుల్ సర్వే (59వ రౌండ్)

ఇందుకు ముఖ్యకారణం చిన్న, మధ్యతరగతి కమతాల రైతు కుటుంబాలు వ్యవసాయమే కాక ఇతర వ్యాపకాల వల్ల కూడా కుటుంబ పోషణ చేసుకోగా మధ్యతరగతి ఆపై తరగతి కమతాల రైతు కుటుంబాలు కేవలం వ్యవసాయంపై ఆధారపడడం వల్ల వారి సరాసరి రుణభారం పెరగడం గమనార్హం. ఎక్కువ సాగు విస్తీర్ణంలో పంటలు సాగు చేయడం వల్ల గిట్టుబాటు కాని వ్యవసాయం రైతును ఆర్థిక రుణగ్రస్తున్ని చేయడం ఆలోచించవలసిన అంశం.

ఈ కారణం వల్ల ఎక్కువ భూవసతి కలిగిన రైతులు వ్యవసాయం గిట్టుబాటుకాక వేరే వృత్తులు లాభదాయకంగా ఉండడంతో తమ భూముల్ని కౌలుకు ఇవ్వడం, చిన్న రైతులు, వ్యవసాయ కూలీలు గ్రామీణ రంగంలో వేరే ఉపాధి కరువై ఈ భూములను లీజుకు తీసుకొని, కౌలు పైకం చెల్లించలేక ఆత్మహత్యలే శరణ్యంగా భావించడం ప్రస్తుత వ్యవసాయరంగ దుస్థితికి అద్దం పడుతోంది.

## ప్రస్తుత వ్యవసాయ సంక్షోభం నుండి బయటపడేదెలా?

జూలైలో జరిగిన భారత వ్యవసాయ మండలి సమావేశంలో ప్రధాన మంత్రి మన్మోహన్‌సింగ్ దేశంలో రెండో హరిత విప్లవం ఆవశ్యకత గురించి ఉద్ఘాటించారు. దీనికి అవసరమైన, ఆవశ్యకత ప్రభుత్వ విధానాల రూపకల్పన, వాటిని అమలు పరచవలసిన బాధ్యత, భవిష్యత్ వ్యవసాయ ముసాయిదా, వ్యవసాయరంగ నిపుణులు, ఆర్థిక ప్రణాళికా రూపకర్తల సమన్వయంలో రూపొందించవలసిన అవసరం ఉంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు 1980 తరువాత వ్యవసాయరంగాన్ని అలక్ష్యం చేయడం వల్ల వ్యవసాయ ఉత్పాదకత తగ్గింది. మొదటి అయిదు పంచవర్ష ప్రణాళికల్లో వ్యవసాయానికి, దాని అనుబంధ రంగాలకు కేంద్ర ప్రభుత్వం 12.3 శాతం నుండి 16.7 శాతం ఖర్చు చేసినా ప్రణాళికా వ్యయం పెరిగిన కొద్దీ వ్యవసాయరంగం వాటా పడిపోయి పదవ పంచవర్ష ప్రణాళికలో 5.2 శాతం చేరడం గమనార్హం. వ్యవసాయరంగానికి ప్రత్యేక బడ్జెట్ కేటాయించి వ్యవసాయ రంగాన్ని ఆదుకోవాలసిన తరుణం ఆసన్నమైంది. దేశంలో సగటు వర్షపాతం తగినంతగా ఉండి, అవసరమైన నీటి వనరుల లభ్యత ఉన్నా, వాటిని సద్వినియోగ పరచుకొని, నిలకడైన ఆహార ధాన్యాల ఉత్పత్తికి కృషి చేస్తే ప్రజలకు ఆహార భద్రత కల్పించడంతోబాటు రైతుల సంక్షేమానికి ఉపయోగపడుతుంది.

## కనీస మద్దతు ధర కాదు లాభదాయక ధర నిర్ణయించాలి

పంట దిగుబడిని, తద్వారా ఆహార ఉత్పత్తులను పెంచేందుకు, వ్యవసాయరంగ పెట్టుబడులను ప్రోత్సహించే ఉద్దేశంతో మద్దతు ధరల విధానాన్ని రూపొందించారు. వ్యవసాయ మద్దతు ధరలను నిర్ణయించే ముందు వ్యవసాయ ధరల కమిషన్ (సి.ఎ.సి.పి.) పదకొండు ముఖ్యమైన ఆర్థికాంశాలను పరిగణనలోకి తీసుకోవడం జరుగుతుంది.

వీటన్నింటిలో ఉత్పాదక వ్యయం అతి ముఖ్యమైనది. కాని దురదృష్టం ఏమిటంటే సి.ఎ.సి.పి. నిర్ణయించిన మద్దతు ధరలకు కేంద్ర ప్రభుత్వం ఆమోదించిన మద్దతు ధరలకు వ్యత్యాసం కనబడుతోంది. అదే విధంగా సి.ఎ.సి.పి. తయారు చేసిన మద్దతు ధరల సూచి దేశంలోని అన్ని రాష్ట్రాలకు ఒకే విధంగా ఉంటుంది. కాని పంటలు పండించే విధానం పంటల ఉత్పాదనకయ్యే వ్యయం ప్రాంతాల వారీగా మారుతూ ఉంటుంది. అందువల్ల రాష్ట్ర ప్రభుత్వాలు కూడా స్వయంచాలిత వ్యవసాయ వ్యయాలను అధ్యయనం చేసే కమిషన్ ఏర్పాటు చేసి ప్రాంతాల వారిగా వివిధ పంటల మద్దతు ధరలను నిర్ణయించడమే కాకుండా ఆయా పంటలకు లాభదాయకమైన ధరలు రైతులోకానికి దక్కేలా చేస్తే, నేటి యువత వారి భవిష్యత్ రూపకల్పన వ్యవసాయ రంగంలో సాకారం చేసుకోగలుగుతారు.

## రైతు లోకాన్ని సంఘటిత శక్తిగా రూపొందించాలి

ఉద్యోగ, కార్మిక రంగాలు సంఘటితమవడం వల్లే ప్రభుత్వాలు వారి సమస్యలు, ఇబ్బందులు తొలగించి వారి ఆర్థిక పురోభివృద్ధికి సాయపడుతున్నాయి. కాని దేశంలోని అత్యధిక జనాభా ఉన్న రైతాంగ సమస్యలు నానాటికీ పెరిగిపోతూ వ్యవసాయాన్నే రైతాంగం మానుకొనే పరిస్థితి దాపురించడానికి ముఖ్యకారణం కర్షకుల్లో ఐకమత్యం లోపించడం, రాజకీయ పార్టీల వల్ల గ్రామాలలో రైతుల మధ్య పరస్పర సంబంధాలు దెబ్బతిన్నాయి. రైతు సంఘాల చీలికవల్ల ఏమీ సాధించుకోలేక కాడి దించేసే పరిస్థితి దాపురించింది. రాజకీయ జోక్యంలేని, ప్రాంతీయ భేదాల్లేని రైతు సంఘాల సంఘటిత శక్తి వల్ల మార్కెట్ వర్గాలతో, ప్రభుత్వాలతో చర్చించి రైతు సమస్యల పరిష్కారానికి ఉద్యమించవలసిన తరుణం ఆసన్నమైందని రైతాంగం గ్రహించవలసిన సమయం ఇదే.

*(రచయిత సీనియర్ సైంటిస్ట్,*
*ఆచార్య ఎన్.జి. రంగా వ్యవసాయ విశ్వవిద్యాలయం)* వీ

*ప్రపంచ సోషలిస్టు విప్లవానికే దిక్సూచిగా నిలవనున్న దండకారణ్యాన్ని కాపాడుకోవాలసిన అవసరాన్ని వివరిస్తున్నారు* **శెట్టి రాజపాపయ్య**

# దండకారణ్యంలో విరబూస్తున్న విలువలు

దేశమంతా 63వ గణతంత్ర దిన వేడుకలు ఘనంగా జరిగాయి. ఐదు నెలల తర్వాత 66వ స్వాతంత్ర్య దిన వేడుకలు కూడ అట్టహాసంగా దేశమంతా జరుగుతాయి. కాని మధ్య భారతంలో గణతంత్ర, స్వాతంత్ర్య దినవేడుకలు జరగలేదు, జరగవు. దేశమంతా ఈ వేడుకలు జరిగినా, ఇక్కడ ఎందుకు జరగవనే విషయాన్ని సమగ్రంగా పరిశీలిస్తే, భారత ప్రభుత్వ డొల్లతనం బయటపడుతుంది. ఉత్తర, దక్షిణ భారతదేశాల మధ్య ఉండే ఈ దండకారణ్యంలో నివసించే 70 లక్షల జనాభాలో ఉన్న ఆదివాసులయిన కోయ, దోర్ల తెగలకు చెందిన ప్రజలు ఉన్నారు. శతాబ్దాల తరబడి వారు తమ శ్రమను మాత్రమే నమ్ముకుని జీవిస్తున్నారు. ఇక్కడి ప్రజలకు స్వాతంత్ర్యం అంటే తెలవదు. సర్కార్ అంటే తెలవదు. కాని ఒక్కటి మాత్రం తెలుసు, 1980 దశకం ముందు 'బూర్జువా సర్కార్' ఉండేది. ఈ సర్కార్ నేతృత్వంలో అడవి అధికారులు ప్రజల మీద అత్యాచారాలు, దోపిడీ, దౌర్జన్యం చేసేవారు. పల్లెల మీద పడి గొడ్డు, గోద, మేక, కోళ్లు ఎత్తుకెళ్లేవారు. అడవిలో మేకలను, గొడ్లను, కోళ్లను మేపుకున్నందుకు పన్ను కట్టించుకునేవారు.

శతాబ్దాల తరబడి ఇప్పపువ్వు, చింతకాయ, ఉసిరికాయ, బంక, తేనె, తునికాకులు, కట్టెపుల్లలు అమ్ముకొని అర్ధాకలితో గడుపుతూ, సంవత్సరంలో ఆరునెలలు పస్తులతోనే జీవించేవారు. విద్యకి, వైద్యానికి దూరంగా ఆదిమ మానవుని జీవితమే మూడు దశాబ్దాల క్రితం వరకు కొనసాగింది. 1980లో తెలంగాణ గ్రామాలలో వెల్లివిరిసిన విప్లవ ప్రభంజనం విద్యార్థులను గ్రామాలకు తరలివెళ్లేలా చేసింది. ఈ ప్రభంజనమే వందలాది విద్యార్థులను గోదావరి, శబరి, ఇంద్రావతి నదులను దాటి ఈ ఆదివాసి గూడెలకు వెళ్లేలా చేసింది. ఆదిమ మానవుని జీవితంలాగే ఈ మూలవాసుల జీవితాలుకూడా నడుస్తుండగా, బుడ్డగోచి నుండి ఒళ్లంతా వస్త్రాలు ధరించి జీవించే విధంగా సంస్కృతిని నేర్పింది. ఒక పురుషుడు నలుగురైదుగురు స్త్రీలను పెళ్లాడే ఘడ్ ఆటవిక విధానం నుండి ఒక స్త్రీని మాత్రమే పెళ్లాడి అన్యోన్యంగా జీవించే విధానానికి అంకురార్పణ చేసారు. ఆ విప్లవ విద్యార్థులు నేడు ఒక్కరొక్కరుగా నేలకొరుగు తున్నారు. వారు నాడు చేపట్టిన సంఘ నిర్మాణం ఆ పల్లెల్లో ప్రజలందరినీ ఏకంచేసింది. ఆ నాయకత్వంలో అటవీ అధికారులను, వారి వెనుక ఉన్న పోలీసు అధికారులను తరిమికొట్టారు. లక్షలాది హెక్టార్ల విశాల అడవిలోని ఇప్పచెట్లను తప్ప మిగతా చెట్లను కొట్టి, విత్తనాలు చల్లి ప్రకృతి మీద ఆధారపడి బతుకులీడ్చారు. చత్తీస్‌గడ్ ఏర్పడక ముందు మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని బస్తర్ జిల్లా అత్యంత పెద్దజిల్లాగా దేశంలోనే పేరొందింది. చత్తీస్‌గడ్ రాష్ట్రంగా ఏర్పడిన తర్వాత దీనిని మూడు జిల్లాలుగా ఏర్పరిచిన ప్రభుత్వం, ప్రజాభివృద్ధిని మాత్రం మరిచింది. కాని సంఘ నాయకత్వం చత్తీస్‌గడ్ ఏర్పడక ముందు రెండు దశాబ్దాల క్రితమే ఈ ప్రాంతాన్ని, మహారాష్ట్రలోని కొంత అటవి ప్రాంతాన్ని, ఇంకొన్ని ప్రాంతాలను కలిపి దక్షిణ, ఉత్తర, తూర్పు, పడమర బస్తర్‌లుగా విభజించుకుని నూతన మానవుడు ఉద్భవించడానికి పోరాటం కొనసాగిస్తున్నది. తూర్పుబస్తర్‌లోని బైలదిల్లాలోని అపారమయిన ఇనుపరాతి ఖనిజాన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎగుమతి చేసి ఈ ప్రాంత ఆదివాసులకు కనీసం రెండు పూటలు పట్టెడన్నం కూడ పెట్టలేక పోయాయనేది వాస్తవం.

ఉత్తర, దక్షిణ తెలంగాణలో అంచెలంచెలుగా అభివృద్ధి చెందిన విప్లవ నాయకత్వం దండకారణ్యానికి విస్తరించి ప్రజలను మరింత సంఘటితం చేసే క్రమంలో నీళ్లల్లో చేపల్లాగా ఆదివాసి జీవితాల్లో వీరు కలిసిపోయారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల దమనకాండను ఎదిరించి, అశేష ప్రజానీకాన్ని ఏకంచేసి ప్రజాందోళనను సమర్థవంతంగా నిర్వహించారు. ఈ మహత్తర కృషిలో ఎందరో విద్యార్థులూ, యువతీ, యువకులూ తమ ప్రాణాలను తృణప్రాయంగా అర్పించారు. ఆదివాసుల అభివృద్ధే తమ అభివృద్ధిగా భావించి ఆదివాసి నాయకత్వాన్ని ఎదిగిస్తున్నారు. ఈ ఆదివాసులు సంఘటితమవ్వడాన్ని చూసి ఓర్వలేని ప్రభుత్వం ఎందరో ఆదివాసేతర నాయకత్వాన్ని బూటకపు ఎదురుకాల్పుల్లో చంపి వేసింది. అయినా, మొక్కవోని ధైర్యంతో ఆదివాసి ప్రజలను సంఘటితం చేస్తూనే ఉన్నారు.

దశాబ్దంన్నరగా చేసిన కృషి ఫలితంగా 1996 నుండే గూడేలలో ప్రారంభమయిన ప్రజారాజ్యాధికారం 2001 నాటికే బీజరూపంలో జనతనసర్కార్‌గా మొలకెత్తింది. రాష్ట్ర స్థాయిలో ఏర్పడిన జనతన సర్కార్ డివిజన్, ఏరియా, పంచాయితీ, గ్రామస్థాయి వరకు ప్రజాస్వామ్యబద్ధంగా ప్రభుత్వ కమిటీలను ఎన్నుకుని, దోపిడీ, దౌర్జన్యం లేని ప్రభుత్వంగా వెలుగొందుతోంది. అన్ని రంగాలలో స్వేచ్ఛ- సమానత్వం- సౌభ్రాతృత్వంతో దినదినంగా అభివృద్ధి చెందుతోంది.

దేశంలోని అత్యంత విలువయిన 64 ఖనిజాలు ఈ విశాల అడవి గర్భంలో దాగి ఉన్న విషయం సెటిలైట్, జియలాజికల్ సర్వేల ద్వారా సమాచారం సేకరించింది మన్మోహన్‌సింగ్, రమణ్‌సింగ్‌ల ద్వయం. ఈ అడవి నుండి ఆదివాసులను, వారికి నాయకత్వం వహిస్తున్న సంఘ నాయకత్వాన్ని నిర్మూలించడమే ధ్యేయంగా గడచిన పది సంవత్సరాలుగా ప్రజలను చంపివేస్తున్నది. దేశ సంపదను మొత్తంగా దోచిపెట్టే క్రమంలో బహుళజాతి సంస్థలు, గుత్త పెట్టుబడిదారులయిన ఎస్సార్, పోస్కో, వేదాంత, జిందాల్, టాటా, నిక్కో, జైస్వాల్‌లకు ఈ అడవిని అప్ప గిచ్చేందుకు రకరకాల ప్రయత్నాలు చేస్తున్నది. సాధారణ, సి.ఆర్.పి.ఎఫ్., పారామిలటరీ బలగాలను, కోయ కమాండోలను ఆఖరికి సైన్యాన్ని కూడా రంగంలోకి దించి, జంగిల్ వార్‌పేర్‌ను సృష్టించి మారణహోమం కొనసాగిస్తున్నది.

గ్రామాల మీద మూకుమ్మడిగా దాడిచేసి ఇళ్లను తగల బెట్టడం, గొడ్డు, గోద, మేక, గొర్రె, కోళ్లు, పందులను ఎత్తుకుపోవడం, ధాన్యాన్ని మంటల్లో పడవేయడం, భర్త కళ్లముందే భార్యను చెరచడం, కొడుకు ముందే తండ్రిని చంపడం వంటి దుర్మార్గాలు జరిగిపోతున్నాయి. గ్రామ, గ్రామానికి పదుల సంఖ్యలో ప్రజలను చంపి వారి శవాలను ఇంద్రావతి నదిలో పారేశారు. ఈ ఆదివాసి తెగలలోని పెత్తందారీ స్వభావం కలిగిన దోర్ల తెగలోని పెత్తందార్ల సహాయంతో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు శాంతిసేన పేరుతో సల్వాజుదుం అనే దుర్మార్గమయిన ముఠాను తయారు చేశాయి. కుంట నుండి రాయ్‌పూర్ వరకు వెళ్లే రోడ్డు సరిహద్దులలో వందలాది క్యాంపులను సృష్టించి ప్రజలందరిని ఆ క్యాంపులల్లోకి బలవంతంగా ఈ ముఠా తరలించింది. చాపలను పట్టాలంటే నీళ్లను తోడాలనే పద్ధతిని అవలంబించా లనే పద్ధతిలో ఆదివాసి ప్రజలందరిని అడవి నుండి వెళ్లగొట్టి, వారిని సంఘటితం చేసిన నాయకత్వాన్ని చంపివేయవచ్చునని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పథకాలు వేశాయి. సంఘ నాయకత్వం ఈ కుట్రను ప్రజాబలంతో ఎదిరించి మెజారిటీ ప్రజలను గ్రామాలలోకి తీసుకు రాగలిగింది. తెలియక తప్పు చేసిన ఆదివాసులను కూడ క్షమించి ప్రజలలో భాగం చేసింది.

రోడ్డు పక్కన వేసిన క్యాంపులన్నీ కాన్‌సంట్రేషన్ క్యాంపులుగా మారాయి. రెండో ప్రపంచ యుద్ధంలో నాజీ ఫాసిస్టులు రష్యన్ ప్రజలను ఏవిధంగా చిత్రహింసలకు గురిచేశారో ఆవిధంగానే చిత్రహింసలు కొనసాగాయి. ప్రజలు సంఘటితం కాకుండా తమ సమస్యలు పరిష్కరించు కోలేరు, యుద్ధాన్ని గెలువలేరు అనే సత్యాన్ని ప్రజలకు అర్థం చేయిస్తూ, ఉద్యమం వారిని సంఘటితపరుస్తోంది. శతాబ్దాల తరబడి వారికి విద్య, వైద్యం, సంక్షేమ పథకాలు అమలుచేయని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు గడచిన పది సంవత్సరాలుగా ఈ విశాల అడవిలో ప్రతి పది కిలోమీటర్లకు ఒక పోలీస్‌స్టేషన్ చొప్పున కార్పెట్ పోలీస్ వ్యవస్థను ఏర్పాటు చేసి, అమెరికా అధికారుల సూచనల మేరకు 'ఫోర్టిఫికేషన్' చేసాయి. కారం, ఉప్పు, వస్త్రాలు ఇంకా తదితరాలు కొనేందుకు సంతల్లోకి వెళుతున్న ఆదివాసులను సంతల్లోనే పోలీసులు, సల్వాజుదుం మూకలు చంపేస్తున్నాయి.

పోడు కొట్టుకొని వ్యవసాయం చేసుకున్నంత మాత్రాన తమ సమస్యలు పరిష్కారం కావని ఆదివాసిలు భావించారు. ఆకలి తీరలేదు, సమగ్ర వికాసం అంతకంటేలేదు. వీటన్నింటికి పరిష్కారం పోరాడి రాజ్యాధికారం సాధించడంలోనే ఉందని గ్రహించారు. అందుకే ప్రజలందరూ స్వాలంబన వైపు ఆలోచిస్తున్నారు. అడవికి ఆదివాసునికి ఉన్న దృఢమయిన సంబంధాన్ని ధృవపరుస్తూ జనతన సర్కార్ నేతృత్వంలో 'యుద్ధం–ఉత్పత్తి–స్వావలంబన– ప్రజాందోళన – రాజ్యాధికారం' నినాదాల వెలుగులో నిర్దిష్ట కార్యక్రమం రూపొందించుకుని యుద్ధాన్ని గెలుస్తున్న ఆత్మవిశ్వాసం తోనే 'పసిబాలుడి నుండి పండుముదుసలి వరకు' సమిష్టిగా కదులుతున్నారు. తమను, తమకు నాయకత్వం వహిస్తున్న జనతన సర్కార్ నాయకత్వాన్ని, వీరందరినీ రక్షిస్తున్న అడవిని కాపాడుకుంటూనే స్వావలంబన వైపు అడుగులు వేస్తున్నారు. పది సంవత్సరాల క్రూర నిర్బంధాన్ని ఎదిరిస్తూ 'భూంకాల్ 'పోరాట దినోత్సవాన్ని గత సంవత్సరం ఘనంగా జరుపుకుని జనతనసర్కార్ నాయకత్వంలో నాలుగు డివిజన్ల సర్కార్ కమిటీలు భూమి చదును కార్యక్రమాన్ని తీర్మానించాయి. వారి పర్యవేక్షణలోనే దాదాపు 800 పంచాయితీలలోని 4000 గూడేలలోని 15 లక్షల మంది ప్రజలు సమిష్టి నాయకత్వంలో ఈ గూడేలలోని నిరుపేదల భూములను గ్రామరక్షణ కమిటీలతో సహా, జనతన సర్కార్ డివిజన్ కమిటీ నాయకత్వం కూడా పాల్గొని భూమిని చదును చేసింది. ఒక రోజుకు ఎకరం నుండి మూడు ఎకరాల వరకు, 7 సంవత్సరాల పసిబాలుడు, బాలికలనుండి మొదలుకుని పండుముదుసలి వరకు, సమిష్టిగా ఉదయం 5 గంటల నుండి 11 గంటల వరకు, భోజనానంతరం మధ్యహ్నాం 2 గంటల నుండి సాయంత్రం 5 గంటల వరకు 40 రోజులు భూమిని చదును చేశారు. దాదాపు 80,000 ఎకరాలు చక్కగా చదును చేయగా, ఆ నిరుపేద ప్రజలల్లో వెల్లి విరిసిన ఉత్సాహం గ్రామాల ఐక్యతకు, సమిష్టి కృషికి నిదర్శనంగా నిలిచాయి. గతంలో ధాన్యం చల్లి, ప్రకృతి మీద ఆధారపడి మాత్రమే బతికే రైతాంగం తమకృషి వలన చదునయిన భూములలో పప్పు దినుసులు, నువ్వులు, మెక్కజొన్నలు, పజ్జొన్నలు, వరి, గోధుమ లాంటి ధాన్యాన్ని పండించడమే కాక గ్రామానికి సరిపడే కూరగాయలు కూడా పండిస్తూ స్వావలంబన వైపు అడుగులేస్తున్నారు.

గత సంవత్సరం వచ్చిన మహత్తర అనుభవంతో ఈ సంవత్సరం జనవరి 10 నుండి మొదలయిన ఈ సమిష్టి శ్రమ మరింత నూతనోత్సాహంతో ముందుకెళుతున్నది. లక్ష ఎకరాలు లక్ష్యంగా పెట్టుకుని కదం కదం కలుపుతూ 'చేతనైనంత శ్రమచేస్తూ, ఆకలయినంత అన్నం తింటూ' ఆదివాసి రైతాంగం భూమిని చక్కగా చదును చేశారు. మధ్య, మధ్య శ్రమ సౌందర్యం ఉట్టిపడే పాటలు, నాటికలు, సాంస్కృతిక కార్యక్రమాలు చేపడుతూ అధికారందక్కే వరకు పోరాడతామని ప్రతిజ్ఞ చేస్తున్నారు.

ప్రపంచ సోషలిస్టు విప్లవానికి ఈ దండకారణ్యమే భూమిక అవుతుందా అనే విధంగా జనతన సర్కార్ ముందు చూపు ఈ సమిష్టి కార్యక్రమం ద్వారా కనబడుతున్నది. గ్రామ, గ్రామానికి రక్షణగా విల్లంబులు, సంప్రదాయ ఆయుధాలు చేతబూనిన ఆదివాసి యువకుల రక్షణలో జరుగుతున్న ఈ పనిని జనతన సర్కార్ ప్రతినిధులు పర్యవేక్షణ జరుపుతూనే, వారుకూడ శ్రమలో భాగమవ్వడం చూస్తుంటే నాటి జనచైనాలోని హూనాన్ ప్రాంతం కళ్ల ముందు కనపడుతున్నట్లు అనిపించింది.

దేశం మొత్తంలో నేడు విప్లవోద్యమం మైదాన ప్రాంతాలనుండి ఆదివాసి ప్రాంతాలకే ఎక్కువగా పరిమిత మయింది. దీనికి కారణం సామ్రాజ్య వాద దేశాల, బహుళ జాతి సంస్థల, దళారీ నిరంకుశ బూర్జువాల అణచివేత విధానం ప్రధాన కారణంకాగా, సంస్థాగతమైన లోపాలు, నిచ్చెన మెట్ల కులవ్యవస్థ కూడా కారణంగా చెప్పవచ్చును. ఈ దేశంలో హిందూ మనువాద వెలుగులోని నిర్మితమయిన నిచ్చెనమెట్ల కులవ్యవస్థకు దూరంగా దాదాపు 20 కోట్ల జనాభా ఉన్నది. అందులో ఈ ఆదివాసులు నివసిస్తున్న జంగల్ మహల్ నుండి దండకారణ్యం వరకు విశాల అడవి ప్రాంతం కూడా ఉన్నది. ఈ ప్రాంతంలో దాదాపు 3 కోట్ల మంది వివిధ తెగలకు చెందిన ఆదివాసులు జీవిస్తున్నారు. వీరు నాగరిక సమాజం నుండి దూరంగా విసిరి వేయబడిన గూడేల్లో బతుకు లీడుస్తున్నారు. ప్రభుత్వాలు, వాటి సంక్షేమ పథకాలు వీరికి తెలువదు. వీరికి తెలిసిందల్లా అడవిని నమ్ముకుని బతకడమే. నేడు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఈ అడవిని, ఇందులో దొరికే అపారమయిన ఖనిజాలను బడాపెట్టుబడిదారులకు, బహుళజాతి సంస్థలకు అప్పగించేందుకు ఎంతటి హింసకయినా దిగుతున్నాయి. ఈ దుర్మార్గానికి వ్యతిరేకంగా పౌరసమాజం కదలకపోతే ఆదివాసులు మిగలరు. ఆదివాసులను రక్షించేందుకు, వారిని రక్షిస్తున్న విశాల అడవిని రక్షించుకునేందుకు, ఈ అడవిలోని విలువయిన జాతి సంపదను కాపాడుకునేందుకు మన సమాజం కదులుతుందని ఆశిద్దాం.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# భాషా రాష్ట్రాలపై అంబేద్కర్

**భా**షా ప్రయుక్త రాష్ట్రాలపై అంబేద్కర్ భావాల గురించి జరుగుతున్న చర్చలో జనవరి 2012 సంచికలో నా వ్యాసానికి జవాబుగా ఫిబ్రవరి 2012లో కృష్ణ ఆదిత్య రాసిన వ్యాసం నేను అడిగిన ఒక్క ప్రశ్నకూ సమాధానం రాలేదు. పైగా నేను చేసిన పరిశీలనలోనే లోపముందని ఎత్తిచూపారు. ఏమైనా సంపాదకుల సూచన మేరకు చాలా క్లుప్తంగానే కృష్ణ ఆదిత్య వ్యాసానికి జవాబిస్తాను.

1. అంబేద్కర్ భావజాలాన్ని ప్రస్తుత తెలంగాణ ఉద్యమానికి అన్వయించుకొని, ఆ భావజాలం ప్రత్యేక తెలంగాణ రాష్ట్రానికి అనుకూలమేనని అర్థం చేసుకొని, 'అంబేద్కర్ ఉంటే తెలంగాణ రాష్ట్రాన్ని సమర్థించేవారు' అని చాలామంది తెలంగాణ వాదులు భావిస్తున్నారు. అలాంటి తెలంగాణ వాదుల్ని 'పదేపదే బల్లలు గుద్దుతున్నారు' అని కృష్ణ ఆదిత్య అపహాస్యం చేశారు. అసలు తన వ్యాసం దేని గురించి రాశారో కూడా ఆయనకు గుర్తులేదు. 1953లో రాసిన వ్యాసానికి విశ్లేషణగా తన మొదటి వ్యాసం రాశానని, రెండవ వ్యాసంలో చెప్పుకున్న కృష్ణ ఆదిత్య, మొదటి వ్యాసంలో మాత్రం అది 'దీని పూర్వరంగంలో అసలు ఆయన (అంబేద్కర్) వెలిబుచ్చిన అభిప్రాయాల విశ్లేషణ..' అని రాశారు. పూర్వ రంగంలో భాషా రాష్ట్రాల మీద అంబేద్కర్ కేవలం 1953 వ్యాసంలోనే రాశారా? 1955 వ్యాసంలో రాయలేదా? అలాంటప్పుడు 1953 వ్యాసంలోని అంశాలను దాదాపు అన్నింటిని స్పృశించి, 1955 వ్యాసంలోని కేవలం 'ముందుమాట'లోని అంశాలనే, అదీ చాలా తక్కువగా స్పృశిస్తే అది పాఠకులకు ఏ అర్థాన్నిస్తుంది? అంబేద్కర్ భావాలకు 1953లో రాసిన వ్యాసమే ప్రామాణికమని, 1955 వ్యాసంలో పెద్దగా ఏమీ లేదనే అర్థాన్నివ్వదా? 'పూర్వరంగంలో'ని విషయాలను విశ్లేషిస్తున్నానని అన్నప్పుడు పాఠకుల దృష్టి 1953, 1955 వ్యాసాలు రెండింటిపైనా ఉంటుంది. కనుక 1955 వ్యాసాన్ని అప్రధానం చేసినపుడు పాఠకులు మిస్‌గైడ్ అయ్యే ప్రమాదముండదా? స్థలాభావం వల్ల కొద్ది అంశాలకే పరిమితమవ్వాల్సి వచ్చినపుడు ఏ రచయిత అయినా ఆ 'పూర్వ రంగం'లోని వ్యాసాలన్నింటినీ సమతూకంతో స్పృశించాలి. కృష్ణ ఆదిత్య ఆ పని చేయలేదు. మరీ ముఖ్యంగా 1955 వ్యాసంలో తన అభిప్రాయాలను అంబేద్కర్ మార్చుకున్నపుడు ఆ వ్యాసంలోని అంశాలను 'స్థలాభావం' దృష్ట్యా అందించలేక పోయానని చెప్పడం పాఠకులను గందరగోళపరచడమే. కనీసం '1955 వ్యాసంలో అంబేద్కర్ తన అభిప్రాయాలు మార్చుకొని భాషా రాష్ట్రాలను విడగొట్టవచ్చునని భావించారు' అనే ఒక్క వ్యాక్యమైనా కృష్ణ ఆదిత్య చేర్చి ఉండాల్సింది.

2. అంబేద్కర్ చిన్న రాష్ట్రాలకు అనుకూలం కాదని కృష్ణ ఆదిత్య అనని మాటలను నేను అతనికి ఆపాదించానని రాశారు. కానీ మొదటి వ్యాసంలోని 'అంబేద్కర్ విశాలాంధ్రని వ్యతిరేకించారని చెప్పవచ్చునా? ఒక భాష వారికి ఒకే రాష్ట్రం ఉండాలా? అన్న ప్రశ్న రూపంలో చిన్న చిన్న రాష్ట్రాల సమస్యను లేవనెత్తారా? అలాంటి అర్థంలో కొందరు అంబేద్కర్ వాదులు, చాలా మంది ప్రత్యేక రాష్ట్రవాదులు బల్లగుద్దుతున్నారు' అనే వాక్యాలను, 'తెలంగాణ నుంచి సంతకాలు చేసిన జెంటిల్మెన్ కూడా 1956లోనే విలీనానికి వారు అంగీకరించారు. భాషాపరంగా హైదరాబాద్‌ను ముక్కలు చేయడానికి సంపూర్ణమైన ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుని ఆయన బలపరిచారు. ప్రధానికి అది సమ్మతం కాకపోతే కొత్త రాష్ట్రాన్ని వరంగల్ రాజధానిగా ఏర్పాటు చేసి ఆ మేరకు కలపాలని మధ్యే మార్గంగా సూచించారు. శ్రీకృష్ణ కమిటీ తెలంగాణ జిల్లాలోని కొంత భాగాన్ని సీమాంధ్రలో చేర్చే ప్రతిపాదనని పోలిన సూచన అని గమనించాలి' అనే వాక్యాలను, 'రాష్ట్రాన్ని చీల్చితేనే కింది కులాలకు తగిన ప్రాధాన్యత ఉంటుందనడానికి ఎలాంటి వాస్తవిక ఆధారం లేదు. ఇది ఊహాజనితమే' అనే వాక్యాలను గమనిస్తే వాటిలోని వ్యాసకర్త మాటలు రాష్ట్రాల విభజనకు అంబేద్కర్ అనుకూలం కాదనే అర్థాన్నిస్తున్నాయి. కనుక ఆదిత్య మాటల ఆధారంగానే ఆ నిర్ధారణకు రావడం జరిగిందని గమనించాలి.

3. 'ఒక రాష్ట్రం – ఒక భాష' భావనను తాను మరుగుపరచలేదని, తన మొదటి వ్యాసంలో రాశానని కృష్ణ ఆదిత్య అంటున్నారు. అయితే అంతే రాసి ఊరుకున్నారా? 'అలాంటి అర్థంలో కొందరు అంబేద్కర్ వాదులు, చాలా మంది ప్రత్యేక రాష్ట్ర వాదులు బల్లగుద్దుతున్నారు' అని ఎంత వెటకారంగా రాశారు. అందుకే నా వ్యాసంలో 'ఒక రాష్ట్రం – ఒక భాష' గురించి అంత సుదీర్ఘ వివరణ ఇవ్వాల్సి వచ్చింది.

4. ఒక మనిషి మరణించాక ఏదైన ఒక సందర్భం వచ్చినపుడు ఆ మనిషి భావజాలంపైన ఆధారపడిన చర్చ జరిగినపుడు 'ఆ మనిషి బతికుంటే...' అని ఎవరైనా అనడం సర్వసాధారణమే. అలా అంటున్నామంటే అది ఆయన భావజాలాన్ని ప్రాతిపదికగా చేసుకుని అంటున్నమాటే. ఎందుకంటే ఆయన భావజాలం మనకు తెలుసుకనుక. చర్చ ఆ భావజాలం మీదే ఆధారపడి జరుగుతోంది. కనుక అలా అనడం ఊహ, స్పెక్యులేషన్ అవదు. అతని భావజాలానికి సంబంధించని, అతను చెప్పనిదాన్ని గురించి మాట్లాడుతూ 'అతను బతికుంటే...' అంటే అప్పుడది ఊహ, స్పెక్యులేషన్ అవుతుంది. 'మార్క్స్ బతికుంటే సెజ్‌లను వ్యతిరేకించేవాడు', 'మావో బతికుంటే చత్తీస్‌గడ్ పోరాటాన్ని సమర్థించేవాడు' అనడం వారి భావజాలాలకు సంబంధించిన మాటలే కనుక అవి ఊహలు కాదు. కానీ 'మార్క్స్ బతికుంటే పరమాణు నిర్మాణాన్ని వ్యతిరేకించేవాడనో', 'అంబేద్కర్ బతికుంటే వృక్షరాజ్య వర్గీకరణను తప్పనేవాడనో' నేను రాస్తే అది స్పెక్యులేషన్ అయ్యేది. కానీ అంబేద్కర్ స్వయంగా 1955 వ్యాసంలో చర్చించిన అంశాల ప్రాతిపదికనే 'అంబేద్కర్ బతికుంటే తెలంగాణ రాష్ట్రాన్ని సమర్థించేవాడని' రాస్తే దాన్ని ఆదిత్య ఊహ కింద జమకట్టారు. ఊహలు రాయడానికి ఫ్యామిలీ ఎంటర్‌టైనర్స్ వంటి చీప్ పత్రికలు బోలేడున్నాయి. దానికి 'వీక్షణం' లాంటి స్టాండర్డ్ పత్రిక అక్కర్లేదు. అలాంటి ఊహలకు సంపాదకులు తమ పత్రికలో అవకాశమిస్తారని నేననుకోను.

5. తన పాత అభిప్రాయాలను వదులుకోవడానికి సిద్ధమని, తన ఆలోచనల్లో ఫైనాలిటీ లేదని అంబేద్కర్ 1955లో అన్నారు. కృష్ణ ఆదిత్య కూడా దీన్ని అంగీకరించారు. అంటే తన 1953 వ్యాసంలో

కూడా అస్పష్ట అంశాలు ఏవైనా ఉంటే వాటిని కూడా వదులుకోవడానికి తాను సిద్ధమే అని, 1953 వ్యాసం మాత్రమే 'ఫైనల్' కాదని అంబేద్కర్ వినయంగా అంగీకరించినట్లే కదా. కానీ అందులో తెలంగాణ లేదని కృష్ణ ఆదిత్య రంధ్రాన్వేషణ. ఒక పెద్ద విషయంపై జరిగే చర్చలో, అది భారతదేశమంతటికీ సంబంధించిన చర్చ అయినపుడు, ఉదాహరణకు కొన్ని రాష్ట్రాలను తీసుకొని చర్చ సాగిస్తారు కానీ, ప్రతి ఒక్క రాష్ట్రాన్ని పేరుపేరునా పేర్కొని విశ్లేషించడం సాధ్యమయ్యే పనేనా? 'ఆ వ్యాసంలో తీసుకున్న ఉదాహరణల ఆధారంగా దేశంలోని అన్ని రాష్ట్రాలకు అంబేద్కర్ భావాలను అన్వయించుకుంటాం గానీ, తెలంగాణ గురించి లేదనో, తెలంగాణ పేరు లేదనో', 'తెలంగాణ గురించి అంబేద్కర్ ఒక్కమాటైనా రాయలేదని', 'తెలంగాణ గురించి మాత్రం పేర్కొనలేదని', 'అలాంటి మార్పుల్లో తెలంగాణ లేద'ని కృష్ణ ఆదిత్య 'ఫైనాలిటీ'కి రావడం ఎంతవరకు సబబు?

6. నా వ్యాసంలోని ఏ ప్రశ్నకూ కృష్ణ ఆదిత్య సమాధానం ఇవ్వలేదు. భాషా ప్రాతిపదిక రాష్ట్రం నుండి మరిన్ని ప్రాంతాలు విడిపోవచ్చునని అంబేద్కర్ అనలేదా? భాష ఆధారంగా కలిపి ఉంచడం అనేది కేవలం సౌకర్యమే కాని నియమం కాదని అంబేద్కర్ అనలేదా? భాష అనే భావనపై జరిగే విభజన యాంత్రికమని అనలేదా? రాష్ట్రాల విభజనకు అనేక ప్రాతిపదికలను వివరించలేదా? ప్రపంచంలో చాలా చోట్ల జరిగినట్లుగా ఒక భాష మాట్లాడే ప్రజలు అనేక రాష్ట్రాలుగా విభజించబడవచ్చు అనలేదా? 1953 వ్యాసంలోని అభిప్రాయాన్ని అంబేద్కర్ మార్చుకొని ఫైనాలిటీ లేదని ప్రకటించుకొని 1955 వ్యాసం రాస్తే కృష్ణ ఆదిత్య ఆ వ్యాసాన్ని అప్రధానం చేసి ఎందుకు మరుగున పరిచారు? లాంటి ఏ ప్రశ్నకూ కృష్ణ ఆదిత్య సమాధానం ఇవ్వలేదు.

7. కృష్ణ ఆదిత్య తన రెండో వ్యాసంలోనూ అంబేద్కర్ తెలంగాణ రాష్ట్రానికి సుముఖం కాదనే అర్థం వచ్చేలాగా రాశారు. 'దక్షిణాదిని ముక్కలు చేయడం మంచిది కాదనడంలో ఇమిడి ఉన్న భావాన్ని పాఠకులే గ్రహించాలి' అని అంబేద్కర్ విభజనకు వ్యతిరేకమనే అర్థాన్ని పాఠకులకు కలిగించారు. 1955లో భాషా రాష్ట్రాలను విడగొట్టవచ్చని అంబేద్కర్ స్పష్టంగా చెప్పినా, '1955 వ్యాసంలో తెలంగాణ గురించి ఒక్క వాక్యంలో కూడా ప్రస్తావించలేదు. అంతేకాదు 1955 వ్యాసంలోనే దక్షిణాదిని ముక్కలు చెయ్యడాన్ని వ్యతిరేకించారు' అని రాశారు. 1953-55 కాలంలో 'తెలంగాణలో కూడా గణనీయంగా విశాలాంధ్రవాదులే ఉండేవారు' అని రాసి ఆనాడు ఫజల్ అలీ కమిషన్‌కు కోస్తాంధ్రతో కలిసి ఉండబోమని స్పష్టంగా చెప్పిన లక్షలాది మంది తెలంగాణవాదులను గుర్తించలేదు. అంబేద్కర్‌లో వచ్చిన మార్పుల్లో 'తెలంగాణ లేదు. ఒక్క వాక్యం రాయలేదు' అని కృష్ణ ఆదిత్య రాశారు. వరంగల్ రాజధానిగా సంపూర్ణాంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలనే 1953 వ్యాసంలో అంశాలను అంబేద్కర్ ఎలా మార్పులు చేసుకొని 1955 వ్యాసం రాశారో నా వ్యాసంలో సవివరంగా చెప్పినా మళ్లీ 'అంబేద్కర్ వరంగల్ రాజధానిగా ఆంధ్రరాష్ట్రాన్ని ప్రస్తావించారు, పైగా ఎవరూ దాన్ని ఉటంకించడం లేద'ని కృష్ణ ఆదిత్య తెగ బాధపడిపోయారు. ఇలా రెండో వ్యాసంలోనూ అడుగడుగునా అంబేద్కర్ తెలంగాణ రాష్ట్రానికి సుముఖం కాదనే అర్థాన్నిచ్చేలా రాశారు.

8. ఇక నా మెథడ్ విషయానికి వస్తే బూర్జువా విమర్శా మెథడ్‌లకు నేను పూర్తిగా వ్యతిరేకిని. నాకు తోచినంతలో, తెలిసినంతలో గతితార్కిక భౌతికవాద పద్ధతిలో సమస్యలకు సూచనలిస్తున్నాను. తప్పులను విమర్శిస్తున్నాను. మార్క్సిస్ట్ ఆలోచనా విధానాన్ని నమ్మేవాడిగా, ఒక నూతన ప్రజాస్వామిక తెలంగాణ రాష్ట్రం ఏర్పడాలని అభిలషించే వాడిగా నేను రాసిన అంశాలలో, నా మెథడ్‌లో లోపాలున్నాయని నిర్ధారణకు ఎవరైనా వచ్చినప్పుడు నా ప్రశ్నలకు మొదట సమాధానమివ్వాలి. అలా ఇవ్వకుండా మెథడ్‌లో లోపముందని ఆరోపించడం గతితర్కం ప్రకారం 'అతితర్కం' అవుతుంది.

9. చివరగా 1953 అంబేద్కర్ భావాలను 'వెలుగులోకి తీసుకుని వచ్చింది నేను' అంటూ కృష్ణ ఆదిత్య సగర్వంగా ప్రకటించుకున్నారు. కానీ ఇది అబద్ధం. నవంబర్ 2011లో ఆయన ఈ వ్యాసం రాయడానికి ముందే కరడుగట్టిన సమైక్యవాది అయిన అడుసుమిల్లి జయప్రకాశ్, ఎ.బి.కె. ప్రసాద్ వంటివారు 'ఆంధ్రప్రభ'లో అదే వ్యాసాన్ని ఆధారంగా చేసుకొని తెలంగాణ వాదంపై విషం చిమ్మే ప్రయత్నం చేశారు. అప్పుడు నేను అదే పత్రికకు జవాబు రాసినప్పుడు కృష్ణ ఆదిత్య లాగే నా వ్యాసాలు కూడా ప్రచురణకు నోచుకోలేదు. ఆ తర్వాత అవి పాతబడడంతో (దినపత్రిక కనుక) మళ్లీ ప్రయత్నించలేదు.

ఏది ఏమైనా అంబేద్కర్ భావాలు ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని సమర్థిస్తాయని, దానికి 1955 వ్యాసమే ప్రామాణికమని తెలంగాణ వాదులు భావిస్తున్నారు. 1953 వ్యాసం ఒకానొక సందర్భంలో రాసినా, అదే ఫైనాలిటీ కాదని ప్రకటించుకొని, మార్పులను స్పష్టం చేస్తూ అంబేద్కర్ 1955 వ్యాసం రాశారని గుర్తించి ఇక ఈ చర్చను ఇక్కడితో ముగించడం మంచిదని నా అభిప్రాయం.

**– లోకే రాజ్‌పవన్,** ప్రభుత్వ ఉపాధ్యాయుడు

Statement about ownership and other particulars of periodical **Veekshanam as require**d to be publ**ISHED IN THe** first issue of every year after the last day of February

Form IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Hyderabad |
| 2. Periodicity of its publication | : | Monthly |
| 3. Printer's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 4. Publisher's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 5. Editor's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency 3-6-394, Street No. 3 Himayatnagar, Hyderabad - 500 029. |
| 6. Name and addresses of individuals who own the newspaper | : | N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*

*(N. Venugopal Rao)*

Date : 1st March, 2012 Signature of the Publisher

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 12

*( గత సంచిక తరువాయి...)*

**సర్క్యూట్ కమిటీ సిఫారసులు**

3) సుబేదారు అనుమతి లభించిన తరువాత సంబంధిత ప్రాంతంపై జమీందారులకు, రాజులకు పరిపాలన దగ్గర నుంచి అన్ని రకాల పన్నుల వసూళ్లతోపాటు భూమిని ఇనాం రూపంలో, దానం రూపంలో, కౌలు రూపంలో ఇతరులకు ఇచ్చే హక్కు వస్తుంది. కమిటీ పూర్వపు హిందూ రాజుల పాలనలో పండిన పంటలో 50 శాతం వరకూ శిస్తు వసూలు చేసేవారని గుర్తించింది. శిస్తు ఎక్కువగా పంట రూపంలోనే ఉండేదని అదే ఇప్పటి నవాబుల పాలనలో మాత్రం పాలకులు శిస్తును 50 శాతానికన్నా తక్కువగా నిర్ధారణ చేసినా జమీందారులు, రాజులు అదనపు పన్ను (నజరు) రూపంలో భూమి శిస్తులో 50 శాతం వంతు వరకూ దాదాపు అందరూ వసూలు చేస్తున్నారు. దీనితోపాటు మొఘలుల పాలన నుంచి జమీందార్లకు శిస్తు వసూలు చేస్తున్నందుకు గాను నిర్ధారించిన భూమి శిస్తుతోపాటు అందులో 10 శాతం అదనంగా తమ కోసం వసూలు చేసుకోవచ్చని అనుమతి ఇచ్చిన దానిని (సరి) కూడా వసూలు చేస్తున్నారు. ఇలా భూమి శిస్తు, నజరు, సరితో కలిసి పన్నుగా కట్టిన తరువాత వ్యవసాయదారునికి చాలాసార్లు 1/3 వంతు పంట మాత్రమే మిగులుతుంది. ఈ మూడింటికి తోడు జమీందార్లు రెంటర్‌లకు వసూలు బాధ్యత అప్పగిస్తే కేవలం భూమిపై చాకిరి చేసినందుకు గాను రైతుకు 1/5 పంట మాత్రమే మిగిలే పరిస్థితి ఉంటుంది.

భూమి శిస్తు ఒకే విస్తీర్ణంలో పక్కపక్కనే ఉండే ఒకే నేల కలిగిన భూములకు రకరకాలుగా వసూలు చేసి రైతులను మోసం చేస్తున్నారనీ, జమీందార్లు కౌలు నిర్ధారణలో కూడా అందరికీ సమాన స్థాయిలో లేకుండా కొందరికి ఎక్కువ కొందరి దగ్గర తక్కువ వసూలు చేస్తున్నారనీ, భూమిని కొలత వేయకుండా తక్కువ విస్తీర్ణాన్ని ఎక్కువ విస్తీర్ణంగా చూపి ఎక్కువ మొత్తంలో శిస్తు వసూలు చేస్తున్నారనీ కమిటీ గమనించింది. హవేలీ భూములకు సంబంధించి నేలలో పంట పండే విధానాన్ని బట్టికాక, తరచుగా అధికంగా వసూళ్లు జరుగుతుండడం కూడా గమనించింది. వీటన్నింటికి పరిష్కారం శాశ్వత సెటిల్‌మెంట్ చేయడమేనని కమిటీ సిఫారసు చేసింది.

చాలాసార్లు కొన్ని ప్రత్యేక కులాల వాళ్లకు తక్కువగా శిస్తు నిర్ధారించడం, వలస వచ్చి సాగు చేసుకొనే వ్యక్తులకు తక్కువ శిస్తు నిర్ధారించడం జరుగుతూ ఉంది. అదే ఆ గ్రామానికే చెందిన రైతుకైతే చాలా ఎక్కువ శిస్తును వసూలు చేస్తున్నట్లుగా కమిటీ గుర్తించింది. అందుకే కమిటీ తన సిఫారసులో శిస్తు మీద వేసే అదనపు వసూలును ఆపాలని కోరింది దాని స్థానంలో వరి బాగా పండించే రైతుకు పండినపంటలో 1/3వంతు, మామూలు భూములలో వరి పండిస్తే 2/5 వంతు పంట, మెట్ట పంటలకు 1/4 వంతు శిస్తు వసూలు చేయాల్సిందిగా సిఫారసు చేసింది.

4) జమీందార్లు, రాజులు, ఫౌజుదార్లు, దేశాయిలకు వందల వేల ఎకరాల విస్తీర్ణంలో గ్రామాలకు గ్రామాలే ఉండడం వల్ల (ఉదాహరణకు విజయనగరం రాజు కింద ఉన్న జమీందార్లకు మొత్తం సాగులో ఉన్న భూమిలో 9/10 వంతు విస్తీర్ణం ఉంది) వారు స్వంతంగా సాగు చేయడం కుదరదు కాబట్టి ప్రజలకు తమ ఆధీనంలోని భూమిని సాగు చేయడానికి ఇచ్చి, వారి నుండి రకరకాల రూపంలో కౌలు (రెంట్) వసూలు చేస్తుండేవారు. వ్యాపారం చేస్తుండే జమీందార్లైతే డబ్బుకు బదులు పంటను కౌలుగా తీసుకొనేవారు. కొన్ని చోట్ల కౌలుకు భూమి కొన్ని సంవత్సరాలకు ఇంత అని ఇస్తే, ఇంకొన్ని చోట్ల అదే కౌలు మార్పు లేకుండా వారసుల దగ్గర నుంచి కూడా వసూలు చేస్తున్నారు. కొంత మందైతే ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం కౌలుకు ఇస్తున్నారు. ఇక ఒప్పందాల గురించి – రైతులలో ముఖాముఖి ఒప్పందాలు కొంతమంది జమీందార్లు చేసుకుంటుంటే, కొన్ని చోట్ల గ్రామ పెద్దలతో ఒప్పందం చేసుకొని వారి ద్వారా కౌలు వసూలు చేసుకొనేవారు. చాలాచోట్ల మాత్రం రెంటర్ లతో పేష్‌కాష్ తీసుకొని భూములపై శిస్తు వసూలు చేసుకొనే అధికారం వారికే అప్పస్తున్నారు.

జమీందారుల తమ రెవెన్యూ వసూలును కరణం తయారు చేసిన లెక్కల ఆధారంగా గ్రామపెద్ద / నాయుడు/ రెడ్డి / రెంటర్‌లతో వసూలు చేయిస్తున్నారు. కాని వాస్తవానికి కరణం తయారు చేసే నికర విస్తీర్ణానికి సంబంధించిన బాకీ పట్టీకి, జమీందార్లు బలవంతంగా వసూలు చేసుకొనే నిర్ధారించిన శిస్తు, నజరు, సరి, రెంటర్‌లు మిగుల్చుకొనే 1/6 వంతుతో కలిసిన నిజమైన వసూలుకు చాలా వ్యత్యాసం ఉందని కమిటీ గమనించింది. చాలాచోట్ల జమీందార్ల బలం ముందు కరణాల లెక్కలకు విలువ లేకుండా పోయిందని కమిటీ ఆందోళన వ్యక్తం చేసింది.

కమిటీ తన సిఫారసులో ముందుగా రెంటర్‌లను పూర్తిగా తొలగించాలని చెప్పింది. బ్రిటిష్ ఫ్యాక్టరీల చీఫ్‌లు, వారి కింద ఉన్న కౌన్సిల్ మెంబర్లు స్థానిక ప్రజల పట్ల సహజ వ్యతిరేకతతో ఉండడమే కాకుండా, సోమరితనంతో కూడిన విలాసవంతమైన జీవితానికి అలవాటు పడి ఉన్నారని, ఇందుకు వారికి తక్కువ పారితోషికం ఇవ్వడం కూడా ఒక కారణం కాబట్టి రెంటర్‌లు మిగుల్చుకొనే వసూలులోని 1/6 వంతును చీఫ్‌లు, కౌన్సిలర్‌లకు పాలనాపరమైన అవసరాలకు మళ్లించాలని సిఫారసు చేసింది. రెవెన్యూ ఆరు లక్షలు దాటిన సందర్భంలో ఒక ఆంగ్ల సూపరింటెండెంట్‌ను జమీందారుకు కానుంగోకు మధ్య నియమించి ప్రజల నికర రెవెన్యూ తెలుసుకొని, జమీందార్లు బలవంతపు వసూళ్లను ఆపాలంది. పూర్తిగా హవేలీ భూముల పర్యవేక్షణకే ఒక ఆంగ్ల సూపరింటెండెంట్‌ను ప్రత్యేకంగా నియమించాలని, రెవెన్యూ వ్యవస్థలోని చీఫ్‌లు, కౌన్సిల్‌లు పాలనలో దుర్వినియోగం, అణచివేత ఘటనలకు తప్ప మిగతా విషయాలలో ఆంగ్ల సూపరింటెండెంట్ అధికారంలో జోక్యం చేసుకోకూడదని సిఫారసు చేసింది.

5) బ్రాహ్మణులకు, దేవాలయాలకు, మసీదులకు చాలా ఎక్కువ విస్తీర్ణాలలో ఇనాములుగా భూములివ్వడం జరిగింది. హిందూ జమీందార్లు తమ పాలనలో ఉన్న పాత మహమ్మదీయ ఇనాములను రద్దుచేసి వేరే హిందువులకు ఇచ్చుకుంటున్నారు. దీనికి మహమ్మదీయులు ఏమీ చేయలేని స్థితిలో ఉన్నారని కమిటీ పేర్కొంది. వాస్తవానికి మహమ్మదీయ పాలకులు తాము కూడా జమీందార్లుగా, రాజులుగా, భూస్వాములుగా ఉండాలని చూస్తున్నారు కాని, స్థానిక రాజులు, ప్రజలు వారిని శిస్తు వసూలు చేసుకొనే మేనేజర్లుగానే భావిస్తున్నారు. కాని, వారసత్వంగా భూములు సంక్రమించే అధికారం ఉన్న రాజులుగా, జమీందార్లుగా చూడడం లేదని కమిటీ చెప్పింది. కాబట్టి మహమ్మదీయ పాలకుల ఆధీనంలో ఉన్న భూమిని స్వాధీనం చేసుకోవడం చాలా సులభం అని కూడా చెప్పింది.

చాలాచోట్ల జమీందార్లు తమ ఎస్టేట్‌లలో ఉన్న బంజరు భూములను ఉదారంగా ప్రజలకు సాగుచేసుకోవడానికి ఇచ్చారు. అలాంటి వారి వద్ద నుండి సంవత్సరాల తరబడి బకాయిలు పేరుకు పోయాయి. భవిష్యత్తులో అంత ఎక్కువ కాలం భూములు శిస్తు లేకుండా ఇవ్వకుండా, సాగులోకి తెచ్చిన తరువాత తక్కువ మొత్తంలోనైనా శిస్తు వసూలు చెయ్యాల్సిన అవసరం ఉందనీ, కనీసం ఒక గరిసె పంటకు ఐదు రూపాయలు నజరు ఇచ్చే విధంగా ఏర్పాటు చేయాలనీ సూచించింది.

అప్పట్లో కొలతలు ఈ విధంగా ఉన్నాయి. అవే కొలతలు అప్పటి నుండి దాదాపు 1980 వరకు నవధాన్యాలను కొలవడానికి గిద్దలు, సోలలు, శేర్లు, మానికలు (రాయలసీమలో పడి)లలో కొలిచే వారు. 2 గిద్దలు - 1/2 సోల లేదా 1/4 శేరు; 2 అరసోలలు - 1 సోల లేదా 1/2 శేరు; 2 సోలలు - 1 తవ్వ లేదా 1 శేరు; 2 తవ్వలు - 1 మానిక లేదా 2 శేర్లు; 6 మానికలు - 1 తూము లేదా మోర్కల్; 400 మానిక - 1 గరిసె పంట కొలతకు సమానం. వ్యవహారికంలో సులువుగా 2 మానికలు - 1 అడ్డు; 2 అడ్డులు - 1 కుంచం; 20 కుంచాలు - 1 పుట్టి; 30 పుట్లు - 1 గరిసెగా కొలతలు నిర్ణయించేవారు. వాస్తవానికి ముందు నుంచీ కూడా భూమి శిస్తు నిర్ధారణకు కొలమానంగా రెండు ఎకరాల తరి పొలంలో గరిసె ధాన్యం పండుతుందని, మెట్ట పొలంలో నాలుగు ఎకరాల సాగుకు మాత్రం ఒక గరిసె ధాన్యమే పండుతుందని, దానిని బట్టే పండిన పంటలో 50 వంతు వరకు శిస్తుగా నిర్ధారించేవారు.

మొఖాసా భూములకు (సేవ చేయకపోయినా, వ్యక్తి లేదా సంస్థ పట్ల గౌరవం తో ఇచ్చే భూములు) సాధారణ శిస్తులో 1/4 వంతు, గ్రామ పోలీసులకు ఇచ్చే ఇనాములకు 5/8 వంతు, చెరువులు తవ్వినందుకు గ్రాంట్‌గా ఇచ్చే ఇనాం భూములకు 1/4 వంతు రెవెన్యూగా కమిటీ నిర్ణయించింది. ఇప్పటికే బ్రిటిష్ చీఫ్‌లు వాల్తేరులో 99 సంవత్సరాలు ఇండ్లకూ, ఇండ్ల స్థలాలకూ, తోటలకూ లీజుకు ఇచ్చిన భూములకు సంబంధించి లీజుకు ఇచ్చినప్పటి సంవత్సరం మార్కెట్ ధరలో 1/4 వంతు నుంచి 1/2 వంతును శిస్తుగా వసూలు చేయాలని సిఫారసు చేసింది.

6) రాజులు, ఫౌజుదారులు, పాయిగాదారులు (నిజాం పాలనలో ఉంటున్నా ఇక్కడ భూములున్నాయి) తమ సైన్యానికి (సైనికులకు, సైన్యాధికారులకు) బతుకుతెరువుకు జీతంకు బదులుగా భూములు ఇనాంగా ఇవ్వడం జరుగుతున్నదనీ, ఒక్క విజయనగరం రాజు దగ్గరే ఆయుధాలు ఉన్న సైన్యం 12,119 మంది ఉన్నారనీ, రాజు తన మిలిటరీని తగ్గించడానికి ఒప్పుకొనే పరిస్థితిలో లేడనీ, ఇలాంటి వారి దగ్గర ఉన్న సైన్యాన్ని తొలగించకపోతే బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ పరాయి వాళ్ల మీద ఆధారపడి బతకాల్సి రావడం వలన కంపెనీ మనుగడకే ముప్పు వాటిల్లి, అధికారం చేతుల్లోకి రాకపోగా ఎప్పుడూ అస్థిరతతో ఉండాల్సిన పరిస్థితి ఏర్పడుతుందని కమిటీ చెప్పింది.

జమీందార్లు రెవెన్యూ వసూలు చేసుకునే అధికారం పొందు తున్నంత కాలం రైతుకు భూమిపై హక్కు ఉండదని, ఆస్తి హక్కు లేని రైతుల వద్ద నుండి పన్ను వసూలు కాకపోతే వారిపై క్రిమినల్ చర్యలు తీసుకోవడానికి కుదరదు కాబట్టి రైతులకు భూమిపై హక్కు పత్రాలు ఇవ్వాలని చెప్పింది. రెవెన్యూ నిర్ధారణ, వసూలు జమీందారులకు ఉండకూడదని ఎవరికైనా జమీందారుగా ఉంచే అధికారం కంపెనీకి మాత్రమే ఉండాలని కమిటీ తేల్చింది. ఈ జమీందారుల, ఫౌజుదారుల వద్దనున్న మిలిటరీని రద్దుచేసి, వారికి పెన్షన్ ఏర్పాటు చేయాలని సిఫారసు చేసింది. భూమిని స్వాధీనం చేసుకోవడానికి అడ్డొచ్చిన జమీందార్లను, రాజులను శిక్షించడానికి ఈస్ట్ ఇండియా కంపెనీ న్యాయవ్యవస్థను ఇంకా నెలకొల్పలేదు కాబట్టి ముందుగా న్యాయ వ్యవస్థను నెలకొల్పాలని సూచించింది.

సర్క్యూట్ కమిటీ సభ్యులలో చురుకుగా ఉండే ఓరమ్ తన నివేదికలో జమీందారుల వద్దనే శిస్తు వసూలు అధికారం ఉండాలనే కోర్ట్ ఆఫ్ డైరెక్టర్ల అభిప్రాయంపై తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తూ జమీందార్లు, రాజులు, ఫౌజుదారులకు, రెవెన్యూ వసూలు ఇతర పరిపాలనాధికారాలు ఉన్నంత కాలం కంపెనీకి పూర్తి అధికారం రావడం కల్ల అని తేల్చారు. పైగా జమీందార్లు కంపెనీ మీద ఆధారపడి మాత్రమే తమ ఎస్టేట్‌లలో భూమి ఉంచుకొనే అధికారం కలిగి ఉండాలని, వారు స్వతంత్రంగా భూమిపై హక్కు కలిగి ఉండరాదని కమిటీ సిఫారసు రూపంలో నివేదించాడు.

7) సర్క్యూట్ కమిటీ తన నివేదికలో బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ నియమించిన చీఫ్‌లు, కౌన్సిల్‌ల పని విధానం మీద చాలా ఘాటైన విమర్శలు చేస్తూ వీరు స్థానిక జమీందార్లతో కుమ్మక్కయి తమ దగ్గర పనిచేసే వారిని బ్రోకర్‌లుగా తయారు చేసుకొని ప్రభుత్వ ధనాన్ని వాడుకొని, లంచగొండులుగా మారారనీ, వీరి పని విధానం బాగాలేదని తేల్చింది. దీనికి ఉదాహరణ 1778లో మద్రాస్ గవర్నర్‌గా నియామకమైన థామస్ రమ్‌బోల్ట్, కమిటీ సిఫారసైన జమీందార్ల దగ్గర చాలా తక్కువ వసూలు చేస్తున్నారని ఇచ్చిన ప్రాథమిక నివేదిక ఆధారంగా 1781లో దాదాపు ముప్పై మంది జమీందార్లను మద్రాస్‌కు పిలిపించుకొని కౌన్సిల్‌తో సంప్రదించకుండా, కోర్టు ఆఫ్ డైరెక్టర్ల దృష్టికి తీసుకెళ్లకుండా తానే స్వయంగా జమీందార్లతో రెవెన్యూ వసూలు నిర్ధారణ చేసుకొని అధికార దుర్వినియోగానికి పాల్పడ్డాడు. అతనిని, అతనితో పాటు 1776లో కంపెనీ ప్రభుత్వం సర్క్యూట్ కమిటీగా నియమించిన పదహారు మంది సభ్యులలో ఉన్న ఐదుగురు కౌన్సిల్ సభ్యులలో ఇద్దరిని కూడా ఈ అధికార దుర్వినియోగానికి గాను డిస్మిస్ చేశారు. ఈస్ట్ ఇండియా కంపెనీ చీఫ్‌లు, కౌన్సిల్‌లలో 1వ, 2వ, 3వ మెంబర్లు నిర్వహించిన మిలిటరీ కార్యకలాపాలలో, వ్యాపార లావాదేవీలలో (కంపెనీకి తరఫున కాకుండా వారే స్వంతంగా వ్యాపారం చేసుకోవడం), శిస్తు వసూలులో అవకతవకలకు పాల్పడడం, శిస్తు నిర్ధారణ తప్పుగా చేస్తుండడం లాంటి వాటికి బాధ్యులుగా చేస్తూ 1682 నుంచి 1791 వరకూ పనిచేసిన 34 మంది చీఫ్‌లలో ఏడుగురిని సస్పెండ్ చేశారు. ఇద్దరిని విచారణ తరువాత జైలులో వేశారు. ఈ నేపథ్యంలో 1781 నుంచి కమిటీ తన నిర్వహణను తాత్కాలికంగా ఆపేసింది.

చార్లెస్ డికెన్స్ తన రచనలలో చెప్పినట్లు వాస్తవానికి 18-19వ శతాబ్దాల మధ్య ఇంగ్లండ్‌లో ఒకరిద్దరు ధనవంతులు పరిశ్రమలు పెట్టి ఇంకా ఎక్కువ ధనవంతులవుతున్న వారు తప్ప మిగతా వారంతా నిరుపేదలు. ఇంగ్లండ్ కటిక దరిద్రంలో ఉంది. అప్పుడు షిల్లింగులదే రాజ్యం. డబ్బున్నవాడే మనిషి. అన్ని వైపులా బతకడం కోసం మోసం, దగా, దౌర్జన్యం, అక్రమాలు, అన్యాయాలు చిన్న రొట్టె ముక్క కోసం చేస్తున్న రోజులు కాబట్టే బ్రిటిష్ చీఫ్‌లు, కౌన్సిల్‌లు వారి స్థానిక పరిస్థితుల వలన అలా లంచ గొండులుగా ఉన్నారు.

1783లో మళ్లీ కమిటీని పునరుద్ధరించి అంచనాలను వేయడం మొదలుపెట్టారు. 11 అక్టోబర్ 1784న కమిటీ ఒక సమగ్ర నివేదిక ఇస్తూ చీఫ్‌లు, కౌన్సిల్‌ల వల్ల బ్రిటిష్ వారికి అధికారం రాదని, కంపెనీ ఆధ్వర్యంలో ఒక సమగ్ర అధికార వ్యవస్థ ప్రధాన కార్యకేంద్రం (హెడ్‌క్వార్టర్స్)లోనూ, జిల్లా కేంద్రాలలోనూ ఉండి మొత్తం పరిపాలనను తమ చేతిలోకి తీసుకుంటే తప్ప కుదరదని సిఫారసు చేసింది.

సర్క్యూట్ కమిటీ రెవెన్యూ పాలన, భూమిపై హక్కుల బదలాయింపు ఇతర పరిపాలనాంశాలపై చేసిన సిఫారసులననుసరించి బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ ముందుగా 1786లో ఆంధ్రా బోర్డ్ ఆఫ్ రెవెన్యూను నెలకొల్పింది. బోర్డ్ అనుమతితోనే రెవెన్యూ వసూలు కోసం చేసే శిస్తు నిర్ధారణ జరగాలని ఆదేశించారు. బోర్డు ఆఫ్ రెవెన్యూ 1792లో కలెక్టర్ వ్యవస్థ చీఫ్‌లు కౌన్సిల్‌ల పరిధిలో ఉండి వారి ఆజ్ఞలకు లోబడి పనిచేయడం వలన బోర్డ్ ఇచ్చే ఉత్తర్వులకు, చీఫ్‌లు ఇచ్చే ఆదేశాల మధ్య నిరంతర స్పర్థ ఉంటుందని కనుక్కొని చీఫ్‌లు కౌన్సిల్‌ను తొలగించాలని సిఫారసు చేసింది. 20 నవంబర్ 1794న అప్పటి గవర్నర్ జనరల్ అయిన కార్న్‌వాలిస్ ఒక ప్రకటన (ప్రొక్లమేషన్) ద్వారా చీఫ్‌లు కౌన్సిల్‌ల వ్యవస్థను రద్దుచేసి కలెక్టర్లు స్వతంత్రంగా పనిచేసే అవకాశం కల్పించి దేశంలోనే మొట్టమొదటిసారి సివిల్ సర్వెంట్స్‌ను కలెక్టర్లుగా నియమించడం ప్రారంభించారు.

సర్క్యూట్ కమిటీ సిఫారసులలో భాగంగా 1758లో విజయనగరం రాజు ద్వారా సహాయం పొంది, ఫ్రెంచ్‌వారిని వెళ్లగొట్టి సర్కార్ జిల్లాల మీద రెవెన్యూ వసూలు అధికారం సంపాదించిన బ్రిటిష్ వారు 10 జూలై 1794న అదే విజయనగరం రాజు వారసుడైన విజయరామరాజు మహారాజును పద్మనాభం దగ్గర జరిగిన యుద్ధంలో చంపి విజయనగరం కింద ఉన్న మొత్తం భూమిపై అధికారం చలాయించడానికి గాను మొదటి మెట్టును సాధించారు. తరువాత వరుసగా అందరు జమీందారులు, రాజులను తాము నిర్ధారించిన శిస్తు వసూలు చేసి తమకు అప్పగించని పక్షంలో వారి వద్ద ఉన్న మిలిటరీని తొలగించడం, భూమిపై అధికారాన్ని తమకు అప్పగించడం లాంటివన్నీ యుద్ధాలు చేసి, లేదా బెదిరించి, జైళ్లలో వేసి జమీందార్లు, రాజులు, ఫౌజుదారుల వద్ద నుంచి అధికారాలన్నీ లాక్కున్నారు. 1800లో నిజాం రాయలసీమ జిల్లాలను (బళ్లారితో కలిపి) బ్రిటిష్ వారికి దత్తత ఇచ్చిన తరువాత పాలెగాళ్లను, రాజులను, జమీందారులను భూమిపైనున్న అధికారాన్ని తొలగించి వారిని జైళ్లలో పెట్టి, లేదా చంపి, పెన్షన్ మంజూరు చేసి ఇలా భూమిపై పూర్తి అధికారం రాయలసీమ జిల్లాలలో సంపాదించారు. థామస్ మన్రో పాలెగాళ్లపై, రాజులపై చాలా కఠినంగా వ్యవహరించాడు. 1360 నుంచి ఉన్న కడప జిల్లా గట్టు పాలెగాళ్లను 1802లో తన కచేరీకి వచ్చి రెంట్ కట్టలేదని గుత్తిలోని సెంట్రల్ జైల్‌లో పెడితే అతనక్కడే చనిపోయాడు. అతని వారసులకు గట్టులో చాల పలుకుబడి ఉందని వారిని అక్కడ ఉండనివ్వకుండా కడపకు ఐదు మైళ్ల దూరంలో ఉన్న కొత్తపేటలో ఉండమని వారికి సంవత్సరానికి రు. 3245 పెన్షన్‌గా మంజూరు చేశాడు. 1802లో థామస్ మన్రో రైతువారీ పద్ధతి ప్రవేశపెట్టడం, రైతులకు హక్కు పత్రాలివ్వడం తద్వారా పన్ను కట్టలేని రైతులు, జమీందారులు, గ్రామపెద్దలను జైళ్లకు పంపడం సర్క్యూట్ కమిటీ సిఫారసులో భాగమే. థామస్ మన్రో 14 ఏప్రిల్ 1807 ఉత్తర్వు ద్వారా గ్రామ సేవకుల ఇనాం భూములను స్వాధీనం

చేసుకున్నాడు. సైన్యం ఆధీనంలోనున్న భూమిని తమ ఆధీనంలోకి తెచ్చుకోవడానికి, 1817లో రెవెన్యూ రికవరీ (మిలిటరీ అధికారుల) క్రమబద్ధీకరణ చట్టం, గ్రామసేవకుల గ్రామ రెవెన్యూ యంత్రాంగం అధికారాలను క్రమబద్ధీకరించడానికి అధికారుల (దుర్వినియోగం) క్రమబద్ధీకరణ చట్టం 1822లో చేశారు.

1796-98లో సర్క్యూట్ కమిటీ సిఫారసు ఆధారంగా విజయనగరం మహారాజాను చంపిన తరువాత ఆయన మైనర్ వారసుడికి అధికారం అప్పగించి శాశ్వత సెటిల్మెంట్ రాష్ట్రంలో మొదటిసారిగా తమ సంపూర్ణ అధికారంలోకొచ్చిన భూమిలో మొదలు పెట్టారు. మహారాజు డిమాండ్‌ను రు.7,16,708 గా నిర్ధారించి అందులో నిఖర సాగు విస్తీర్ణానికి డిమాండ్‌ను కలెక్టరు వెబ్ 22 సెప్టెంబర్ 1803లో బోర్డ్ ఆఫ్ రెవెన్యూకు రు.5,44,000గా నిర్ధారించి అనుమతి కోసం పంపాడు. బోర్డ్ 22 అక్టోబర్ 1803న రు.5,00,000గా నిర్ణయించి భూమి శిస్తు వసూలుకు కలెక్టర్‌కు ఆమోదం పంపింది. ఇలా మొదలైన సర్వే సెటిల్‌మెంట్ థామస్ మన్రో 1821 నుంచి 1825 వరకూ పైమాష్ పద్ధతిలో సర్వే చేయించాడు. ఇక్కడి రెవెన్యూ పాలన సక్రమంగా సాగడానికి, సంపూర్ణ అవగాహన, పట్టు తమకు కలగడానికి బ్రిటిష్ కలెక్టర్లు టిప్పు సుల్తాన్ దగ్గర పనిచేసిన రెవెన్యూ అధికారులలో చాలా మందిని తమ దగ్గర నియమించుకున్నారు. థామస్ మన్రో టిప్పు సుల్తాన్ రెవెన్యూ మంత్రి పూర్ణయ్య దగ్గర శిక్షణ పొందిన బుచ్చారావును తన దగ్గర హెడ్ శిరస్తుదారుగా నియమించుకొని, క్లిష్ట సమయంలో ఆయన సలహాలు పాటించేవాడు. థామస్ మన్రో 16 జూన్ 1801 సర్క్యులర్ ద్వారా అప్పటికి నిజాం వసూలు చేసిన పన్నులో 4వ వంతు పన్నును రైతులకు తక్కావి రుణాలుగా ఇవ్వాలని నిర్ణయించాడు. హర్పనహళ్లికి 600; ఆదోని 3200; కడప 400; కంభ 3000 స్టార్ పగోడాలను తక్కావి రుణాలుగా మంజూరు చేశాడు. 1808లో సైనిక శాసన చట్టాన్ని నెలకొల్పడం ద్వారా మొదలైన బ్రిటిష్ ఈస్ట్ ఇండియా కంపెనీ సంపూర్ణ రాజ్యాధికార ప్రక్రియ 1857లో మొదటి భారత స్వాతంత్ర్య సంగ్రామం దరిమిలా బ్రిటిష్ రాణి ప్రభుత్వం ఆధీనంలోకి భారతదేశం వచ్చిన తరువాత స్టేట్ అఫెన్సెస్ చట్టం 1857 అమలులోకి వచ్చింది. తమ ప్రభుత్వ సంపూర్ణ ఆధీనంలో ప్రజలు ఉండడానికి 1860లో భారతీయ నేర శిక్షాస్మృతి (ఇండియన్ పీనల్ కోడ్) 1861లో పోలీసు చట్టం, 1872లో ఇండియన్ ఎవిడెన్స్ చట్టం, 1882లో పౌర న్యాయకార్యస్మృతి, 1898లో నేర విచారణ స్మృతి చట్టాలను అమలులోకి తీసుకొచ్చారు.

1856లో రెవెన్యూ సెటిల్‌మెంట్ శాఖను, 1864లో సర్వే సెటిల్‌మెంట్ శాఖను శాశ్వత ప్రాతిపదికపై భూమి హక్కుల రికార్డులు తయారు చేయడానికి నియమించారు. కృష్ణా జిల్లా సర్వే సెటిల్‌మెంట్‌ను రెవెన్యూ బోర్డు 30 సెప్టెంబర్ 1864 ఉత్తర్వులు జి.ఓ. నెం. 1812 ద్వారా ఆమోదం తెలిపింది. సర్వే, సెటిల్‌మెంట్‌లో వస్తున్న ఫలితాల ఆధారంగా 1882 అటవీ చట్టం చేసి వంట చెరుకు సేకరణ, పశువులను మేపుకోవడం రిజర్వ్ భూములలో నిషేధించారు. పశువులు మేస్తే పుల్లరి శిస్తు రూపంలో అధిక పన్ను వసూలు చేశారు. బోర్డు తన ఉత్తర్వులు నెం. 938 ద్వారా 29 మార్చ్ 1882 నుంచి గ్రామాలలో ఖాళీగా ఉన్న కొంత భూమిని ప్రతి గ్రామంలో పచ్చిక బయళ్లకోసం రిజర్వ్ చెయ్యాలని, గ్రేజింగ్ గ్రౌండ్ పోరంబోకుగా ఆ భూమిని రీసెటిల్‌మెంట్ రిజిష్టర్‌లో నమోదు చెయ్యాలని ఆదేశించింది. సాయుధ పోలీసులు తరచూ గ్రామాలపై దాడి చేసి వందలాది పశువులను జప్తు చేసేవారు. రైతులు జరిమానా కట్టలేక, పుల్లరి శిస్తు కట్టలేక తరచూ తిరుగుబాటు చేసేవారు. తిరుగుబాటు చేసిన రైతులను అణచే క్రమంలోనే కారంపూడి దగ్గర మించాలపాడు గ్రామంలో 22 ఫిబ్రవరి 1922న కన్నెగంటి హనుమంతును కాల్చి చంపారు.

ముందుగా సెటిల్‌మెంట్, 1796 నుంచి మొదలైనా 1826-27లలో విస్తృతంగా జరిగి దాదాపు బ్రిటిష్ వారు శిస్తు వసూలు చేసుకొనే భూభాగమంతా పూర్తయింది. కాని ఈ మొదటి సెటిల్‌మెంట్‌లో కచ్చితమైన వ్యవసాయ యోగ్యమైన భూమిని నమోదు చెయ్యలేకపోయారు. చాలా చోట్ల పండిన పంటను తప్పుగా చూయించడం వల్ల ఒక్క నెల్లూరు జిల్లాలోనే 86 గ్రామాలలో తక్కువ డిమాండ్ వచ్చింది. మరి కొన్ని చోట్ల తక్కువ రకం నేలను పంట దిగుబడి ఎక్కువ వచ్చే నేలగా చూయించడం జరిగింది. బోర్డ్ ఉత్తర్వుల మేరకు 1859 వరకూ ఉన్న పగోడాలు, ఫనమ్‌ల స్థానంలో రూపాయిలు, అణాలలోకి శిస్తును మార్చాలనే ఉత్తర్వు ప్రకారం ఆర్.ఎస్.ఆర్.లో రూపాయిలు అణాలలో శిస్తును నమోదు చేశారు.

రిసెటిల్‌మెంట్‌ను నిర్దేశించిన సమయానికంతా ఒక్కో జిల్లాలో 3 లేదా 4 స్కీంల ద్వారా పూర్తి చేయాలని నిర్ణయించి, దాదాపు 1890 నుంచి 1912 మధ్య కాలంలో గంజాం నుంచి నెల్లూరు వరకు రాయలసీమ జిల్లాలన్నింటిలో ఆర్.ఎస్.ఆర్. పూర్తయింది. ప్రభుత్వ భూముల రకాలను ఇంతకు ముందు కన్నా ఎక్కువగా ఆయకట్టు బంజరు, నాన్ ఆయకట్టు బంజరు, నిమ్నజాతులకు కేటాయించిన భూములు, పచ్చిక బయళ్ల కోసం కేటాయించిన భూములు, రస్తా, తోపు, కాల్వ, గ్రామ (కంఠం), చెరువు పోరంబోకు భూములుగా విభజించి చూపారు. ఇనాం భూములకు సంబంధించి నౌఖరి ఇనాం, దేవాదాయ, ధర్మాదాయ, మసీదు, దర్గా ఇనాములు, అగ్రహారాలు, ఎస్టేట్ భూములు, కొత్తగా సొసైటీలకిచ్చిన భూములతో సొసైటీ సభ్యుల పేర్లతో చాలా స్పష్టంగా సబ్ డివిజన్ చేసి సర్వే రికార్డులు తయారు చేశారు. మొత్తం రాష్ట్రంలో జరిగిన రిసెటిల్‌మెంట్‌లో 25 తరి రేట్లు, 32 మెట్ట రేట్లను నమూనాగా తీసుకొని భూమి రకాన్ని బట్టి శిస్తు నిర్ణయించారు. రిసెటిల్‌మెంట్ రిజిష్టర్ తయారీలో భూమి హక్కుల స్వభావం గురించి ఒక భూమి ప్రభుత్వ భూమా, ప్రైవేటుదా తెలుసు కోవడానికి, ఆక్రమణ విస్తీర్ణం తెలుసుకోవడానికి ఇంకొకసారి ఎలాంటి కొలతలు చేయాల్సిన అవసరం లేకుండా గ్రామాలకు ఇప్పటికి వంద సంవత్సరాల తరువాత కూడా బ్రిటిష్‌వారు పరిపాలించిన భూభాగంలో ఈ రిజిష్టర్‌నే ప్రామాణికంగా తీసుకొంటున్నారు. రాష్ట్రంలోని భూభాగాలకు సంబంధించి కచ్చితమైన సమాచారంతో వంద సంవత్సరాలు దాటిపోయినా ఇంతవరకు ఏ ప్రభుత్వమూ ఇలాంటి రికార్డులను తయారు చేయలేదు.

రిసెటిల్‌మెంట్ రిజిష్టర్ చివరిలో తరిభూముల వివరాలు, మెట్ట భూములవివరాలు, జనాభా సేకరణ జరిగినప్పటికి ఇప్పటికి ఉన్న తేడా (1876-77లో వచ్చిన కరువుకు మొత్తం జనాభాలో 28 శాతం ప్రజలు చనిపోయారు. సాధారణ జనాభా గణన ప్రతి పది సంవత్సరాలకు చేస్తున్నట్లు కాకుండా 1878లో ప్రత్యేక జనాభా గణనచేసి కరువు పనులు మంజూరు చేశారు.) అందుకు గల కారణాలు, వ్యాధులు తదితరాలు. వలసలు (కరువు, తుపాను, వరదలు, వ్యాధులు, మెరుగైన జీవితం కోసం), వృత్తులు, జనాభా సేకరణ నాటి వృత్తులు, ఇప్పటి వృత్తులకు ఉన్న తేడా అందుకు గల కారణాలు. రైతు కూలీలు గ్రామంలో సరిపడా ఉన్నారా లేదా, ఇప్పుడు వస్తున్న ఆదాయం కూలీలకు సరిపోతుందా లేదా, ఎక్కువగా పండించే పంటల వివరాలు, ధాన్యం నిల్వలు సరిపోను ఉన్నాయా లేదా? విద్యావంతులు ఎంత మంది? కుల వృత్తుల వారి ఆదాయ వివరాలు. భూముల విలువలు పెరిగినవా? పెరిగితే శిస్తుకు ఎన్ని రెట్లు పెరిగింది. రాజీనామా చేసిన భూములు వివరాలు. వారసులు లేక స్వాధీనం చేసుకున్న భూముల వివరాలు. కరువును అధిగమించడానికి, ప్రజలను ఆదుకోవడానికి మంజూరు చేసిన పనుల వివరాలు వాటి పురోగతి, ప్రస్తుత ఆదాయం ప్రజలకు సరిపోతుందా? కచ్చితమైన అంచనాతో ప్రజలకు సరిపోను ఆదాయంలాంటి పైన తెలిపిన విషయాలన్నీ ఆర్ఎస్ఆర్‌లో పొందుపరిచారు.

*(ఇంకా ఉంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
*saralareddy007@gmail.com*

వీ

*అణు విద్యుత్‌తో సహా బొగ్గు, చమురుల వినియోగం కూడా పర్యావరణానికి నష్టమే చేస్తాయనీ, విద్యుత్ వినియోగానికి అంతిమంగా సహజ ప్రత్యామ్నాయాలే శరణ్యమనీ అంటున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# రియాక్టర్లలో రకాలు

అణురియాక్టర్లలో ఎన్నో రకాలున్నాయి. ఒక్కొక్క దేశమూ తన అవసరాలనుబట్టీ, సహజవనరులను బట్టీ, సాంకేతికస్థాయినిబట్టీ రకరకాల రియాక్టర్లను తయారుచేసుకుని ఉపయోగిస్తుంది. కొన్ని చారిత్రక కారణాలుకూడా కనిపిస్తాయి. యురేనియం ఇంధనంలో 235 ఐసోటోప్ మోతాదును పెంచే సామర్థ్యం పొందాక అమెరికా ఆ వివరాలను బ్రిటన్, కెనడావంటి మిత్రదేశాలకు సైతం చెప్పలేదు. అందుచేత కెనడా సహజయురేనియం ఇంధనంగా, భారజలం మోడరేటర్‌గా రియాక్టర్లు రూపొందించుకోక తప్పలేదు. పైగా ఎక్కువ ఒత్తిడికి తట్టుకునే కట్టడాలను నిర్మించే సాంకేతిక సామర్థ్యం కూడా అప్పట్లో కెనడాకు ఉండేదికాదు. అందుచేత కెనడా అన్నివిధాలా తమకు వీలైన భారజలం రియాక్టర్లను తయారు చేసుకుంది. ఇంధనం విషయంలో అప్పట్లో మనకున్న పరిమితుల దృష్ట్యా మనవాళ్లుకూడా అదే పంథాను అనుసరించారు. మనకు అవసరమైన భారజలం మనదేశంలోనే తయారవుతోంది.

మనదేశంలోనే విద్యుదుత్పత్తికి ఉపయోగపడేవాటిలో వివిధ పద్ధతుల్లో పనిచేసేవి కనిపిస్తాయి. తమిళనాడులోని తిరునల్వేలి ప్రాంతంలో కూడంకుళంలో రష్యా సహాయంతో నిర్మాణంలో ఉన్నవి ప్రెషరైజ్డ్ వాటర్ రియాక్టర్లు (పిడబ్ల్యుఆర్). అయితే మనవాళ్లు రాజస్థాన్ తదితర ప్రదేశాల్లో ఎక్కువగా నిర్మించినవి ప్రెషరైజ్డ్ హెవీవాటర్ రియాక్టర్లు (పిడబ్ల్యుఎచ్‌ఆర్). ఇవి భారజలం మోడరేటర్‌గా, సహజ యురేనియం ఇంధనంగా ఉపయోగిస్తాయి.. వీటికన్నా పీడబ్ల్యూఆర్‌లో ఒత్తిడి ఎక్కువ. పిడబ్ల్యూఆర్ (పటం) యురేనియం ఇంధనంలో 235 ఐసోటోప్ పాలు కాస్త ఎక్కువ. మామూలు నీరే చల్లబరచడానికీ, మోడరేటర్‌గానూ కూడా పనిచేస్తుంది. ఒత్తిడి ఎక్కువ కనక నీరు 200నుంచి 300 డిగ్రీల ఉష్ణోగ్రతలో కూడా ఆవిరవకుండా ద్రవరూపంలో ఉంటుంది. దీన్ని రియాక్టర్ బైటకు పంపి ఒక స్టీం జెనరేటర్‌లో ఆవిరిరూపంలోకి మారుస్తారు. ఈ పద్ధతిలో పనిచేసే రియాక్టర్ చిన్నదిగా ఉంటుంది కనక సబ్‌మెరీన్లకు బాగా పనికొస్తుంది. ఉష్ణాన్ని విద్యుత్తుగా మార్చే ప్రక్రియకూడా సమర్థవంత మవుతుంది. అమెరికాలో పిడబ్ల్యుఆర్‌ల వాడకం ఎక్కువ. తారాపూర్‌లో అమెరికా సహాయంతో నిర్మించినది బాయిలింగ్ వాటర్ రియాక్టర్ (బిడబ్ల్యుఆర్). ఇందులోకూడా 235 ఐసోటోప్ పాలు ఎక్కువ. మామూలు నీరే చల్లబరచడానికీ, మోడరేటర్‌గానూ కూడా పనిచేస్తుంది. అయితే ఒత్తిడి కాస్త తక్కువ కనక నీరు రియాక్టర్ లోపలే ఉడుకెత్తి ఆవిరవుతుంది (పటం).




పిడబ్ల్యుఆర్ (కూడంకుళం) 1. కట్టడం, 2. ప్రెషరైజర్, 3. స్టీం జెనరేటర్, 4. కంట్రోల్ కడ్డీలు, 5. రియాక్టర్, 6. టర్బైన్, 7. జెనెరేటర్, 8. కండెన్సర్




బిడబ్ల్యూఆర్ (తారాపూర్) – 1. కట్టడం, 2. రియాక్టర్, 3. కంట్రోల్ కడ్డీలు, 4. టర్బైన్, 5. జెనెరేటర్, 6. కండెన్సర్

వీటన్నిటిలోనూ అణువిచ్ఛిత్తిలో పుట్టుకొచ్చే శక్తివంతమైన న్యూట్రాన్ల వేగాన్ని మోడరేటర్ సహాయంతో తగ్గిస్తారు. గాలివంటి పదార్థాల్లోని అణువుల, బృహదణువుల శక్తి ఉష్ణోగ్రతనుబట్టి పెరుగుతుంది. మామూలు ఉష్ణోగ్రతలోని అణువులను పోలిన శక్తి కలిగిన న్యూట్రాన్లను థర్మల్ న్యూట్రాన్లంటారు. వీటి శక్తి ఒక ఎలక్ట్రాన్‌వోల్ట్‌లో నలభయ్యోవంతు మాత్రమే ఉంటుంది. (అణువిచ్ఛిత్తి జరిగినప్పుడు ఆ శక్తి దీనికి సుమారు పదికోట్ల రెట్లుంటుంది.) అయితే ఇంత తక్కువ శక్తి కలిగిన న్యూట్రాన్లుకూడా సెకండుకు 2.2 కి.మీ. వేగంతో ప్రసరిస్తాయి. న్యూట్రాన్ల వేగంలో ఎక్కువ తక్కువలు



ఏజీఆర్ (బ్రిటన్) - 1. చార్జ్ గొట్టాలు, 2. కంట్రోల్ కడ్డిలు, 3. గ్రాఫైట్ మోడరేటర్, 4. ఇంధనం, 5. రేడియేషన్ నిరోధించే కాంక్రీట్ కట్టడం, 6. వాయువు సర్క్యులేటర్, 7. నీరు, 8. నీటికి సర్క్యులేటర్, 9. హీట్ ఎక్స్చేంజర్, 10. ఆవిరి

ఎటువంటివైనా ఈ థర్మల్ న్యూట్రాన్లకు ఉన్న ప్రత్యేకత ఏమిటంటే ఇటువంటివి ఏ అణుకేంద్రకం లోనైనా సులువుగా ప్రవేశించి సందర్భాన్నిబట్టి అణువిచ్ఛిత్తినో, స్థిరమైన కేంద్రకంలో అస్థిరతనో కలగజెయ్యగలవు. అందుచేత ఇటువంటివాటితో అణువిచ్ఛిత్తి జరిగేవాటిని థర్మల్ రియాక్టర్లంటారు.

ప్రస్తుతం ప్రపంచంలో నడిచేవి ప్రధానంగా ఇటువంటి రియాక్టర్లే. అయితే వీటిలో కొన్నిటిలో ఇతర పదార్థాలను శీతలీకరణానికీ, మోడరేటర్‌గా పనిచేసేందుకూ ఉపయోగిస్తారు. కొన్నిటిలో గ్రాఫైట్ (కార్బన్) మోడరేటర్ ఉంటుంది. కార్బన్ డయాక్సైడ్ వాయువును చల్లబరచడానికి ఉపయోగిస్తారు. బ్రిటన్‌లోని ఇటువంటి అడ్వాన్స్‌డ్ గేస్ కూల్డ్ రియాక్టర్ (ఎజిఆర్) పటంలో చూపబడింది. కొన్నిటిలో గ్రాఫైట్ (కార్బన్) మోడరేటర్ ఉంటుంది. కార్బన్ డయాక్సైడ్ వాయువును చల్లబరచడానికి ఉపయోగిస్తారు. బ్రిటన్‌లోని ఇటువంటి అడ్వాన్స్‌డ్ గేస్ కూల్డ్ రియాక్టర్ (ఎజిఆర్) పటంలో చూపబడింది. ఇది సుమారు 650 డిగ్రీల (సెల్సియస్) ఉష్ణోగ్రతలో పనిచేస్తుంది. ప్రమాదానికి గురై ప్రసిద్ధికెక్కిన చెర్నోబిల్‌వంటి రియాక్టర్లు గ్రాఫైట్ మోడరేటర్, చల్లబరచడానికి నీరూ ఉపయోగిస్తాయి. కల్పాక్కంలో మనవాళ్లు యురేనియం-233 ఇంధనంగా కామిని అనే చిన్న ప్రయోగాత్మక రియాక్టర్ నడుపుతున్నారు. ఇది మనదేశంలో దొరికే థోరియం-232 నుంచి తయారైనది.

కొన్ని రియాక్టర్లలో న్యూట్రాన్ల వేగాన్ని తగ్గనివ్వరు. అందుకనే వాటిని ఫాస్ట్ రియాక్టర్లంటారు. యురేనియం-235, ప్లూటోనియం-239 ఇంధనంగా వాడుతున్నప్పుడు అణువిచ్ఛిత్తి ఎటువంటి న్యూట్రాన్లవల్లనైనా సాధ్యపడుతుంది. సహజ ఇంధనాలు కాకపోతే చాలు. న్యూట్రాన్ల వేగం ఎక్కువగా ఉన్నప్పుడు అణువిచ్ఛిత్తి జరిగాక విడుదలఅయే సగటు న్యూట్రాన్ల సంఖ్య రెండున్నరనుంచి మూడుకు పైగా పెరుగుతుంది. ఈ అదనపు న్యూట్రాన్లు బ్రీడర్ రియాక్టర్లలో పనికొస్తాయి. బ్రీడర్ రియాక్టర్లలో ఒకవంక ఇంధనం ఖర్చయి, రియాక్టర్ నడుస్తూ ఉండగానే దానిచుట్టూతా అమర్చిన యురేనియం-238,


కల్పాక్కంలోని ఎఫ్‌బిటిఆర్, నిర్మాణంలో ఉన్న పిఎఫ్‌బిఆర్

థోరియం-232 మొదలైన పదార్థాలను ఢీకొట్టే ప్రక్రియద్వారా న్యూట్రాన్లు వాటిని ప్లూటోనియం-239, లేదా యురేనియం-233గా మార్చేస్తాయి. ఇవన్నీ యురేనియం-235ను పోలిన ఇంధనాలు కనక ఈ రియాక్టర్లు ఎప్పటికప్పుడు సరికొత్త ఇంధనాన్ని తయారుచేస్తాయి. కల్పాక్కంలో మనవాళ్లు నిర్మించి నడుపుతున్న ఫాస్ట్ బ్రీడర్ టెస్ట్ రియాక్టర్ (ఎఫ్‌బిటిఆర్), నిర్మాణంలో ఉన్న ప్రోటోటైప్ ఫాస్ట్ బ్రీడర్ రియాక్టర్ (పిఎఫ్‌బిఆర్) ఇటువంటివే (పటం). వీటికన్నా ముందుగా ప్రయోగాల నిమిత్తం మనవాళ్లు నడిపిన చిన్న రియాక్టర్ పూర్ణిమ ప్లూటోనియం ఫాస్ట్ రియాక్టర్ ఇంధనంగా పనిచేస్తుందని రుజువు చేసేందుకు పనికొచ్చింది.

ఫాస్ట్ రియాక్టర్ నడవాలంటే అందులో న్యూట్రాన్ల వేగాన్ని తగ్గించగలిగిన పదార్థాలేవీ ఉండకూడదు. అందుకని చల్లబరచడానికి నీటికి బదులుగా కరిగిన సోడియం లోహాన్ని ఉపయోగిస్తారు. ఉష్ణాన్ని ఎంతో బాగా సంగ్రహించగలిగిన సోడియం తీవ్రమైన రసాయనిక లక్షణాలు కలిగినది కనకనూ, న్యూట్రాన్ల తాకిడికి గురయాక తీక్షణమైన రేడియోధార్మికతను సంతరించుకుంటుంది కనకనూ అది చాలా మెలకువతో ఉపయోగించవలసిన పదార్థం. అయితే మనవాళ్లు ఈ సమస్యలన్నిటినీ అవగాహన చేసుకుని ముందుకెళుతున్నారు.

అసలు అణురియాక్టర్ల ద్వారా విద్యుదుత్పత్తి సాధించడం మంచిపనేనా అని ప్రశ్నించేవాళ్లూ ఉన్నారు. ఇందుకు ముఖ్యకారణాలు పర్యావరణకాలుష్యం, రేడియోధార్మికత ఉన్న వ్యర్థాలను వేల సంవత్సరాల పాటు సురక్షితంగా భద్రపరిచే సమస్య వగైరాలు. అయితే బొగ్గు, చమురువంటి ఇంధనాల వల్ల కలిగే కాలుష్యం ఇంకా ఎంతో ఎక్కువ. విద్యుత్తును ఎందుకోసం ఉత్పత్తి చేస్తున్నాం, దానివల్ల ఎవరికి ఏ విధమైన లాభాలు కలుగుతున్నాయనేదికూడా చాలా ముఖ్యమే. విద్యుత్తును అతిగా వినియోగించకుండా ప్రకృతిలో సహజంగా లభించే సదుపాయాలను ఉపయోగించుకుని లాభపడడం మంచిపని. పరిశ్రమలు కలిగించే పర్యావరణ కాలుష్యమూ, భూతాపమూ తెలిసిన సంగతులే. వీటికి తోడు పెద్దనగరాల్లో కిక్కిరిసిన కాంక్రీట్ భవంతులమధ్య వేడిమీ, వెలుతురూ ప్రతిఫలనం చెంది అక్కడి నివాసాలను మరింత వేడెక్కిస్తాయి. ఏర్ కండిషనర్లు ఉన్నవారు వాటిని ఉపయోగిస్తున్నకొద్దీ బైటి ఉష్ణోగ్రతలు మరింత పెరిగి అవి లేనివారికి మరిన్ని కష్టాలు తెచ్చిపెడతాయి. విద్యుత్తునూ, శక్తినీ వినియోగించడమనేది అనేక జటిలసమస్యలతో కూడుకున్న విషయం.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

**ప్రశ్నలకు జవాబులు చెప్పడం ద్వారా పురోగతి సాధిస్తాం. జవాబులను ప్రశ్నించడం ద్వారా నూతన ఆవిష్కరణలు జరుగుతాయి.**

– **బెర్నార్డ్ హైష్,** విజ్ఞానశాస్త్ర పత్రికా సంపాదకుడు

(..4వ పేజీ తరువాయి..)

విద్యా ప్రణాళికా పత్రం లోపభూయిష్టం' వ్యాసకర్త కె. లక్ష్మినారాయణ మన దేశంలో పనికి, విద్యకు ఉన్నటువంటి దూరం ఎటువంటిదో బాగా చూపెట్టారు. పనికి, విద్యకు మధ్య దూరం పెరగడానికి మూలాలు ఈ వ్యవస్థలోనే ఉన్నాయని తెలియజేయడంలో విశ్లేషణ శాస్త్రీయంగా ఉంది. ఇలాంటి వ్యాసాలు వర్తమాన పరిస్థితులలో ఎంతో అవసరం.

**– కడియాల సుబ్బనాచారి**
*దుత్తలూరు, నెల్లూరు*

వీక్షణం ఫిబ్రవరి 2012లో 'గ్రామీణ ప్రాంతాల అధ్యయనం ఈనాటి అవసరం' వ్యాసం ఎంతో రిఫ్రెషింగ్‌గా ఉంది. భారతదేశం వ్యవసాయక సమాజమని, గ్రామాలే 'భారతీయత'కు ఆయువుపట్టని, ఈ దేశంలో జరగవలసిన మౌలిక మార్పులకు శ్రీకారం చుట్టవలసింది గ్రామాలలోనేనని, ఎంతో మంది అనేక సంవత్సరాల నుండి పలు విధాలుగా చెప్తూనే ఉన్నారు. వ్యవసాయక విప్లవం పునాదిపైనే, నూతన ప్రజాస్వామిక విప్లవం విజయవంతం అవుతుందని మావోయిస్టు పార్టీ కూడా చెప్తున్నది. అత్యవసర పరిస్థితి కాలంలో రాడికల్స్ చేపట్టిన 'గ్రామాలకు తరలండి' కాంపెయిన్, ఆంధ్రదేశ రాజకీయాలలో ఎంతటి గుణాత్మక మార్పులకు దారి తీసిందో, అద్భుత విజయాలను సాధించిందో అందరికీ తెలిసిందే. అయితే అది వర్తమానానికి చరిత్రగా మాత్రమే మిగిలింది.

ఉద్యమం వెనకతట్టు పట్టిన తరువాత గ్రామీణ ప్రాంతాల అధ్యయనానికి సంబంధించిన ఆలోచనలు, ఆచరణలు కూడా ఆగిపోయాయి. తిరిగి సామ్రాజ్యవాద ప్రపంచీకరణ వేగవంతమై గ్రామీణ సమాజాలను కూడా తన మార్కెట్ మాయాజాలంలోకి ఆకర్షించడం ప్రారంభమైన తరువాత, భారతదేశంలో, అర్ధ భూస్వామ్య స్థితికి కాలం చెల్లిపోయిందనీ, వ్యవసాయరంగంలో కూడా పెట్టుబడిదారీ సంబంధాలు నెలకొన్నాయనీ, ఆ కారణంగా వ్యవసాయక విప్లవానికి కాలం చెల్లిందని కొందరు ఆలోచనాపరులు భావిస్తున్న నేటి తరుణంలో, ఈ అంచనా వాస్తవమేమోననే భ్రమ విప్లవశక్తులలో కూడా కలుగుతున్న దశలో గ్రామీణ ప్రాంతాల అధ్యయనం తిరిగి చర్చలోకి రావడం ఒక గొప్ప చారిత్రక అవసరం.

వ్యాసంలో రాసినట్లు గ్రామీణ ప్రాంతాల అధ్యయనమంటే కేవలం మారుతున్న భూ సంబంధాల అధ్యయనం మాత్రమే కాదు. ఆ అధ్యయనం అంతకంటే విస్తృతంగా, లోతుగా, కుల, సాంస్కృతిక, రాజకీయ, పార్శ్వాలలో వస్తున్న మార్పుల అధ్యయనం కూడా. ఇలాంటి సమగ్రమైన అధ్యయనం వస్తుగతంగా జరిగినపుడు మాత్రమే సరైన విశ్లేషణ చెయ్యగలుగుతాం. గ్రామీణ ప్రజల ఆలోచనా క్రమాన్ని అర్థం చేసుకోగలుగుతాం. సమస్యల మౌలికత్వాన్ని గుర్తించగలుగుతాం. పరిస్థితులను మార్చడానికి అవసరమైన ఎత్తుగడలను రూపొందించుకోగలుగుతాం.

కానీ ఇంత విశాల, వైవిధ్యభరిత ఆంధ్రదేశంలోని గ్రామీణ ప్రాంతాల అధ్యయనం ఆచరణలో అంత సులభ సాధ్యం కాదు. తెలంగాణ, రాయలసీమ, ఉత్తరాంధ్ర, కోస్తాంధ్ర ప్రాంతాల గ్రామాలన్నిటికీ సార్వజనీనమైన కొలమానాలను ఉపయోగించలేం. తిరిగి ఆయా ప్రాంతాలలోని సాగునీటి వ్యవసాయ ప్రాంతాలకు, మెట్ట వ్యవసాయ ప్రాంతాలకు ఒకే పడికట్టు సూత్రాన్ని అనువర్తింప చెయ్యలేం. అందుచేత ఈ వైవిధ్యాలను దృష్టిలో ఉంచుకొని సాధ్యమైనంత సార్వజనీనమైన చిత్రాన్ని రాబట్టే దిశగా ఈ అధ్యయనం జరగాలి.

దీనికి కొంత మేధోపరిజ్ఞానం, కొంత ప్రాథమికమైన శిక్షణ కూడా అవసరం. అయితే ఇది విశ్వవిద్యాలయాలు నిర్వహించే కేవలం అకడమిక్ పరిశీలన వంటిది కాదు. వాళ్లుపయోగించే కొలమానాలు మాత్రమే ఇందుకుపయోగ పడవు. ఒక స్పష్టమైన భావజాల చైతన్యం, దృక్పథం ఉన్న కార్యకర్తలు మాత్రమే ఇలాంటి అధ్యయనాలకు న్యాయం చెయ్యగలుగుతారు. పైగా ఇలాంటి అధ్యయనం చెయ్యడానికి పెద్ద సంఖ్యలో కార్యకర్తలూ, డబ్బూ కూడా అవసరం.

దీన్ని అధిగమించడానికి నా సూచన – వీక్షణం పత్రికకు వందలాది మంది చదువరులూ / పాఠకులూ ఉన్నారు. వీరిలో అత్యధిక భాగం సమాజం పట్ల నిబద్ధత కలిగినవారు, గ్రామీణ ప్రాంతాలతో సంబంధం ఉన్నవాళ్లు, లేదా గ్రామీణ ప్రాంతాలలో ఉద్యోగం చేస్తున్న వాళ్లు, నిజాయితీతో కూడిన తాత్విక దృక్పథం కలవాళ్లు ఉన్నారు. ఈ సైన్యాన్ని వీక్షణం సక్రమంగా ఉపయోగించుకుంటే ఆంధ్ర దేశంలో మనం అనుకుంటున్న రీతిలో గ్రామీణ ప్రాంతాల అధ్యయనం సుసాధ్యమే. దీనికోసం ఎవరినీ ప్రత్యేకంగా నియమించవలసిన అవసరం లేదు. నిధుల అవసరం కూడా చాలా వరకు ఉండదు. గ్రామాలలో నివసిస్తున్న పాఠకులు ఆయా గ్రామాల పరిస్థితుల్ని అధ్యయనం చెయ్యడం తేలిక. గ్రామాలలో పుట్టి, జీవిక కోసం ఇతర ప్రాంతాలలో ఉంటున్న వాళ్లు ఓ సంవత్సర కాలంలో మూడు నాలుగు పర్యాయాలు వాళ్ల స్వగ్రామాలకు వెళ్లి పరిస్థితులను పరిశీలించవచ్చు. ఇలా ఎవరికి వారు గ్రామాలలో చేసిన అధ్యయనం వివరాలను వీక్షణానికి పంపితే వాటన్నిటినీ విశ్లేషించి ఒక సమగ్ర చిత్రాన్ని రూపొందించడం సాధ్యమవుతుంది.

ఇదంతా జరగడానికి ముందు అధ్యయన ప్రాధాన్యత గురించి మాత్రమే కాక, ఏయే రంగాలలో ఏయే అంశాల ప్రాతిపదికన, ఏయే కోణాలలో ఆ అధ్యయనం చెయ్యడానికి ఎలాంటి పద్ధతులను అనుసరించాలో, సేకరించిన అంకెల నుండి, సూత్రాలను ఎలా రూపొందించాలో వీక్షణం తన పాఠకులకు తెలియపర్చాలి. నా అభిప్రాయంలో ఆర్థిక అంశాలతోపాటు, ఆర్థికేతర అంశాలపై కూడా ఈ విధంగా పరిశీలన జరపాలి.

1) భూ యాజమాన్యంలో మార్పులు, 2) ఆర్థిక వలసలు, 3) ఉత్పత్తి సాధనాల వాడుకలో యాజమాన్యంలో మార్పులు, 4) కుల సమీకరణల్లో వస్తున్న మార్పులు, 5) ఒక ఆర్థిక యూనిట్‌గా కులంలో వస్తున్న మార్పులు, 6) విద్య, వైద్యం వంటి మౌలిక రంగాలతో పాటు, ఆడంబరాలు, పెళ్లిళ్లు, ఆధునిక సౌకర్యాల కొనుగోళ్లు వంటి వాటికి పెడుతున్న ఖర్చులు, 7) గ్రామంలో రాజకీయీకరణలో మార్పులు, 8) గ్రామీణుల రాజకీయ చైతన్య స్థాయి.

ఇలాంటి సమగ్రమైన గ్రామీణ ప్రాంతాల అధ్యయనం, అధ్యయనానికి సంబంధించిన చారిత్రక అవసరాన్ని నెరవేర్చడం తన చారిత్రక బాధ్యతగా వీక్షణం గుర్తించాలని కోరుతున్నాను.

**– సి.ఎస్.ఆర్. ప్రసాద్**
*గుంటూరు*

వీక్షణం నవంబర్ 2011, జనవరి, ఫిబ్రవరి 2012 సంచికలలో ప్రచురించిన 'భాషా ప్రయుక్త రాష్ట్రాలపై అంబేద్కర్' కృష్ణ ఆదిత్య, లోకే రాజ్‌పవన్‌ల వ్యాసాలు చదివిన తర్వాత ఒక విషయం మాత్రం తేటతెల్లమైంది. అంబేద్కర్ తన రచనలలో ఎక్కడా చిన్న రాష్ట్రాలకు అనుకూలమని ఇదమిద్ధంగా తేల్చి చెప్పలేదని అన్యాపదేశంగా ఒప్పుకుంటూనే రాజ్‌పవన్, అంబేద్కర్ మహారాష్ట్రను మూడు రాష్ట్రాలుగా విభజించడానికి, వాటి అభివృద్ధి స్థాయిని బట్టి 1955లో రాసిన రచనలో ప్రతిపాదించిన అంశాన్ని తెలంగాణకు వర్తింపచేసి తన వాదనను సమర్థించుకునే వ్యర్థ ప్రయత్నం చేశారు. ఇంకో విషయం, మహారాష్ట్రలో ఈ ప్రతిపాదన అమలు కానప్పటికీ అంబేద్కర్ ఊహించినట్లు వేర్పాటు ఉద్యమాలు ఏవీ బలంగా రాలేదనేది గమనార్హం. అనగా అంబేద్కర్ అంచనా వేసినట్లు భయంకర అసమానతలకు ఆయా ప్రాంతాలు గురి కాలేదు. కృష్ణ ఆదిత్య అభిప్రాయపడినట్లు, ఎంత పెద్ద నేతలు చెప్పిన విషయాలైనా వాటిని విశ్లేషించుకుని ప్రజల ప్రయోజనాల దృష్ట్యా తగిన డిమాండ్‌ల సాధనకై ప్రజాస్వామ్యయుతంగా ప్రజా ఉద్యమాలను నడవలసిన అగత్యాన్ని గుర్తిస్తే అందరికీ మంచిది. అలా కాక అంబేద్కర్ ఇప్పుడు ఉండి ఉంటే తప్పకుండా తెలంగాణ ఏర్పాటును సమర్థించి ఉండేవారిని బల్లలు గుద్ది మరీ ప్రచారం చేయడంలో ఔచిత్యం లేదు. ఇలాంటి ప్రజాస్వామిక చర్చలకు అవకాశం కల్పించిన వీక్షణం సంపాదకులకు కృతజ్ఞతలు.

**– కె. సుభాష్**
*మహబూబ్‌నగర్*

వీక్షణం సెప్టెంబర్ 2011 నుంచి జనవరి 2012 వరకు ఐదు భాగాల సీరియల్‌గా వచ్చిన రమేష్ పట్నాయక్ వ్యాసం 'భారతదేశంలో భూస్వామ్య విధానం ఉందా?' చాలా ఆసక్తికరంగా ఉంది. అనేక ప్రశ్నలను లేవనెత్తింది. ఈ మధ్యకాలంలో ఆలోచనాపరులూ, ఆర్థికవేత్తలూ భారతదేశంలోకి పెట్టుబడిదారీ విధానం వచ్చేసింది అనే దృష్టితోనే విశ్లేషణలు చేస్తున్నారు. మరోపక్క విప్లవోద్యమం భారత దేశాన్ని అర్ధభూస్వామ్య, అర్ధవలస దేశంగా అర్థం చేసుకొని నూతన ప్రజాస్వామిక విప్లవం కోసం తన ఎత్తుగడలను రూపొందించుకుంది. అనేక చర్చా వేదికల్లో కూడ దున్నే వారికే భూమి నినాదానికి కాలం చెల్లింది అనే అభిప్రాయమూ వ్యక్తం అవుతోంది. విప్లవోద్యమం నూతన ప్రజాస్వామికం కోసం కాదని, సోషలిజం కోసం పోరాటాలు చేయాలనే వాదనలు ఉన్నాయి. వీటిని పరిశీలిస్తున్న ఒక సామాన్య పాఠకుడిగా నాకొక సందేహం – మన రాష్ట్రంలో నలభై లక్షలకు పైగా ఉన్న కౌలు రైతులు భూమి అవసరాన్ని సూచిస్తున్నారా లేదా? తాము పండించకుండా భూమిని కలిగి ఉన్న ఆసాముల నుంచి భూమిని స్వాధీనం చేసుకొని సన్న, చిన్నకారు రైతులకూ, రైతు కూలీలకూ పంచాలా లేదా? భారత దేశంలోకి పెట్టుబడి మాత్రమే వచ్చిందా, పెట్టుబడిదారీ విధానం వచ్చిందా? లాంటి విషయాలపై లోతైన చర్చను వీక్షణం కొనసాగిస్తుందని ఆశిస్తున్నాను.

**– ఎస్. అప్పారావు**
*కరీంనగర్*

## దాణా కుంభకోణం

**1995**లో జరిగిన దాణా కుంభకోణం కేసులో 64 మందిని సిబిఐ ప్రత్యేక కోర్టు దోషులుగా తేల్చింది. వీరికి 2 నుండి 6 ఏళ్ల వరకు శిక్షతో పాటు వేర్వేరుగా 5 లక్షల వరకు జరిమానా విధిస్తూ సిబిఐ కోర్టు జడ్జి ఎన్.ఎన్. సింగ్ జనవరి 31న తీర్పు ఇచ్చారు. శిక్షపడిన వారిలో 32 మంది అధికారులున్నారు.

## 2జి స్పెక్ట్రమ్ లైసెన్స్‌ల రద్దు

**యు**పిఎ ప్రభుత్వం 2008 తర్వాత కేటాయించిన నూట ఇరవై రెండు 2జి స్పెక్ట్రమ్ లైసెన్స్‌లను రద్దుచేయాలని సుప్రీం కోర్టు ఆదేశించింది. ఆ కుంభకోణం వల్ల ఖజానాకు రు. 1.76 వేల కోట్ల నష్టం వాటిల్లిందని కాగ్ నివేదిక తేల్చింది. అవినీతి మానవ హక్కులను హరిస్తుందని, అభివృద్ధిని అడ్డుకుని న్యాయం, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వాలను అణగదొక్కేస్తుందని జస్టిస్ గంగూలీ అన్నారు. అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న 126 మంది ఉద్యోగులపై విచారణకు ప్రభుత్వం అనుమతించడంలేదని ఆయన అన్నారు. 2జి స్పెక్ట్రమ్ కేటాయింపులు అన్నీ అక్రమమేనని, వాటిని రద్దుచేయాలని కోరుతూ ప్రముఖ న్యాయవాది ప్రశాంత్ భూషణ్ పిటిషన్‌పై స్పందిస్తూ 2జీ లైసెన్స్‌లన్నిటినీ సుప్రీంకోర్టు రద్దుచేసింది.

## సామాన్యులను కబళిస్తున్న కల్తీ మద్యం

**ఒ**డిశాలోని కటక్‌లో కల్తీ మద్యం తాగి 23 మంది మృతి చెందారు. చనిపోయిన వారిలో చాలామంది దినసరి కూలీలే. ఫిబ్రవరి 6 రాత్రి మద్యం సేవించిన తరువాత ఛాతి, కంటి నొప్పులు రావడంతో వారిని ఆస్పత్రికి తరలించారు. జింగర్, సురవి అనే బ్రాండ్ ఆయుర్వేదిక్ మద్యాన్ని సేవించడం వల్లనే మరణాలు సంభవించి ఉండొచ్చని రాష్ట్ర ఎక్సైజ్ కమిషనర్ సుదర్శన్ నాయక్ తెలిపారు. గత డిసెంబర్‌లోనూ పశ్చిమ బెంగాల్‌లోని దక్షిణ 24 పరగణ జిల్లాలో 171 మంది కల్తీ మద్యం తాగడం వల్లే మరణించారు.

## మీడియా స్వేచ్ఛకు విఘాతం

**మీ**డియా స్వేచ్ఛను హరిస్తున్నారంటూ పలు రాష్ట్రాల నుంచి ఫిర్యాదులు అందుతున్నాయని ప్రెస్ కౌన్సిల్ ఛైర్మన్ జస్టిస్ మార్కండేయ కట్జూ ఫిబ్రవరి 3న మీడియాకు తెలిపారు. దీనిపై క్షేత్ర స్థాయిలో పరిస్థితిని తెలుసుకునేందుకు ఆయా రాష్ట్రాలకు నిజ నిర్ధారణ బృందాలను పంపనున్నట్లు తెలిపారు. ఫిర్యాదులు ఎక్కువగా వస్తున్న ప్రాంతాలకు ఈ బృందాలను పంపుతామన్నారు. తమకు వస్తున్న ఫిర్యాదుల్లో పాత్రికేయులపై భౌతిక దాడులకు పాల్పడడం, వివిధ ప్రభుత్వాలు, ఏజెన్సీలు మీడియాను లొంగదీసుకునేందుకు అడ్వర్‌టైజ్‌మెంట్స్ నిలిపివేయడం వంటివి ఎక్కువగా జరుగుతున్నాయని కట్జూ తెలిపారు.

## జర్నలిస్టు కుటుంబం హత్య

**భో**పాల్‌లోని ఉరియా జిల్లాలో సీనియర్ పాత్రికేయుడు చంద్రికా రాయ్ (42), ఆయన భార్య (40), కుమారుడు (19), కూతురు (17) తో సహా కుటుంబం మొత్తాన్ని ఫిబ్రవరి 18న హత్యచేశారు. చంద్రికా రాయ్ హిందీ దినపత్రిక నవభారత్, ఆంగ్ల దినపత్రిక ద హితవాద పత్రికలకు ఫ్రీలాన్సర్‌గా పనిచేస్తున్నారు. ఆయన అక్రమ ఖనిజ తవ్వకాలపై నవభారత్‌లోనూ, ద హితవాదలోనూ వరుస కథనాలు రాసారు. ఈ ప్రాంతంలో జరుగుతున్న అక్రమ మైనింగ్‌పై ఆయన అనేక వాస్తవాలు వెలుగులోకి తెచ్చారు. దీన్ని జీర్ణించుకోలేని మైనింగ్ మఫియానే రాయ్‌ని హత్యచేసి ఉండవచ్చునని స్థానికులు భావిస్తున్నారు.

## మైనింగ్ అక్రమాలు

**అ**క్రమ మైనింగ్‌పై కఠిన చర్యలు చేపట్టాలని కేంద్ర సాధికార సమితి (సిఇసి) సుప్రీం కోర్టుకు సిఫార్సు చేసింది. నిబంధనలను అతిక్రమించిన కర్ణాటకకు చెందిన 49 మైనింగ్ కంపెనీల లైసెన్సులను రద్దుచేయాలని తెలిపింది. గనుల లీజుల్లో అక్రమాలకు పాల్పడినవారి నుంచి వందల కోట్ల రూపాయల జరిమాన వసూలు చేసి బాధిత ప్రాంతాల అభివృద్ధికి వినియోగించాలని సూచించింది. దేశ మైనింగ్ విధానంలో మార్పులు చేసే విధంగా నివేదికను తయారుచేసి పి.వి. జయకృష్ణ సారథ్యంలోని సిఇసి సుప్రీంకోర్టుకు సమర్పించింది. కర్ణాటకలోని అక్రమ మైనింగ్ కారణంగా రు.18 వేల కోట్ల నష్టం రాగా, ప్రమాణాలు పాటించకుండా తరలించిన ఖనిజం వల్ల రోడ్లు, పంట పొలాలు, నీటి వనరులతో సహా మొత్తం పర్యావరణ విధ్వంసం జరిగింది. ఈ విషయాలు సిఇసి ప్రాథమిక సమాచార అంచనాలు తెలుపుతున్నాయి. ఈ కారణంగా ముడి ఖనిజ వ్యాపారంపై సుప్రీంకోర్టు నిషేధం విధించింది.

## తస్లిమా పుస్తక విడుదల వివాదం

**త**స్లిమా నస్రీన్ స్వీయ చరిత్రలోని ఏడో భాగం 'నిర్బాసన్' (బహిష్కరణ) ఫిబ్రవరి 1న కోల్‌కతాలో సంప్రదాయవాదుల నిరసనల మధ్య విడుదలయింది. కోల్‌కతా పుస్తకమేళాలోని ఆడిటోరియంలో ఈ పుస్తకం విడుదల కావాల్సిఉండగా, శాంతి భద్రతల దృష్ట్యా అక్కడ విడుదల చేసేందుకు పుస్తక మేళ నిర్వాహకులు అనుమతించలేదు. దీంతో ప్రచురణ సంస్థ 'పీపుల్స్ బుక్ సొసైటీ' ఆడిటోరియం వెలుపలనే ఈ పుస్తకాన్ని ఆవిష్కరించారు.

## జాతీయ శాంతి భద్రతల చట్టం

**జా**తీయ స్థాయిలో ఉగ్రవాద వ్యతిరేక కేంద్రం (ఎన్‌సిటిసి) ఏర్పాటుకు యుపిఎ ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. ఎన్‌సిటిసి ఏర్పాటుకు కేంద్రం నోటిఫికేషన్ జారీచేసింది. రాష్ట్రాల జాబితాలోని అంశంపై వాటిని సంప్రదించకుండానే కేంద్రం నిర్ణయం తీసుకోవడాన్ని కాంగ్రెసేతర రాష్ట్రాలు తప్పుపడుతున్నాయి. జాతీయ ప్రయోజనాలతో ముడిపడిన అంశంపై రాష్ట్రాల అనుమతి అవసరంలేదని కేంద్రం అంటోంది. కేంద్ర ప్రభుత్వం, కేంద్ర హోం శాఖ సంయుక్త కార్యదర్శి, రాష్ట్ర హోం కార్యదర్శి అనుమతితోనే ఎవరినైనా అరెస్ట్ చేయడం, ఆస్తులు స్వాధీనం చేసుకోవడం చేసేవారు. ఎన్‌సిటిసిలో ఆ అధికారం ఇంటెలిజెన్స్ బ్యూరో అధికారులకు కట్టబెట్టారు అని ఆయా రాష్ట్రాల ముఖ్యమంత్రులు విమర్శిస్తున్నారు.

## ఐదు రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలు

**మ**ణిపూర్‌లో జనవరి 28న ఎన్నికలు జరిగాయి. 60 శాసనసభ స్థానాలకు 279 మంది పోటీపడుతున్నారు. 82 శాతం పోలింగ్ నమోదయింది. జనవరి 30న పంజాబ్, ఉత్తరాఖండ్ ఎన్నికలు జరిగాయి. పంజాబ్‌లోని 117 అసెంబ్లీ స్థానాలకు 417 మంది పోటీపడుతున్నారు. 77 శాతం పోలింగ్ నమోదయింది. ఉత్తరాఖండ్‌లోని 70 అసెంబ్లీ స్థానాలకు 788 మంది పోటీపడుతున్నారు. 70 శాతం పోలింగ్ నమోదయింది. ఉత్తరప్రదేశ్‌లోని 403 స్థానాలకు ఏడువిడతలుగా జరుగుతున్నాయి. 6వ విడత జనవరి 28న జరిగింది. గోవాలో మార్చ్ 3న ఎన్నికలు జరుగనున్నాయి. మార్చ్ 6న ఓట్లు లెక్కించనున్నారు. వీ

## 'అంతరిక్షాని'కి పాకిన అవినీతి

దేశంలో ఈ మధ్య జరిగిన ఆదర్శ్, కామన్‌వెల్త్, 2జి స్పెక్ట్రమ్ కుంభకోణాలు వెలుగులోకి వచ్చాయి. అవినీతి విస్తరిస్తూ చివరికి భారత అంతరిక్ష (ఇస్రో) సంస్థను చుట్టుముట్టింది. ఇస్రో వాణిజ్య విభాగం అయిన ఆంట్రిక్స్ కార్పొరేషన్ ఎస్-బ్యాండ్ స్పెక్ట్రమ్‌లో 90 శాతాన్ని దేవాస్ కంపెనీకి లీజుకిచ్చింది. ఇస్రో దేశ ప్రధాని ప్రత్యక్ష పర్యవేక్షణలో పనిచేస్తుంది. దేశ ప్రయోజనాలకు విరుద్ధంగా, నిబంధనలను ఉల్లఘించి స్పెక్ట్రమ్‌ను ప్రైవేటు సంస్థకు లీజుకిచ్చింది. దీనికి ప్రధాన బాధ్యులు ఇస్రో మాజీ చైర్మన్ జి. మాధవన్ నాయర్ సహా నలుగురు శాస్త్రవేత్తలుగా కమిటీ గుర్తించింది. వీరిని భవిష్యత్‌లో ప్రభుత్వరంగంలోని ఉద్యోగాలకు తీసుకోరాదని కేంద్ర అంతరిక్ష పరిశోధన శాఖ జనవరి 25న ఆదేశాలు జారీచేసింది. ఇస్రో వాణిజ్య విభాగమైన యాంట్రిక్స్ ఎస్-బ్యాండ్ స్పెక్ట్రమ్‌లో 90 శాతాన్ని ప్రైవేట్ సంస్థ అయిన దేవాస్ కంపెనీకి లీజుకివ్వడానికి 2005లో ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందం వల్ల ప్రభుత్వం రెండు లక్షల కోట్ల రూపాయలు నష్టపోయే ప్రమాదం ఉందని కాగ్ నివేదిక వెల్లడించింది. ఈ అవకతవకలను నిర్ధారించడానికి కేంద్రం ప్రభుత్వం మూడు కమిటీలతో విచారణ జరిపించింది. ఆ కమిటీల నివేదికల ఆధారంగానే ప్రభుత్వం శాస్త్రవేత్తలపై చర్య తీసుకుంది. ఇదే ప్రభుత్వం మాదవన్ నాయర్‌కి గతంలో దేశంలోనే గుర్తింపుపొందిన పద్మవిభూషణ్ అవార్డునిచ్చి సత్కరించింది. రాజ్యాంగంలోని లొసుగులను, అధికారాన్ని ఉపయోగించుకొని అధికారులు, పాలకులు కలిసి దేశ సహజ సంపదను, సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రైవేట్ సంస్థలకు, విదేశీ బహుళజాతి సంస్థలకు మామూలు ధరలకు కట్టబెడుతున్నారు. దేశ రక్షణ వ్యవస్థలో అత్యంత కీలకమైనదయిన ఇస్రో కూడా మన అధికారుల, పాలకుల అవినీతి నుంచి తప్పించుకోలేకపోయింది. మన దేశ అంతరిక్ష రహస్యాలు దేశ ప్రజలకు మాత్రమే 'రహస్యం' కాని వాటిని ప్రైవేట్ సంస్థలకు, బహుళజాతి సంస్థలకు కట్టబెట్టడంలో అంతా బహిర్గతమే. వరుస అవినీతి కుంభకోణాలు బహిర్గతం అవడం వల్ల ప్రజల్లో తమ పై నమ్మకం పోతుందేమోనన్న భయంతో కొందరిని అరెస్ట్‌చేసి, జైళ్లలోపెట్టి ప్రజల్ని భ్రమింపచేసే ప్రయత్నం ముమ్మరంగా కొనసాగుతోంది. మాధవన్ నాయర్‌తోపాటు ముగ్గురు శాస్త్రవేత్తలను తొలిగించడం సరే, ఇస్రో నడిచేది ప్రధాని పర్యవేక్షణలోనే కదా?

## మోడీని వెంటాడుతున్న మారణకాండ

గుజరాత్‌లో గోద్రా ఘటన అనంతరం జరిగిన అల్లర్లలో వందలాది దుకాణాలు తగులబెట్టబడ్డాయి. అందులో నష్టపోయిన వారికి పరిహారం ఇవ్వాలన్న తన ఆదేశాలను పాటించుకోనందుకు గుజరాత్ హైకోర్టు నరేంద్రమోడీ సర్కార్‌కు ధిక్కార నోటీసులు జారీచేసింది. నాటి అల్లర్లలో దుకాణాలు తగలబడిన 56 మంది బాధితులు దాఖలు చేసిన పిటిషన్‌ను జస్టిస్ అఖిల్ ఖురేషీ, జస్టిస్ సి.ఎల్. సోనీలతో కూడిన ధర్మాసనం విచారించింది. పరిహారం ఇవ్వనందుకు కోర్టు ధిక్కార చర్యలు ఎందుకు తీసుకోగూడదో మార్చి14లోగా చెప్పాలని అహ్మదాబాద్ జిల్లా కలెక్టర్‌ను బెంచ్ ఆదేశించింది. అల్లర్లలో తమ మత పరమైన కట్టడాలు ధ్వంసం అయ్యాయని, వీటిని పునర్‌నిర్మాణం చేయాలని ఇస్లామిక్ రిలీఫ్ కమిటీ ఆఫ్ గుజరాత్ 2002లో హైకోర్టులో పిటిషన్ దాఖలు చేసింది. ఈ పిటిషన్ ఆధారంగా వందలాది ప్రార్థనాలయాల విధ్వంసానికి మోడీ ప్రభుత్వ అలసత్వమే కారణమైందని రాష్ట్ర హైకోర్టు ఫిబ్రవరి 8న తీర్పునిచ్చింది. వాటిని పునర్‌నిర్మించడానికి ప్రభుత్వమే నష్టపరిహారం చెల్లించాలని తాత్కాలిక చీఫ్ జస్టిస్ భాస్కర్ భట్టాచార్య, జస్టిస్ జె.బి. పరిద్‌వాలాతో కూడిన బెంచ్ ఆదేశించింది. గుల్బర్గ్ హౌసింగ్ సొసైటీ అల్లర్లలో కాంగ్రెస్ మాజీ ఎం.పి ఎహసాన్ జాఫ్రీ సహా 69 మంది ఒకే రోజు మరణించారు. ఇదే సందర్భంలో జరిగిన మత కల్లోలాలలో 1200 మంది మరణించారు. దీనిపై సుప్రీం ఆదేశాల మేరకు ఏర్పాటు చేసిన సి.బి.ఐ మాజీ చీఫ్ ఆర్.కె. రాఘవన్ నేతృత్వంలోని కమిటీ ఇచ్చిన నివేదికను ఇంతవరకు బహిరంగ పర్చలేదు. 2004 జూన్ 15వ తేదీన ముంబైకి చెందిన ఇష్రత్, మరో ముగ్గురు యువకులను పోలీసులు ఎన్‌కౌంటర్ పేరుతో కాల్చి చంపారు. పోలీసులు ఎన్‌కౌంటర్ చేశారని చెపుతున్న దాంట్లో వాస్తవంలేదని సి.బి.ఐ వెల్లడించింది. 2002 నుంచి 2006 మధ్య జరిగిన 22 ఎన్‌కౌంటర్లపై విచారణ జరిపే కమిటీ అధిపతిగా సుప్రీంకోర్టు మాజీ న్యాయమూర్తినే నియమించాలని స్పష్టం చేసింది. ఇప్పటివరకు ఆ కమిటీకి అధిపతిగా ఉన్న సుప్రీం మాజీ న్యాయమూర్తి జస్టిస్ ఎం.బి. షా స్థానంలో తమను సంప్రదించకుండానే మాజీ న్యాయమూర్తి జస్టిస్ కె.ఆర్. వయాస్‌ను గుజరాత్ సర్కార్ నియమించిన తీరును సుప్రీంకోర్టు వ్యతిరేకించింది. హిందువులు చేస్తున్న దాడులను చూసి చూడనట్లు వదిలేయాలని పోలీసులను మోడీ ఆదేశించారని బాంబే హైకోర్టు రిటైర్డ్ జడ్జ్ జస్టిస్ ఎచ్. సురేష్ తెలిపారు. గుజరాత్ అల్లర్ల అనంతరం సందర్శించిన ప్రజా విచారణ కమిటీ సభ్యుల్లో సురేష్ ఒకరు. గుజరాత్ ప్రభుత్వం ప్రజలను భయ భ్రాంతులకు గురిచేస్తూ, ప్రజల అభద్రతపై, నమ్మకాల ఆధారంగా విద్వేశాలు ఎగదోసి తన పాలన కొనసాగిస్తోంది.

## స్విస్ బ్యాంకుల్లో రు. 25 లక్షల కోట్లు

అవినీతి వ్యతిరేక చర్యలు - ఆస్తుల స్వాధీనం అనే అంశంపై ఇంటర్‌పోల్ ప్రపంచస్థాయి సమావేశం మొదటిసారి ఢిల్లీలో ఫిబ్రవరి 13న జరిగింది. ఈ సదస్సులో 18 దేశాలకు చెందిన దర్యాప్తు అధికారులు పాల్గొన్నారు. దేశ సరిహద్దులు దాటి జరుగుతున్న ఆర్థిక నేరాల రహస్యాలను కనుక్కోవడం, అక్రమ సొమ్మును స్వాధీనం చేసుకునే పద్ధతులను గురించి ఈ సమావేశంలో పంచుకున్నారు. ఈ సమావేశాన్ని సి.బి.ఐ డైరెక్టర్ ఎ.పి. సింగ్ ప్రారంభించారు. స్విస్ బ్యాంకులలో మూలుగుతున్న భారత సొమ్ము గురించిన వివరాలు వెల్లడించారు. స్విస్ బ్యాంకుల్లో రు. 25 లక్షల కోట్ల నల్ల ధనాన్ని భారతీయులు దాచినట్లు వెల్లడించారు. స్విస్ బ్యాంకులలో దాచిన సొమ్ములో అత్యధికంగా భారత్‌కు చెందినవేనని వెల్లడించారు. గ్లోబల్ ఫైనాన్షియల్ ఇంటెగ్రిటీ అనే అంతర్జాతీయ సంస్థ విదేశాల్లో భారతీయులు దాచుకున్న నల్లధనం రు. 25 లక్షల కోట్లు అని ఇటీవల ప్రకటించింది. ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్నేషనల్ సంస్థ ఇచ్చిన వివరాల ప్రకారం చూస్తే అతి తక్కువ అవినీతి గల దేశాల్లో అగ్రస్థానంలో ఉన్న న్యూజిలాండ్, ఐదో స్థానంలో ఉన్న సింగపూర్, ఏడో స్థానంలో ఉన్న స్విట్జర్లాండ్ వంటి దేశాలే మన దేశంలోని అక్రమ ధనాన్ని దాస్తున్నాయని ఎ.పి. సింగ్ పేర్కొన్నారు. అవినీతి మానవ హక్కులను హరిస్తుందని, అభివృద్ధిని అడ్డుకుని న్యాయం, స్వేచ్ఛ, సౌభ్రాతృత్వాలను అణగదొక్కేస్తుందని మాజీ టెలికం మంత్రి రాజా కేసు తీర్పులో జస్టిస్ ఎ.కె. గంగూలీ వ్యాఖ్యానించారు. అధికారులకు కల్పించే రక్షణ అవినీతికి అండ కాకూడదన్నారు. అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న 126 మంది ఉద్యోగులపై విచారణకు ప్రభుత్వం అనుమతివ్వడంలేదన్నారు. పెద్దఎత్తున అవినీతికి పాల్పడడం, అవినీతిని నిరోధించడం కోసమే ఒక సదస్సు జరుపుకోవడం, వాటికోసమే కమిటీలు వేయడం, కోర్టులు పనిచేయడం ఇదీ మనల్ని పాలిస్తున్న పాలకుల తీరు.

**వార్త - వ్యాఖ్య : వై. రామచంద్రం** వీ

## రైతులకు అప్పులివ్వండి

ప్రభుత్వం ప్రోత్సహించిన వ్యవసాయ ప్రాజెక్టులకు అప్పులిచ్చేందుకు తిరస్కరించే ప్రైవేట్ బ్యాంకులను జాతీయం చేసే విషయాన్ని పరిశీలిస్తానని వెనిజులా అధ్యక్షుడు హ్యూగో ఛావెజ్ హెచ్చరించారు. వెనిజులాలో చట్టాన్ని అనుసరించి బ్యాంకులిచ్చే అప్పుల్లో ప్రభుత్వ అభివృద్ధి ప్రాజెక్టులకు కనీసం పది శాతం ఇవ్వాలి. ఆయన వారం వారం ఇచ్చే టివి, రేడియో కార్యక్రమంలో మాట్లాడుతూ రాజ్యాంగాన్నీ, చట్టాలనూ అనుసరించేలా చూడాల్సిన అవసరముందనీ పెద్ద ప్రైవేట్ బ్యాంకులు నిబంధనలను అనుసరించడం లేదనీ అన్నారు. గత సంవత్సరం జాతీయ అసెంబ్లీలో ఛావెజ్ మిత్రపక్షాలు ఆమోదించిన ఒక బిల్లులో బ్యాంకింగ్ రంగాన్ని ప్రజా సేవల రంగంగా అభివర్ణించారు. ప్రజా వినియోగానికి సంబంధించినవిగా ప్రకటిస్తూ వాటిని జాతీయం చేసే అధికారాన్ని కూడా ఆ బిల్లు ప్రభుత్వానికిచ్చింది.

## అసమానతలు తొలగించాలి

ప్రపంచ ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కొనేందుకు స్పష్టమైన చర్యలు తీసుకోవాలనీ వరల్డ్ సోషల్ ఫోరమ్ (డబ్ల్యూ.ఎస్.ఎఫ్.) పిలుపునిచ్చింది. ఐదు రోజుల పాటు బ్రెజిల్‌లోని పోర్టో అలెగ్రేలో జరిగిన సమావేశాలు జనవరి 29న ముగిసాయి. ఈ సమావేశంలో సామాజిక, పర్యావరణ న్యాయానికి మద్దతుగా ప్రపంచ కార్యాచరణ కోసం జూన్ 5న వీధుల్లోకి రావాల్సిందిగా ప్రపంచ పౌరులకు పిలుపునిచ్చారు. పన్నెండు సంవత్సరాలుగా పోర్టో అలెగ్రేలో జరుగుతున్న డబ్ల్యు.ఎస్.ఎఫ్. సమావేశాలు వచ్చే సంవత్సరం ఈజిప్ట్ రాజధాని కైరోలో జరపాలని సదస్సు నిర్ణయించింది.

## పడవ ప్రమాదంలో 100 మంది మృతి

సోలోమన్ సముద్రంలో పపువా న్యూగినియా తీరం వద్ద ఫిబ్రవరి 2న జరిగిన పడవ ప్రమాదంలో వంద మందికి పైగా ప్రయాణికులు మరణించారు. పడవలో ఉన్నవారిలో ఎక్కువ మంది విద్యార్థులేననీ, పాఠశాలలు ప్రారంభించడంతో తిరిగి స్వస్థలానికి వెళుతుండగా ఈ దుర్ఘటన జరిగిందనీ ఆస్ట్రేలియా సహాయక బృందం తెలిపింది. పడవలో దాదాపు 350 మంది ప్రయాణిస్తుండగా, సహాయక సిబ్బంది సుమారు 200 మందిని కాపాడారనీ, మిగిలిన వారి జాడ తెలియలేదనీ తెలిపారు.

## హోండురాస్ జైల్లో అగ్ని ప్రమాదం

హోండురాస్ జైల్లో ఫిబ్రవరి 14న జరిగిన అగ్ని ప్రమాదంలో దాదాపు 360 మంది మరణించారు. జైల్లో ఉన్నవారిలో సగానికి కన్నా ఎక్కువ మంది ఇంకా విచారణలో ఉన్నవారే. ఇదే జైల్లో ఇంతకు ముందు కూడా 2003, 2004లో అగ్ని ప్రమాదాలు సంభవించాయి. సామర్థ్యం కన్నా రెట్టింపు మందిని జైల్లో కిక్కిరిసి ఉంచడంతో మరణాల సంఖ్య భారీగా సంభవించింది.

## యూరప్‌లో చలి

యూరప్‌లో గత నెలరోజులుగా తీవ్రంగా చలి పెరిగిపోయింది. ఉష్ణోగ్రత మైనస్ 30 డిగ్రీల వరకు పడిపోయింది. చలి వల్ల దాదాపు 600 మంది వరకు మరణించారు. జనజీవనం స్తంభించిపోయింది. రవాణా, విద్యుత్‌లకు తీవ్ర అంతరాయం ఏర్పడింది. నిత్యావసరాలు, తాగునీరు అందక ప్రజలు తీవ్ర అవస్థలుపడ్డారు. విమాన ప్రయాణాలు కూడా దెబ్బతిన్నాయి. ముఖ్యంగా ఇల్లు లేనివారూ, వృద్ధులూ, చిన్న పిల్లలూ చలి వల్ల తీవ్రంగా ఇబ్బంది పడ్డారు. ఇటీవల కాలంలో యూరప్‌లో చలి తీవ్రత ఇంత పెరగాడనికి అడవుల నిర్మూలన, వాతావరణ సమతుల్యత దెబ్బతినడమే ముఖ్య కారణమని పర్యావరణ నిపుణులు హెచ్చరించారు.

## ఇండోనేషియాలో భారీ కుంభకోణం

ఇండోనేషియాలోని డెమోక్రటిక్ పార్టీ మాజీ ట్రెజరర్ ముహమ్మద్ నాజరుద్దీన్ భారీ అవినీతికి పాల్పడ్డారు. 2011లో జరిగిన సౌత్ ఈస్ట్ ఏషియన్ గేమ్స్ కోసం గ్రామాల నిర్మాణానికి ఇచ్చిన కాంట్రాక్టుల్లో జరిగిన కుంభకోణంలో దాదాపు 3 మిలియన్ డాలర్ల అవినీతి జరిగినట్లు బయటపడింది. దీంతో ఆయనను ఇండోనేషియా అవినీతి నిరోధక శాఖ అధికారులు నిర్బంధించారు. ఈ అవినీతిలో ఇండోనేషియా ప్రభుత్వంలో ఉన్న కీలక మంత్రుల పాత్ర ఉన్నట్లు విచారణలో వెల్లడవుతోంది.

## అమర్త్యసేన్‌కు హ్యూమానిటీస్ అవార్డు

ప్రముఖ ఆర్థికవేత్త, నోబెల్ ఆర్థిక అవార్డు గ్రహీత అమర్త్యసేన్‌కు నేషనల్ హ్యూమనిటీస్ అవార్డు దక్కింది. పేదరిక నిర్మూలన, ఆకలిపై పోరులో సామాజిక అవగాహన పెరుగుదలకు గాను ఆయనకు ఈ అవార్డు లభించింది. ఫిబ్రవరి 14న? అమెరికా అధ్యక్ష భవనం వైట్‌హౌస్‌లో అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా చేతుల మీదుగా అమర్త్యసేన్ ఈ అవార్డును అందుకున్నారు.

## శ్రీలంకలో ఆర్థిక సంస్కరణలు

శ్రీలంకలో అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐ.ఎం.ఎఫ్.) ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా నిరసనలు మొదలయ్యాయి. ఈ విధానాల వల్ల పెట్రోల్ ధరలు, నిత్యావసర ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ఫిబ్రవరి 13న వేలాది మంది మత్స్యకారులు వీధుల్లోకి వచ్చి రోడ్లను నిర్బంధించారు. నిరసన ప్రదర్శనలు జరిపారు. ప్రదర్శనకారులను పోలీసులు అడ్డగించడంతో ఘర్షణ మొదలవడంతో ప్రభుత్వం సైన్యాన్ని రంగంలోకి దింపింది. సైన్యం జరిపిన కాల్పుల్లో ఒక మత్స్యకారుడు మరణించాడు. ఐ.ఎం.ఎఫ్. విధానాల వల్ల చమురు ధరలు 30 నుంచి 50 శాతం వరకు పెరిగిపోయాయి. ముఖ్యంగా మధ్యతరగతి, పేద వర్గాల ప్రజలపై తీవ్ర ప్రభావం పడనుంది. చమురు ధరలు పెరగడంతో రవాణా చార్జీలు పెరిగి, నిత్యావసర ధరలు పెరిగి పోయాయి. విద్యుత్ చార్జీలను కూడా 20 నుంచి 40 శాతం పెంచేశారు.

## మాల్దీవుల్లో తిరుగుబాటు

మాల్దీవుల్లో సైన్యానికీ, పోలీసులకూ మధ్య గత కొన్ని రోజులుగా జరుగుతున్న ఘర్షణలు అధ్యక్షుడు మొమహద్ నషీద్ పదవీ నుంచి వైదొలగాల్సిన పరిస్థితికి తీసుకొచ్చాయి. ప్రజలూ, పోలీసులూ తిరగబడడంతో నషీద్ ఫిబ్రవరి 7న ఈ నిర్ణయం తీసుకోవాల్సి వచ్చింది. కొత్త అధ్యక్షుడుగా మొహమ్మద్ వహీద్ హసన్ ఎన్నికయ్యారు.

## ఈజిప్ట్‌లో తొలగని సైనిక పాలన

ఈజిప్ట్‌లో హోస్నీ మూబారక్‌ను పదవీచ్యుతుని చేసి ఏడాది అయిన సందర్భంగా జనవరి 26న తెహ్రీర్ స్క్వేర్ వద్ద వేలాది మంది ప్రజలు క్యాంపులు ఏర్పాటు చేసి వార్షికోత్సవం జరుపుకున్నారు. ఈ సందర్భంగా కొత్తగా ఏర్పాటైన ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజలు నిరసనలు తెలియజేశారు. ముబారక్ ప్రభుత్వంలో రక్షణ మంత్రిగా ఉన్న ఫీల్డ్ మార్షల్ ముహమ్మద్ హుస్సేన్ తాంతవీ నేతృత్వంలోని సైనిక మండలి అధికారాన్ని చేపడుతోంది. సైనిక పాలనలో పరిస్థితులు ఇంకా దుర్భరంగా మారాయని ప్రజలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ప్రజా విప్లవంతో ముబారక్‌ను తరిమేసినా కూడా ప్రజల స్థితిగతులు ఏమీ మారలేదని ప్రజలు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. నిత్యావసర ధరలు, నిరుద్యోగం పెరగడంతో ప్రజలు తీవ్ర అవస్థల పాలవుతున్నారు. వెంటనే సైనిక పాలన అంతం కావాలని ప్రజలు కోరుతున్నారు. కాగా, మస్సాద్ నగరంలో గ్యాస్ పైప్‌లైన్‌పై బాంబు దాడి జరిగింది. దీంతో ఈజిప్ట్ నుంచి ఇజ్రాయెల్‌కు గ్యాస్ సరఫరా నిలిచిపోయింది. ఈజిప్ట్ మాజీ అధ్యక్షుడు హోస్నీ ముబారక్‌ను పదవీచ్యూతుడిని చేసిన తరువాత గత ఏడాది కాలంగా ఈ పైప్‌లైన్‌పై పదకొండు సార్లు దాడి జరిగింది. ఈజిప్ట్ ఇజ్రాయెల్ మధ్య ఇరవై ఏళ్లకు గాను గ్యాస్ సరఫరా చేసే ఒప్పందం ఉంది. ఇదే సమయంలో, ఫిబ్రవరి 1న ఈజిప్ట్‌లోని పోర్ట్ సయిద్‌లో ఒక ఫుట్‌బాల్ మ్యాచ్ సందర్భంగా ఇరు జట్ల మద్దతుదారుల మధ్య జరిగిన ఘర్షణల్లో 74 మంది మరణించారు. వందలాదిగా గాయపడ్డారు. అగ్రశ్రేణి సాకర్ క్లబ్‌లు అల్‌మస్రీ, అల్ అహ్లీల మధ్య జరిగిన ఈ మ్యాచ్‌లో అల్‌మస్రీ, అల్ అహ్లీను 3-1 తేడాతో ఓడించింది. దీంతో అల్‌మస్రీ మద్దతుదారులు మైదానంలోకి దూసుకెళ్లారు. అల్ అహ్లీ ఆటగాళ్లతో పాటు వారి మద్దతుదారులపై మారణాయుధాలతో దాడిచేసారు. ఈ సందర్భంగా ఇరువర్గాల మధ్య ఘర్షణ జరిగింది. వేలాది మంది ప్రాణభయంతో పరుగులు తీశారు. స్టేడియం తలుపులు మూసేసి ఉండడంతో తొక్కిసలాట జరిగి ఎక్కువ మంది మరణించారు. కొందరు నేరుగా బాల్కనీ పైనుంచి దూకడంతో మరణించారు. ఈ దారుణానికి సైన్యమే కారణమని నిరసనలు మొదలయ్యాయి. రెండు మూడురోజుల పాటు జరిగిన అల్లర్లలో మరో పదిమంది మరణించారు. ఫిబ్రవరి 3న నిరసనకారులు సైన్యం నేతృత్వంలోని ప్రభుత్వానికి వ్యతిరేకంగా ర్యాలీ నిర్వహించారు. కైరోలోని హోంమంత్రిత్వ శాఖ భవనం ముట్టడి చేశారు. వారిని చెదరగొట్టేందుకు పోలీసులు జరిపిన కాల్పుల్లో నాలుగు వందల మంది దాకా గాయపడ్డారు.

## అప్పు ఊబిలో గ్రీస్

ఒకప్పుడు అత్యధిక కొనుగోలు శక్తి, ఉత్తమ జీవన ప్రమాణా లతో బాగా బతుకుతున్న గ్రీస్ దేశం ఉన్నట్టుండి ఒక్కసారిగా అప్పుల సంద్రంలో మునిగిపోయింది. దానికి కారణం అక్కడి ప్రభుత్వం పొదుపు చర్యల్లో భాగంగా వేతనాల్లో భారీగా కోతలు విధించింది. పన్నులను ఏకంగా రెండింతలూ, మూడింతలూ చేసింది. గ్రీస్ దేశపు స్థూల జాతీయోత్పత్తి కన్నా ఆ దేశ రుణాలే ఎక్కువయ్యాయి. ప్రస్తుతం ఆ దేశ రుణం 485 బిలియన్ డాలర్లు. స్థూల జాతీయోత్పత్తి కంటే 60 శాతం ఎక్కువ. ఈ ఆర్థిక మాంద్యం నుంచి బయటపడేందుకు వేల కోట్ల యూరోలు అవసమరయ్యాయి. అంతర్జాతీయ ద్రవ్య నిధి (ఐఎంఎఫ్), యూరోపియన్ సెంట్రల్ బ్యాంక్ బెయిలవుట్ ప్యాకేజీలు ప్రకటించాయి. వాటి కోసం విధించిన నిబంధనల ప్రకారం ప్రభుత్వ ఉద్యోగుల జీతాలు, బోనస్, పెన్షన్‌లలో కోత విధించారు. పన్నులు పెంచేశారు. ప్రభుత్వం ఆధ్వర్యంలో పరిశ్రమల నుంచి ఉద్యోగుల సంఖ్య తగ్గించేలా చర్యలు తీసుకుంటున్నారు. ప్రైవేట్ ఉద్యోగుల జీతాలలో కూడా కోతలు విధించడం మొదలుపెట్టారు. ఆర్థిక పరిస్థితిని బట్టి కార్మికుల జీతాలు తగ్గించేలాగా, వారిని ఉద్యోగాల నుంచి తొలగించేలా పరిశ్రమల యాజమాన్యాలకు వెసులుబాటు కల్పించేలా ప్రత్యేక చట్టాలు రూపొందించాయి. దీంతో ప్రజలు పెద్ద ఎత్తున ఆందోళనలు చేపట్టారు. రాజధాని ఏథెన్స్‌లో పార్లమెంట్ భవనం వద్ద ఉద్యోగులు, కార్మికులు, విద్యార్థులు వేలాదిగా నిరసన తెలిపారు.

## సిరియాలో పెచ్చరిల్లుతున్న హింస

సిరియా అధ్యక్షుడు బషర్ అసద్ గద్దె దిగాలని డిమాండ్ చేస్తూ గత కొంతకాలంగా ప్రజలు ఆందోళన కార్యక్రమాలు చేపడుతున్నారు. వీరిపై ప్రభుత్వ బలగాలు పెద్ద ఎత్తున దాడులు జరుపుతున్నాయి. ఇప్పటికే వేలాది మంది మరణించారు. బాంబు దాడులతో సిరియా దద్దరిల్లిపోతోంది. హోమ్స్ నగరంలో జరిగిన బాంబు దాడిలో ఒక్కరోజే రెండు వందల మంది దాకా మరణించారు. వందలాది మంది క్షతగాత్రులయ్యారు. అధ్యక్షుడు అసద్‌కు వ్యతిరేకంగా ప్రజలు వీథుల్లోకి నిరసన కార్యక్రమాలు చేపట్టారు. అసద్ మద్దతుదారులు కూడా ఆయనకు మద్దతుగా ప్రదర్శనలు చేపట్టడంతో ఇరువర్గాల మధ్య ఘర్షణలు చోటు చేసుకున్నాయి. ఈ పరిస్థితులలో సిరియాపై యూరోపియన్ యూనియన్ (ఇయు) తీవ్రమైన ఆంక్షలు విధించాలని నిర్ణయం తీసుకుంటోంది. పరిస్థితిని చక్కదిద్దేందుకు రష్యా మధ్యవర్తిత్వం వహించడానికి ముందుకు వచ్చింది. అధికారపక్షంతోనూ, ప్రతిపక్షంతోనూ చర్చించి, ఆర్థిక సంస్కరణలు, హింసకు కారణమవుతున్న సమస్య పరిష్కారానికి దారి వెతకడానికి ప్రయత్నించి విఫలమైంది. ఇయు మాత్రం అసద్ గద్దె దిగడమే దీనికి పరిష్కారమని చెబుతోంది. సిరియా ప్రజలు తమ దేశ విషయాల్లో బయటివారి ప్రమేయం అవసరం లేదనీ, తామే తమ దేశ భవిష్యత్తును సరిదిద్దుకుంటామనీ తేల్చి చెప్పేశారు.

## ఆక్యుపై ఉద్యమాలకు రాజకీయ స్ఫూర్తి

అంతర్జాతీయ పెట్టుబడిదారీ విధానం అనేక సంక్షోభాలను సృష్టించిందనీ, ఆ సంక్షోభాలకు వ్యతిరేకంగా ప్రపంచ వ్యాప్తంగా నిరసనలు, ఆందోళనలు, తిరుగుబాట్లు జరుగుతున్నాయనీ, వాటిలో ఆక్యుపై వాల్‌స్ట్రీట్‌తో సహా అన్ని ఆక్యుపై ఉద్యమాలు శిఖరాయమాన మైనవనీ, కానీ ఆ ఉద్యమాలు రాజకీయ స్ఫూర్తిని కలుపుకోవాలని యాభై మంది ప్రపంచ ప్రసిద్ధ మార్క్సిస్ట్ మేధావులు ఒక బహిరంగ లేఖ రాశారు. 'ఇప్పటికప్పుడు రాజకీయాలు తెలుసుకోండి' అనే శీర్షికతో సాగుతున్న ఈ ప్రయత్నంలో ఒక వెబ్‌సైట్‌తో పాటు ప్లూటో ప్రెస్ అనే వామపక్ష ప్రచురణ సంస్థ ప్రచురించిన మార్క్సిస్ట్ సిద్ధాంత గ్రంథాలను ప్రచారం చేస్తున్నారు.

వార్త – వ్యాఖ్య : సి. రాజశేఖర్ వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 డిసెంబర్ 2011 నుండి 31 జనవరి 2012 వరకు 13 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1800)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** | **(20)** | **(21)** | **(22)** |
| ఆదిలాబాద్ | – | 4 | – | 20 | 18 | 6 | 5 | 4 | – | – | 2 | 3 | 2 | 3 | 19 | 29 | – | – | – | 2 | – |
| హైదరాబాద్ | – | – | – | 9 | 10 | – | – | – | 1 | 3 | 4 | 13 | – | – | 20 | 11 | – | – | – | 9 | – |
| కరీంనగర్ | 2 | 17 | 28 | 62 | 76 | 35 | 47 | 9 | 6 | 23 | 6 | 13 | 6 | 14 | 36 | 72 | – | – | – | 18 | 10 |
| ఖమ్మం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| మహబూబ్‌నగర్ | – | 9 | – | 10 | 16 | 1 | 1 | 1 | – | 1 | 8 | 15 | 11 | 14 | 37 | 17 | – | – | – | – | – |
| మెదక్ | – | 3 | – | 11 | 12 | 3 | 8 | – | – | 2 | 3 | 2 | 1 | 8 | 41 | 6 | – | – | – | – | – |
| నల్గొండ | – | 1 | – | 13 | 15 | 3 | 7 | – | – | 6 | 4 | 7 | 1 | 6 | 50 | 23 | – | – | – | 3 | 3 |
| నిజామాబాద్ | – | – | – | 4 | 6 | – | – | – | 1 | 1 | 4 | 8 | 11 | 2 | 23 | 20 | – | – | – | – | – |
| రంగారెడ్డి | 2 | 8 | – | 7 | 28 | 8 | 10 | 2 | 4 | 8 | 2 | 4 | 6 | 8 | 51 | 16 | – | – | – | – | 1 |
| వరంగల్ | – | 1 | – | 6 | 8 | 9 | 9 | 6 | 6 | 4 | – | – | 3 | 9 | 13 | 8 | – | – | – | – | 2 |
| అనంతపూర్ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| చిత్తూరు | – | 4 | – | 16 | 18 | 3 | 7 | – | – | – | 4 | 9 | 14 | – | 42 | – | – | – | – | – | – |
| గుంటూరు | | | | | | | | | | | | | | | | | | | | | |
| నెల్లూరు | – | – | – | 2 | 7 | – | – | – | – | 1 | – | – | 1 | 4 | 33 | 15 | – | – | – | – | – |
| కర్నూలు | – | 9 | – | 11 | 13 | 6 | 7 | 9 | 5 | 7 | 4 | 10 | 4 | 8 | 32 | 26 | – | – | – | – | – |
| విశాఖపట్నం | – | – | – | 3 | 8 | 1 | 2 | – | 3 | 7 | – | 3 | 2 | 2 | 32 | 12 | – | – | – | 5 | – |
| **మొత్తం** | **4** | **56** | **28** | **174** | **235** | **75** | **103** | **31** | **26** | **63** | **41** | **87** | **62** | **78** | **429** | **255** | **–** | **–** | **–** | **37** | **16** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి;
మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – ఎస్. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్;
అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; గుంటూరు – బి. అంజమ్మ ;
నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; ప్రకాశం – ఎల్. సాంబశివరావు, విజయనగరం – డి. సుధాకర్
కరీంనగర్ వివరాలు నవంబర్ 21 నుండి జనవరి 31 వరకు ఇవ్వడమైనది.




పేజీలు : 224    వెల : రు. 100

వ్యవసాయ అర్థశాస్త్ర నైపుణ్యాన్నీ, ప్రపంచ రాజకీయార్థిక అవగాహననూ, ప్రజాపక్షపాతాన్నీ కలగలిపిన ఈ వ్యాసాలు గత రెండు దశాబ్దాలలో రాష్ట్రంలోనూ, దేశంలోనూ జరిగిన అనేక రాజకీయార్థిక పరిణామాల స్వరూపాన్నీ, అసలు స్వభావాన్నీ వివరిస్తాయి. నూతన ఆర్థిక విధానాలు ప్రారంభమైన నాటి నుంచి ప్రారంభించి మన వ్యవసాయ రంగానికి ఏం జరుగుతూ వస్తున్నదో సన్నిహితంగా, నిశితంగా పరిశీలించి చెప్పిన వ్యాసాలివి. జనరల్ అగ్రిమెంట్ ఆన్ ట్రేడ్ అండ్ టారిఫ్స్ (గాట్) చర్చల సరళి ఎలా సాగిందో, డంకెల్ డ్రాఫ్ట్ పేరిట పేద, వ్యవసాయ దేశాల మెడలకు ఉరితాడు ఎలా బిగించబడిందో, ప్రపంచ వాణిజ్య సంస్థ ఏర్పాటు వెనుక కుట్రలేమిటో, ఈ సామ్రాజ్యవాద నిర్దేశిత వ్యవసాయ విధానాల కింద మన రైతాంగం, పల్లె సీమలు ఎలా విధ్వంసమయ్యాయో, వ్యవసాయ రంగాన్ని పునరుద్ధరించడానికి ప్రజా ఉద్యమాలు, సమాజం ఏమి చేయవలసి ఉందో దిశానిర్దేశం చేసిన వ్యాసాలు.

## వ్యవసాయం – ప్రపంచీకరణ

### కె.ఆర్. చౌదరి

ప్రతులకు : **వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

---




పేజీలు : 440    వెల : రు. 200

# మహోదయం

## జాతీయ పునరుజ్జీవనంలో గురజాడ స్థానం

### కె.వి.ఆర్.

కె.వి.ఆర్., శారదాంబ స్మారక కమిటీ ప్రచురణ

ప్రతులకు :

**డా.ఎస్. రామకృష్ణ**
శాంతి నర్సింగ్‌హోమ్, నిర్మలా కాన్వెంట్ ఎదురుగా,
పటమట, విజయవాడ – 520 010. సెల్ :98490 83137

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

